త్వరలో విడుదల!







వి. శాంతారాం ప్రొడక్షన్స్

సెహ్రా (ఈస్ట్‌మన్ కలర్ హిందీ చిత్రం)

కొత్త నటుడు ప్రశాంత్

ఉల్లాస్ లలితాపావర్ మన్‌మోహన్‌కృష్ణ ఎం రాజన్, ముంతాజ్ నటించిన

సాంఘిక చిత్రం

కథ — షమ్స్‌లఖ్నవీ

పాటలు — హస్రత్‌జయ్‌పురి

దర్శకత్వం — వి. శాంతారాం



# ఈ సంచికలో


పావని ★ కథ

ఆలపాటి
లక్ష్మీనరసింహారావు ★ పనికిమాలినవాడు

దాశరథి ★ వలపుపాటలు

టి ఎస్ లక్ష్మి ★ ఏమిటీ బంధం?

డా॥ ఎ నారాయణరెడ్డి ★ శృంగారనాయికలు

కొడవటిగంటి కృష్ణమూర్తి ★ కూతురు

ఆర్ పద్మనాభం ★ సైకిల్ సవారీ

బుజ్జాయి (బొమ్మల కథ) ★ డుంబు

పాతూరి ప్రసన్నం ★ ఎంధించిన దర్శ ం


ఈ సంచికనుండి
కోడూరి కౌసల్యాదేవి గారి
చక్రనేమి సీరియల్

## యువతీలోకం


జి సరోజా యాజ్ఞవల్క్య — ప్రేమవివాహాలు భగ్నమౌతున్నాయా

కె ఎ సావిత్రీ రెడ్డి — అయ్యో ఆడపిల్ల


ముఖచిత్రం కథ

చిత్రకారుడు వడ్డాది పాపయ్య

త్వరలో విడుదల!

శ్రీకృష్ణసాయి ఫిలింస్ వారి




# పెంచినప్రేమ

నిర్మాత
యర్రా అప్పారావు

దర్శకత్వం
కృష్ణన్ పంజు

స్టూడియో...ఏవి.ఎమ్ * శ్రీఫిలింస్




యువ ఉగాది సంచిక అత్యంత రమణీయముగ నున్నది. "సుప్రభాతం" మానవాళి జీవితాలకే నవసుప్రభాతం అనితీరాలి. ఇదే సంచికలోని కథలు "సరాగరాగం" "భరతుని మువ్వ" చాల బాగున్నవి. సదాశివగారి "ఉర్దూకవుల ప్రేయసి'' నారాయణ రెడ్డిగారి "కిన్నెర సాని" వ్యాసములు ఆంధ్ర సాహితీమ తల్లికి నీరాజనాలు అని చెప్పక తప్పదు. రచయితలకు పత్రికాభిముఖంగ నా ధన్యవాదములు

వి విశ్వాసుందరి
ఇచ్ఛాపురం

ఏప్రిల్ నెల యువలో కథలన్నీ సాఫీగానే వున్నాయి. హాస్యపు కార్టూన్లు కవ్వించి నవ్వించాయి. చిత్ర పరిచయ పోటీ నిలుపుదల చేయుచున్నాము. మరొక నూతన శీర్షికను ప్రారంభించ గలమని ప్రకటన చేసియున్నారు. ఆ నూతన పోటీ శీర్షిక త్వరలో నే ప్రారంభించెదరని ఆశించుచున్నాను.

హెచ్. రామన్ గౌడ్
గుంటకల్.


గ్రామ్స్ : యువ    ఫోన్ : 32387

లైన్, హాఫ్‌టోన్

మల్టీకలర్ బ్లాకుల కొరకు

యువ ప్రాసెస్

వారిని సంప్రదించండి.

పబ్లిక్ గార్డెన్ రోడ్, హైదరాబాద్-1

# పొదుపుకోసం అమృతాంజన్ అట్టపెట్టెల్లో వస్తోంది




నేడు మన దేశపు ఆదాయము రక్షణ కొరకు అవసరము సాధారణంగా పరిచితమైన అమృతాంజన్ డబ్బా తయారుచేయడానికి కావలసిన టిన్ రేకు నేడు జాతీయ అత్యవసరాలకు కేటాయింపబడినది. కాబట్టి దీనికి బదులు మేము క్రొత్త రకం పొదుపైన అట్టపెట్టె వాడుతున్నాము. ఇంతేగాకుండా సీసాలో నమ్మకమైన అమృతాంజన్ అందజేయడానికి మోసంచేయడానికి వీలులేకుండా 'అలు'కాప్ ('Alu'-cap) తో సీసా సీలు చేయబడింది. ■పూర్వం ఎప్పటికంటే కూడా ఇప్పుడు మీకు అమృతాంజన్ ఎక్కువ అవసరము కంతల నొప్పులు, బెణుకులు గుండె జలుబులు. కీళ్ళ నొప్పులు, ఆరోగ్యం చెరచి నీరసపరచి అధికంగా కావలసిన ఉత్పత్తులను తగ్గించే రోగాలు నిర్మూలించడానికి సహకరిస్తుంది.

*అమోఘమైనది, మిత వ్యయంతో కూడినది, అనేక విధాల ఉపయోగపడేది*

అమృతాంజన్ అమోఘంగా పనిచేసే నొప్పుల నివారణిని మీరు కొనవచ్చు. ఇటువంటి మందులన్నిటికంటె దీనిలో గుణావహకమైన ఔషధాలు అధిక పరిమాణాల్లో ఉంటాయి. దీనిలో ఏకమైయున్న మందులు బాధలను నివర్తించి వెంటనే ఉపశమనం కలిగించడానికి శరీర చర్మంలో అతి శీఘ్రంగాను లోతుగాను ప్రవేశిస్తాయి. ప్రతీసారి మీకు ఏ నాలుగు వడ్లగింజల ఎత్తో అమృతాంజన్ కావలసి ఉంటుంది ఇంట్లో ఇంటిల్లిపాదీ ఉపయోగించినా ఒక బుడ్డి నెలల తరబడి ఉపయోగానికి వస్తుంది.




## అమృతాంజనము

ఆరోగ్యం ఇస్తుంది

అమృతాంజన్ లిమిటెడ్ 14/15 లజ్ చర్చి రోడ్, మద్రాసు

JWT AM/2225a

యువ ఉగాది సంచిక ఆశించిన దాని కన్నా ఎక్కువ ఆకర్షణీయంగా, సుందరంగా తయారై వచ్చింది. వీణా పాణి ముఖచిత్రం చాలా చక్కగా వుంది. పత్రికాలోకంలో వడ్డాదివారి చిత్రాలు చాలా అందంగా వుంటున్నవి. ఆ ప్రముఖ చిత్రకారుని కివే నా అభినందనలు.

క్రొత్తరకం పోటీకొరకు ఎదురు చూస్తున్నా.

సల్లా దత్తాత్రేయులు
మోరి.

"యువ" ఉగాది సంచికను ఎక్కువ పేజీలతో మామూలు ధరకే అందజేయడం పాఠకులపై మీకుగల అభిమానాన్ని తెలుపుతున్నది. "ధనికొండ" వారి "మానవ సేవ" దాసరి సుబ్రహ్మణ్యం గారి "భక్తి మదం" చాల బాగున్నాయి.

మామూలుగా ప్రచురించే కొన్ని శీర్షికలు ఒక్కొక్క నెల శలవు తీసుకుంటున్నాయి. అలాకాక ప్రతి నెలా ప్రచురించమని కోరిక.

వడ్లమాని రామం
పుల్లేటికుఱ్ఱు.

యువ ఉగాది సంచికలో చిన్నదయినా ముద్దా విశ్వనాథంగారి 'తక్కిన ఇద్దరూ' అన్న కథ ఎంతో తీయగా వుంది. ఇంతటి చక్కని సాహిత్యం అందిస్తున్న సంపాకులకు ధన్యవాదములు.

ఎక్కలంక రామారావు
అనపర్తి.


యువ

సచిత్ర మాసపత్రిక

చందా వివరాలు

| | | |
|---|---|---|
| సంవత్సరిచందా (దీపావళి ప్రత్యేక సంచిక మినహా) | ... | రు. 8-00 |
| సంవత్సరచందా (దీపావళి ప్రత్యేక సంచికతో సహా) | ... | రు. 11-00 |
| రెండు సంవత్సరాలకు | ... | రు. 20-00 |

వెంటనే చందాదారుగా చేరండి.

మీ వ్యాపారం రెట్టింపు కావాలంటే చక్కని
ప్రచారం అవసరం

# నియోన్ సైన్లు

మీ వస్తువుల గుణాన్ని వేనోళ్ళ చాటగలవు,
గౌరవాన్ని పెంచగలవు

# *Neon Signs*

**SPEAK WELL OF YOUR GOODS & ENHANCE THE PRESTIGE DOUBLY**

వివరాలకు :

## NEOLITE INDUSTRIES

CHUDI BAZAAR HYDERABAD
PHONE 72879

పెళ్ళిళ్ళకు, శుభకార్యాలకు తగ్గ అనేక రకాల వస్త్రాలు

6 గ. నుండి 9 గ. వరకు; రూ. 50 నుంచి రూ. 500 వరకు ధరల్లో; రకరకాల కొత్త డిజైనుల చీరెలు కాశ్మీరు, బెనారసు, మైసూరు, కంచి, ధర్మవరం, గద్వాల, సిల్కులు, ఉలెన్‌లు, చేనేత వస్త్రాలు, బిన్నీ, సేలం-చీరెలు, ధోవతులు, రగ్గులు, బెడ్‌షీట్లు మొదలగునవి.

# తుంగ సత్తయ్య

(హోల్‌సేల్ & రిటెయిల్ వస్త్ర వ్యాపారం)

కోఠీ, సుల్తాన్ బజార్, హైదరాబాదు.

దేవిక
సౌందర్య రహస్యం

'లక్స్ వల్ల నా చర్మ సౌందర్యం అతిమనోహరం'
అనుచున్నది ఈ సుందర తార






లక్స్ టాయ్‌లెట్ సబ్బు
సినీమా తారలకు సౌందర్యమునిచ్చే శుద్ధమైన సౌమ్యమగు సబ్బు
4 వానవెల్లి రంగులలోను, తెలుపులోను వున్నది

హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి

LTS 146 77 TL



అన్నపూర్ణా వారి

# చదువుకున్న అమ్మాయిలు

నిర్మాత డి. మధుసూదనరావు B.A  దర్శకుడు ఆదుర్తి సుబ్బారావు  సంగీతం రాజేశ్వరరావు

నవయుగ విడుదల

యువ
సచిత్ర మాస పత్రిక

సంచాలకుడు: చక్రపాణి

సంపుటి 7 మే 1963 సంచిక 5

ప్రభుత్వ వ్యవహారభాషగా హిందీని అమలులోకి తేవడం, క్రమంగా ఇంగ్లీషును ఆ స్థానంలోనుంచి తొలగించడం. వీలైనంత త్వరగా జరుగవలసిన పని. కాని, దీనికి దేశంలో కొన్ని ప్రాంతాలలో, ముఖ్యంగా తమిళనాడులో, ప్రబలమైన ప్రతి ఘటన వున్నది. ఈ ప్రతిఘటన ఎక్కువగా రాజకీయాలమీద ఆధారపడి వున్నది.

మనకు స్వాతంత్ర్యంవచ్చి 16 సంవత్సరాలు అయింది. భాషాప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడి ఏడేళ్ళు అయింది. అప్పటినుంచీ, కేంద్రప్రభుత్వమూ, రాష్ట్రప్రభుత్వాలూ తెలివితేటలతో ప్రవర్తించినట్లయితే, యీనాడు హిందీ సమస్య వుండేదికాదు. మన ప్రభుత్వాల ఉదాసీనతవల్లనే యీనాడు ఇదొక సమస్య అయింది.

మన దేశంలో ప్రభుత్వ వ్యవహారాలను నిర్వహించుకోవడానికి మనం విదేశీ భాషను ఉపయోగించుకోనక్కరలేదు. ప్రజల భాషలోనే ప్రభుత్వ వ్యవహారాలు జరగాలి. ఆ ప్రాతిపదికమీదనే, భాషా రాష్ట్రాలు ఏర్పడినవి. కాని, భాషా ప్రయుక్త రాష్ట్రాలలో ఆ రాష్ట్రాల భాషలో ప్రభుత్వ వ్యవహారాలను నడపడం పూర్తిగా అవలంబించకపోవడమే ప్రభుత్వం చేసిన తప్పులలో పెద్దది. ఇప్పటికయినా యీ తప్పును సవరించుకొని, ప్రతి రాష్ట్ర ప్రభుత్వమూ ఆ రాష్ట్ర పరిపాలన ఆ రాష్ట్రంలోని అధిక సంఖ్యాకులు మాట్లాడే భాషలోనే ప్రారంభించినట్లయితే, దేశభాష విషయంలో

మొదటి ఆటంకం తొలగిపోతుంది. పొలానికి నీళ్ళు కావాలని రైతు పెట్టుకొనే అర్జీగాని, నీళ్ళు ఇవ్వడానికి వీలులేదని తాసిల్దారు ఇచ్చే జవాబుగాని, త్రాగి తందనాలు ఆడే వ్యక్తిమీద పోలీసులు వ్రాసే కేసు రిపోర్టుగాని, ఆ వ్యక్తికి జుల్మానా విధిస్తూ మేజస్ట్రీటు చెప్పే తీర్పుగాని ఇంగ్లీషు భాషలో ఎందుకు వుండాలి? మామూలుగా ప్రజలు మాట్లాడే భాషలో ఇలాటి కార్యక్రమాలు ఎందుకు జరుగ కూడదు? కూరగాయల అంగడికి వెళ్ళి తెలుగు భాషలో బేరంచేసుకునే పెద్దమనిషి, ఇంగ్లీషు బోర్డుకట్టిన షాపులోకి వెళ్ళి, ఆ షాపులోవున్న పనివాళ్ళు తెలుగు వాళ్ళయి నప్పటికీ అక్కడ మాత్రం ఇంగ్లీషులో వ్యాపారం మాట్లాడడం సాగిస్తాడు. ఇది చాలా అధ్వాన్నమైన పరిస్థితి. కూరగాయల అంగడి యజమానీ, మందులషాపులో కెమిస్టు, రైల్వే బుకింగ్ ఆఫీసులో క్లర్కు, తాలూకా మేజస్ట్రీటు కోర్టులో మేజస్ట్రీటు తెలుగువాళ్ళు అయినప్పుడు, వీరితో పనివుండి వెళ్ళే తెలుగువాడు ఉభయులకూ మాతృభాష అయిన తెలుగును కొన్నిచోట్ల వదలిపెట్టి ఇంగ్లీషుభాషలో వ్యవహారం చేసుకోవడం, ఇంగ్లీషు ప్రభుత్వం అంతరించిన 16 సంవత్సరాల తరువాత కూడా ఇంకా మనలను అంటిపెట్టుకొనివున్న దురదృష్టం. ఒకప్పుడు లాటిన్ భాషా ప్రయుక్తమైన తమ మత, పరిపాలనా వ్యవస్థలనుంచి లాటిన్‌కు పూర్తిగా స్వస్తి చెప్పి, తమ సాంస్కృతిక, రాజకీయ, మత వ్యవహారాలను ఇంగ్లీషులోనే జరుపు కోవడం, ఇంగ్లీషువారు ప్రారంభించలేదా? ప్రజల వ్యవహారాలకు ప్రజలు మాట్లాడే భాషను ఉపయోగించడం ప్రారంభించడానికి రాష్ట్రప్రభుత్వాలు విపరీతంగా జాప్యం చేస్తున్నవి. శాసనసభలలో చర్చలు పూర్తిగా రాష్ట్రభాషలోనే జరిగినట్లయితే, శాసనాలను గూడా రాష్ట్రభాషలోనే తయారుచెయ్యడం సులభమవుతుంది. ప్రస్తుతం వున్నపద్ధతి ఏమిటంటే, శాసనాలను ఇంగ్లీషుభాషలో తయారుచెయ్యడం, వాటిని రాష్ట్రభాషలో తర్జుమాచెయ్యడం. ఈ పద్ధతివల్ల సహజమైన రాష్ట్రభాషలో శాసనాలు తయారుకావడం లేదు. ఇంగ్లీషుకు తెలుగు తర్జుమాలు అయోమయమైన భాషలో వుంటున్నాయి. మొదటివ్రాతయే తెలుగులో జరిగితే, అదిసహజమైనభాషగావుంటుంది.

భాష విషయంలో రాష్ట్ర ప్రభుత్వాలు ఒక ఖచ్చితమైన విధానాన్ని అవలం బించకపోతే, రాష్ట్ర ప్రభుత్వానికీ, ప్రభుత్వోద్యోగులకూ ప్రజలకూ చిక్కులు వుంటూనే వుంటాయి. ఉదాహరణకి, ఆంధ్రరాష్ట్రాన్ని తీసుకుందాము. ఆంధ్ర రాష్ట్రం భాషా సిద్ధాంతంపైన ఏర్పడిన రాష్ట్రం. మూడు కోట్ల అరవై లక్షల జనాభా గల యీ రాష్ట్రంలో, తెలుగు మాతృ భాష కానివారు బహుశా ఏభై

అరవై. లక్షలమంది కూడా వుండరు. వారికి రాష్ట్రభాషను నేర్చుకోవడం అతితేలిక ఈనాడు స్కూళ్ళలోవారంతా ఆ భాషను నేర్చుకుంటూనే వుంటారు. అంచేత రాష్ట్ర ప్రభుత్వవ్యవహార భాషగా ఒక్క తెలుగునే అమలులోపెట్టవచ్చును. తెలుగు మాతృ భాషకానివారికి వారి మాతృభాషను బోధించడానికీ, వారి సంస్కృతిని వారు మరచి పోకుండా వుండడానికీ ప్రభుత్వం సదుపాయాలు కలిగించవలసిందే. కాని, పరి శీలనా వ్యవహారాలకు మాత్రం, మరొక భాషను దేనినీ కూడా ప్రభుత్వం అంగీక రించ కూడదు. అలాటి నిర్ణయం జరిగినట్లయితే, రాష్ట్రంలో మంచి ఐక్యత ఏర్పడు తుంది. అనవసరమైన చిక్కులు తొలగిపోతవి.

ఇదే సూత్రం, భారతదేశం అంతటికీ వర్తిస్తుంది. ప్రతి రాష్ట్రమూ తన రాష్ట్ర వ్యవహారాలను రాష్ట్ర భాషలో జరుపుకొంటున్నప్పుడు, అంతర రాష్ట్రీయ వ్యవహారాలకు హిందీని కేంద్ర ప్రభుత్వ భాషగా అమలుజరుపవలసిందే. అయితే యీ పని ఎప్పుడు జరగాలి? హిందీ భాషను అన్ని స్కూళ్ళలోనూ బోధిస్తు అందరికీ యీ భాష వచ్చేటట్టు చేసిన తరువాత.

ఇంగ్లీషు భాషను నేర్చుకోవడం నిర్బంధంగా అమలు జరుపుతూవున్నప్పుడు హిందీ భాషనుకూడా ఎందుకు నిర్బంధంగా బోధించకూడదు? ఈ సంవత్సరం ఒకటవ తరగతినుంచీ హిందీభాషను నిర్బంధంగా బోధించడం మొదలుపెడితే పది సంవత్సరాల తరువాత యీనాడు హిందీ ప్రారంభించిన వారందరికీ క్షుణ్ణంగా హిందీ వచ్చివుంటుంది. తమిళనాడులో ఇప్పుడువచ్చిన చిక్కేమిటంటే, హిందీని నిర్బంధంగా బోధించడానికి కొన్ని వర్గాలవారు అంగీకరించడం లేదు. ఆ వర్గాల వారే, ప్రభుత్వ వ్యవహార భాషగా హిందీని అమలుజరపడానికి రాష్ట్ర ప్రజలందరూ అంగీకరించినదాకా, దానిని అమలు జరపకూడదని ఆందోళనచేస్తున్నారు. హిందీని అసలే నేర్చుకోనివారు ఆ భాషను పరిపాలనా భాషగా అమలు జరపడానికి అంగీక రిస్తారా? నిర్బంధంగా హిందీని స్కూళ్ళలో బోధించడం అమలు జరగనంతవరకు పరిపాలనా భాషగా హిందీని అమలు జరపడానికి ప్రతిఘటన వుంటూనే వుంటుంది పిచ్చికుదిరితేగాని పెళ్ళికాదు, పెళ్ళి అయితేగాని పిచ్చికుదరదు అనే పరిస్థితిలో పిచ్చివుండగానే పెళ్ళిచెయ్యడం తప్ప మార్గంలేదు.

అంచేత, ప్రభుత్వ పరిపాలనా భాషగా హిందీని అమలు జరపడం విషయంలో ప్రయత్నాలను ప్రస్తుతం కట్టిపెట్టి, దేశంలోని అన్ని స్కూళ్ళలోనూ నిర్బంధంగా హిందీని బోధించే పద్ధతిని అమలు జరిగేటట్టు చూడడమే, కేంద్ర ప్రభుత్వం ఇప్పుడు చెయ్యవలసినపని. 




"అసలే కోతి, కల్లుతాగింది, నిప్పు తొక్కింది"—అన్న సామ్యం ఎన్నిసార్లు చెప్పుకున్నా నవ్వు పుట్టిస్తూనే వుంటుంది. అవాంతర పరిస్థితి ఏర్పడినప్పటి నుంచీ "ఆకాశవాణి" ఆంధ్ర కేంద్రాల ధోరణి దాదాపు అలాగే వినిపిస్తున్నది.

అసలే అది అశరీరవాణి. వాతావరణానికీ, రిసీవింగ్ సెట్ల యాంత్రికంగాంగకాలకూ చిర్రు బుర్రుమనే గుణం. ప్రభుత్వపరంగా నిర్వహించబడేది గనక అధికార ప్ర'మత్త' స్వభావం. తామేవేళ ఏది ఎలా ప్రసారం చేసినా 'కిం' అనే వాళ్ళు లేరని, ఎవడో అలౌకికుడుంటే తామే ప్రసార కేంద్రాల దాపులకు రాకుండా వెలివేయగలమని మస్తుగా భావించి 'మత్తుగా' నిర్వహించుకుంటున్నారు కార్యక్రమాలు.

ఇక—"అవాంతర పరిస్థితి" ప్రకటించబడడంతో నిప్పు తొక్కినంత పనైంది. ప్రజల్ని నిజంగా ఆకర్షిస్తున్న కొన్ని కార్యక్రమాలను అమాంతంగా చెత్తబుట్టల్లో కుక్కి—చైనా దురాక్రమణ వ్యతిరేక ప్రచారం పేరుతో అన్ని కార్యక్రమాలలోను దురాక్రమణలు సాగించారు.

దేశభక్తి ప్రబోధ గేయాలను ఏ పండక్కో పబ్బానికో గాని గుర్తుపెట్టుకోని ఆకాశవాణేయులు ఇప్పుడు ప్రతిరోజూ వినిపిస్తూండడం హర్షించదగ్గ విశేషమే. కాని—అలాంటి గేయాల్లో పాతవాటికున్న స్థానంలో కొత్త రచనలకెంత కేటాయిస్తున్నారు? కొత్త దేశభక్తి

గేయాలకు నిజంగా కరువేర్పడిందా ? "ఆకాశవాణి" ఆస్థానస్థాయి లోని కవులు, వారి ఉపగ్రహాలూ తప్ప ఇతర రచయితలు 'దేశభక్తి లో, దేశభక్తి గేయకల్పనలలో అంత తీసిపొయ్యారా ? కంచుకాగడా పసినా మంచివి కనపడ్డం లేదటండీ !

తప్పు తప్పు – "వినపడ్డం లేదటండీ" అనాలిగావల్ను. శ్రీవార్లు అవధరించి వినిపించుకుంటేగాని – ఎవరిమొరా సఫలం కాదట! వారు వినదల్చుకోనిదంతా అరణ్యారోదనంకిందే జమట !!

ఇటీవల మన ప్రసార కేంద్రాలు ఎంతగొప్పగా దేశభక్తిని నూరి పోస్తున్నాయో చూడండి-హాతోస్మి-వినండి!!"సూక్తిముక్తావళి" పేరుతో పురాణ గ్రంథాల సూక్తుల వల్లింపే కాదు – ప్రస్తుత అవాంతర పరిస్థితికి గాని, భారత రాజనీతికి గాని సంబంధంలేని, వ్యతిరేకం కూడా అనదగ్గ ఉదాహరణల కోలాహలం కద్దు !

అసలు సంగతి విన్నారా ? ఏవేళ ఏ కార్యక్రమం వింటున్నా – ఎక్కడో అక్కడ చైనావ్యతిరేక బద్ధకంకణ నినాదాలు వినిపిస్తున్నయ్. ఈ ఆదర్శం దొడ్డదేననడంలో ఎవరికీ సందేహం వుండదు. కాని –

కావ్య సంచికా కార్యక్రమాలనుంచి, బాలల ఆటవిడుపు బొమ్మరిల్లుల వరకూ అన్నిటా, అదే అదే ధ్యేయం కావడం పదేపదే పాడరా పాచి పళ్ళ దాసరీ అన్నట్టు కాదొకో ?! ఎంతటి శత్రువును విమర్శిస్తున్నా, ఆ శత్రువు ఎంతటి జుగుప్సాకరుడైనా – ఉత్తములు నైచ్యాన్ని ఉచ్చ రించరంటారు. "వాడి కన్ను లొట్ట, నడ్డ నీలిగింది, కాలుచొట్ట" అంటూ ఎబ్బెట్టు మాటలు చెప్పడమే విమర్శ అన్పతుందా ?

దేశ కాల పరిస్థితులను బట్టి, ఆచార సంప్రదాయాలను బట్టి వచ్చే నిద్రాహార విహారధోరణులలో తప్పుపట్టడం విజ్ఞులు చేయవలసిన పనేనా? వాడు కప్పలు తింటే మనకేం, పాములుతింటే మనకేం – కావలసింది వాడు చేసిన దురాక్రమణ గురించిన వ్యాఖ్యగాని !! విమర్శ 'నింద' కావడం మన ప్రధాని నెహ్రూ చూపిస్తున్న హుందాతనానికీ,

తరతరాల భారతీయుల నైతిక ప్రమాణాలకు నిందలు తెస్తుందని - ఆకాశవాణి ఆస్థాననేతల్లో ఒక్కరికీ తెలియదా ?

మేం నమ్మలేం బాబూ — నమ్మం.

అన్నిటికంటే చెప్పుకోదగ్గ అంశం మరోటి జరిగింది. ఈ నెల 21 వ తేదీ సాయంకాలం హైదరాబాద్‌లో "ఆంధ్రప్రదేశ్ ఆకాశవాణి శ్రోతల సంఘం" సమావేశం జరిగింది. నిజానికి అది ఆకాశవాణే ఏర్పాటుచేసిందట! పాపం పుచ్చిందో పండిందో మరి — శ్రీ తెన్నేటి విశ్వనాథం దానికి అధ్యక్షత వహించి, మనసులోని మాట మనసులో మథించుకోకుండా వదిలేశారు.

ఆయన రోజుకు పదిగంటలూ ప్రభుత్వం (అంటే ప్రభుత్వ పక్షం) ఇష్టప్రకారమే వినిపించాలా? ఒకటి రెండు గంటలైనా ప్రతి పక్షాలూ ప్రజలూ ఏమంటున్నారో వినిపించకూడదా అని సవాలు చేశారు.

పాలకవర్గం గీచిన గీటు దాటని ఈ సీతమ్మవారి రోదనని వినడానికే అనేక మందికి ఇబ్బందిగా వుంటుంటే ఇంకా రేడియోలకు లైసెన్సు ఫీజులు కూడా ఏమిటన్నట్టు తేల్చివేశారు తెన్నేటి వారు. నా వెంట రావొద్దు మొర్రో అంటే ఎత్తుకోమని వత్తిడి చేసిన పెంకె ఘటం గుర్తురాదూ మరి !

ఎలాంటి కొమ్ములు తిరిగిన రచయిత ఏ సారస్వత రూపం పంపినా - ప్రభుత్వ వ్యతిరేక వాక్యాలూ, అశ్లీల శబ్దాలూ ఉన్నాయేమోనని కత్తెరలూ దుర్భిణులూ పట్టుక్కూర్చునే (చివరిక్రియ మరీమరీ) ఆకాశవాణి ఆస్థానీయులు, తమ ప్రసారాలు తాము వింటున్నారా అనేది సంశయాస్పదం.

పూర్తిగా నమ్మలేం బాబూ — నమ్మం !!

చైనా కోతులు మూడూ, ప్రపంచ ప్రసిద్ధాలే! "చెడు వినం, చెడు చూడం" అనే ప్రబుద్ధులు "చెడు అనం" అనేది మాత్రం మర్చిపోతారా!

నమ్మలేం బాబూ — నమ్మం !! 

# ప్రశ్నావేదిక

*అజయ్ బాబు, గార*

**అందరిలోనూ "అభ్యుదయ దృక్పథం" సృష్టించి, దేశాన్ని "ప్రగతిపథం"లో నడిపి, ప్రజలు నూతన దృక్పథాలతో, విశాల భావాలతో జీవించేట్టు చెయ్యాలంటే - యువజనుల కర్తవ్యం ఏమిటి ?**

భవిష్యత్తు యువజనులది. అందులో వచ్చే కష్టనష్టాలన్నీ వారివే; సుఖాలూ వారివే. మీరు చెప్పినట్టు నవసమాజం నిర్మించుకోవాలంటే— అదే ఆదర్శంతో మనోవాక్కాయ కర్మల (త్రికరణ శుద్ధి)లో ఋజు వర్తనం అవసరం. అందుకు యువజనులు నడుం కడితే సాధించలేని దేముంది! అయితే—అందరూ అలా పూనుకుంటారా అనేది యువ జనులు తేల్చుకోవలసిన ప్రశ్న.

*డి. చంద్రయ్యా, విశాఖపట్నం*

**ఇంకా ఆచరణలో కన్పిస్తున్న అస్పృశ్యతా నివారణకు, దేశం సోషలిజం వైపు పురోగమించడానికి మీ పత్రిక చేస్తున్న కృషిని వివరిస్తారా ?**

మూక ఉమ్మడి ప్రచార ధోరణిలోగాక — కథ, గేయం, నవల మొదలైన వివిధ సారస్వత రూపాల ద్వారా మా పత్రిక ఈ కృషి చేస్తున్నది, చేస్తుంది. "సారస్వత కళారూపాలు" వేదికలమీద ఉపన్యాసాల వంటివి కావని రుచిచూచే వారు మరవకుండా, తిరిగి తిరిగి ఆలోచించి ఉత్తమ నిర్ణయానికి వచ్చేందుకు అంకురార్పణ చేసేవని మావిశ్వాసం.

*ఆర్. ఆర్. గుళ్ళపల్లి, హైదరాబాద్*

**సోషలిజానికి సరైన నిర్వచనం ఏమిటి ?**

దేశంలో అందరికీ సమానావకాశాలు, అందరివ్యావృత్తికీ తగిన ఒనరులు, కనీసావసరాలకు లోటులేదనే హామీవున్న ప్రభుత్వం — ఇవి

సోషలిజానికి ముఖ్య లక్షణాలు. ప్రజల్లో కులమత ప్రాంతీయ వివక్షత్లే కుండా పోవడమేగాక — ఆర్థిక తరతమ భేదాలు కూడా వుండని సమాజం "సోషలిస్టు సమాజం" అనే నిర్వచనం కూడా వుంది.

*వల్లమూడి రామం, వుల్లేటికుర్రు*

**గాంధిజీ సిద్ధాంతాలను మన ప్రభుత్వం ఎంతవరకు ఆచరిస్తున్నది ?**

"ప్రజాభిప్రాయానికి అనుగుణంగా వున్నంతవరకు" అంటున్నారు వ్యాఖ్యాతలు. దీన్నే గాలివాటం రాజకీయాలవరకు కూడా చెప్ప వచ్చు. జాతిపిత చెప్పిన అనేక ఋజు లక్షణాలలో బాహ్యాలంకరణకు మనం యిస్తున్నంత ప్రాధాన్యత, మనస్సుకూ హృదయానికీ సంబం ధించిన బోధలకు ఇవ్వడం లేదు. మనల్ని బట్టే మన ప్రభుత్వం గదా.

*చిగురుపాటి అనసూయ, పొన్నెకల్లు*

**ప్రస్తుత పరిస్థితులదృష్ట్యా స్త్రీకి విద్య అవసరమా ? అనవసరమా ?**

నవ్వొస్తుంది! ఇప్పటికీ ఈ ప్రశ్న లేశేవారున్నారంటే. ఏ కాలంలో, ఏ పరిస్థితులలోనైనా స్త్రీలకేమిటి, పురుషుల కేమిటి విద్య అవసరమే!!

*టి. వెంకటకృష్ణ, ఛత్రపురం*

**తల్లి కొడుకుపై చూపు ప్రేమకు, భార్య భర్తపై చూపు ప్రేమకు భేదమేమి ?**

తల్లి ప్రేమలో వెన్నెల, తుషారం, మమత కలసిన చల్లదనం వుంటుంది. భార్య ప్రేమలో వెచ్చని వెన్నల, వేడి వడగళ్లు, మమత కలిసిన వెచ్చదనం వుంటుంది. మమత ఇద్దరిలోనూ వుంటుంది. ఇదే స్త్రీల అస్థిత్వానికి ప్రాతిపదిక. పురుషుడింటికి రాగానే — తల్లి పొట్ట చూస్తుందని, భార్య వీపు చూస్తుందనీ అంటారు. ఇంతవైపరీత్యం లేకుండా "షట్కర్మయుక్తా కులధర్మపత్నీ" అనదగ్గ భార్యల ప్రేమలో మాతృప్రేమ పాళ్ళుకూడా ఎక్కువగానే వుంటాయి.

*ఎం. ఆర్. ఆచార్య, గోలకొండ*

**స్త్రీ పురుషుల స్నేహం ఎప్పుడు పరిపక్వం అవుతుంది ?**

శారీరక వాంఛలను అధిగమించి, మానసికంగా సైదోడులైనప్పుడు.



తరుణీ తరు విలాసము




చూపు లోచూపు





ఏం తోచకుండా వుంది !
ఈ కిటికీ ఇనపగజాలు
రూళ్ళగీసినట్టు అడ్డుగా ఉన్నాయి
మా ఇంటి కిటికీలకి నిలువుగా ఉంటాయి

మోహన్



మా ఇల్లు మా తాతయ్యది మా తాతతండ్రి కట్టించింది వాళ్ళ ఊహాలూ జీవితాలూ నిటారుగా ఉండేవికాబోలు — పొలంగట్ల మీద తాటిచెట్లలాగ నిట్టనిలువుగా ఈ కిటికీతలుపులు అవతలికి ఉన్నాయి మా యింటి కిటికీతలుపులు లోపలికే ఉంటాయి మూసేయాలంటే గభాల్న మూసుకోవచ్చు ఈ కిటికీ మూయాలంటే అడ్డుచువ్వల్లో చేతులు దూర్చి రెక్కలు లోపలికి లాక్కోవాలి రోడ్డుమీంచి ఎవరేనా మూసేయనూవచ్చు మూడు మైళ్ళనుంచి చువ్వలరూళ్ల దాటివస్తున్న కడలిగాలిగి కొలరు టపటపమని మెడ దగ్గిర చక్కిలిగింతలు చేస్తూంటే చిన్నప్పుడు అలిగి మూతిముడుచుక్కూర్చున్న అమ్మికి నేను గిలిగింతలు పెట్టడం — ముసిముసి నవ్వుతూ అమ్మి రక్కున తలవంచి బిగించినప్పుడు అమ్మి మెత్తటి మెడకింద ఇరుక్కున్న నా వ్రేళ్ళకి సన్నజాజి నెక్లేస్ మొనలు గిలిగింత పెట్టడం చురకవేసినట్టు జ్ఞాపకం వచ్చింది అమ్మి పూర్తిపేరు చిన్నమ్మి వాళ్ళమ్మ దాన్ని అమ్మీ అనే పిల్చేది మా వీధిచివార్నుండేది వాళ్ళిళ్ళు ఆ ఇంటికి అవతల పెద్ద చింతచెట్లూ వెదురుపొదలూ తప్ప మరేవీ ఉండేవి కావు ఎండవేళ వాటి నీడల్లో చిన్నమ్మీ నేనూ ఆడుతూపాడుతూ తిరిగేవాళ్ళం—ఏవీ తోచకపోడమంటే ఎంటో తెలీని ఆ రోజుల్లో

మా అమ్మ వాళ్ళింటికి వెళ్ళొద్దనేది అమ్మితో ఆడొద్దనేది వాళ్ళు మంచివాళ్లు కారట ఆ ఇంట్లో ఇద్దరే ఉండేవారు అమ్మీ వాళ్ళమ్మాను ఎవరు మంచివాళ్ళు కారో ఎందుక్కారో నాకు తెలిసేది కాదు చిన్నమ్మి అమ్మ మంచిదికాదు!— అనేది అమ్మ — అంతే

...మరి మామయ్య వాళ్ళింటికి వెళ్తూనేఉండేవాడు. మొదట వాళ్ళింటికి మామ తీసుకెళ్తేనే వెళ్ళాను. అమ్మిమ్మనీ నన్నూ ఆడుకోమని చెప్పిందీ మాఁవయ్యే!...మాఁవయ్య ఆ ఇంట్లో పుస్తకాలు చదువుతూనో, ఏదో రాసుకుంటూనో, అమ్మిని ఒళ్ళోకూచోబెట్టుకొని ఆడిస్తూనో కనిపించేవాడు......అందుకేనేమో మామను ఇంట్లో అదొకలాగ చూస్తూండేవారు — తాతయ్య భలే కోపంగా — ఏడుస్తున్నట్టూను ఉండేవాడు.

అమ్మిఅమ్మ నాకేమో చాలా మంచిది! మంచి సన్నటి తెల్లటి చీరలు కట్టేది — నల్లటి కొప్పు — జారిపోతున్నట్టు — మల్లెదండలు పెట్టుకొనేది. వాళ్ళింటి కెళ్ళినపుడల్లా తినటాని కేవో పెట్టేది — దగ్గిర్సా కూర్చోబెట్టుకొని కథల్లాంటివి చెప్పేది, వాట్ని కథలనే చెప్పేది అమ్మి నేనూ వింటూన్నంత సేపు వినేవాళ్ళం. — అమ్మా, తాతయ్యా కూడా కథల్చెప్పేవాళ్ళు, దేముళ్ళూ రాక్షసులూ, రాజుకొడుకులూ, మాయలు మహిమలు కథల్నిండా ఉండేవి. భూతాల కథలు మరీ బాగుండేవి — అమ్మిఅమ్మ చెప్పే కథలు అలా ఉండేవికావు; — అంతా మనుషులే; వాళ్ళు చేసే పనులు, తెలివితేటలు, తెలివితక్కువలు — అవీ ఉండేవి. అన్నీ తాను చూసినట్టు చెప్పేది — అంచేత అవి కథల్లాగా ఉండేవికావు. అబద్దాల్లాగా ఉండేవికావు; ఒహటి మాత్రం బాగా తెలిసేది; తెలివి తక్కువవాళ్ళు మంచివాళ్ళైనా లాభం లేదని...కొన్ని కథల్లో మనుషులు మనుషుల్నే చెడ్డబాధలు పెడుతూంటే వారు; కొన్ని కథలు వింటూంటే ఏడుపొచ్చేసేది; అలాంటి కథల్ని చెప్పొద్దనే వాళ్ళం, అయినా చెబుతూనే ఉండేది, వినేవాళ్ళంకాదు; అయినా ఆగేదికాదు. నవ్వించే కథలూ చెప్పేది. అసలవి కథలే కావేమో, ఎన్నిసార్లు చెప్పినా కొత్తగానే ఉండేవి — అంత వేగంగా వాట్ని మర్చిపోయేవాళ్ళం...అమ్మా తాతా చెప్పేకథల్లో హింసలు పెట్టేవాళ్ళని ఏడిపించేవాళ్ళని రాక్షసులంటూ చెప్పేవాళ్ళు — అమ్మిఅమ్మ వాళ్ళని మనుషులనేచెప్పేది.

అమ్మివాళ్ళుండేది, —మా యింటి లాగ పెంకుటిల్లేం కాదు — చుట్టూరా బొమ్మ జెముళ్ళూ, తీగలూ అల్లుకొన్న దడి, వెదుళ్ళ తడికె తలుపుతో చిన్న గేటు, అందులో పెద్దమల్లె పందిరి, పందిరి కెదురుగా చిన్న పూరిల్లూ, పచ్చమన్ను అలికిన గోడలు, జేగురు గడపలు, వాటి మీద సున్నంతో వేసిన చారలూ, ముగ్గులూ, చుట్టూరా రంగు రంగు పూల మొక్కలు, బంతిచెట్లూ, — ఆ బంతి పువ్వుల రంగు యిప్పుడూ కళ్ళలో మెరుస్తున్నట్టే ఉంది—...వాళ్ళింటి కెళ్ళినప్పుడల్లా తాతయ్య రామాయణంలోదో, శకుంతలదో పర్ణశాలలూ అవీగుర్తొచ్చేవి. లేళ్ళూ, నెమిళ్ళూ లేవుగాని — తోకాడిస్తూ

ఎదురొచ్చే మచ్చల కుక్క దాని పిల్లలూ ముద్దుగా ఉండేవి. చింత చెట్ల మీద, వెదురు పొదల్లోనూ పక్షులు కలకల మంటూండేవి.

ఆ ఇల్లు కెదురుగా పెద్దచింతమాను, మొదట చేతులువిరిగిపోయిన రాతి బొమ్మ ఉండేది. ఆ బొమ్మ ఒళ్ళో పాపాయి లాంటి చిన్నబొమ్మ సగం సగం ముక్కలూడిపోయినట్టుండేది. సాయంకాలాలవేళ అమ్మిఅమ్మ చిన్న ప్రమిదతో దీపం తీసుకెళ్ళి ఆ బొమ్మ దగ్గిరుంచేది; ఎందుకని అడిగితే — ఆ బొమ్మ వేపే రెప్పలార్పకుండా చూస్తూ — ఆ బొమ్మ, ఆ దీపం వెల్తురు చూడ్డాని కెంతో బాగుంటుందని కాస్సేపటికి చెప్పేది. అమ్మికూడా అపుడపుడు దీపం తీసుకెళ్ళి పెట్టేటప్పుడు నేనూ కలిసి వెళ్లేవాణ్ని. మరెవరూ దీపం పెట్టేవారు కారుగాని ఆ బొమ్మ ముక్కూ మొహం కనపడకుండా పసుపుముద్దలూ, కుంకం మెత్తేసి ఉండేవి. అమ్మిఅమ్మ అలాంటి పనిచేయడం నే చూళ్లేదు. ఆ బొమ్మ ఏమిటని అడిగితే 'అమ్మ' అని చెప్పేది అమ్మిఅమ్మ మా అమ్మ చెప్పేది ... ఆ బొమ్మ ఒక అమ్మోరిదట! ఆ అమ్మ వారి పేరు 'చింతలమ్మ' అని.

* * *

మామయ్యకేదో జ్వరంవచ్చి వారం రోజులైనా తగ్గలేదు. ఒకనాడు మామయ్య మాంచి ఊష్ణంలో ఉన్నప్పుడు అమ్మీ! అమ్మీ! అని పిలవటం నాకు గుర్తుంది — అది పలవరించటం అట! అలాంటప్పుడే తాతయ్య ఎవర్నో కసురుతూన్నట్లు వినిపిస్తే వెళ్ళి కళ్ళంట నీళ్లు పెట్టుకొంటూ మా ఇంటి గుమ్మందిగి వెళ్ళిపోతూన్న అమ్మిఅమ్మను చూచాను. వెంట అమ్మి కూడా ఉంది. "అమ్మీ! మావయ్య పిలుస్తున్నాడు, రా!...'' అని నేను పిలుస్తూండగానే తాతయ్య వీధి తలుపులు మూసేస్తూంటే అదో జాలిగా కనిపించిన అమ్మి బిక్కమొహం నా కిప్పటికీగుర్తే ...అదే అమ్మి కనిపించడం ఆఖరుసారి ఔతుందని అనుకోలేదు —

మామయ్య చచ్చిపోయాడు....... నాల్రోజుల తరవాత వాళ్ళింటికి వెళ్లాను— ఎవరూ కనిపించలేదు. మల్లిపందిరికింద తడిలేదు — మేకలు మొక్కలు కొరుకుతూంటే కుక్క అరుస్తోంది...అమ్మి వాళ్ళమ్మా ఎక్కడికో వెళ్ళిపోయారట!— మరి రారుకూడానట !!

మామయ్యబీరువానిండా పుస్తకాలుండేవి—చెద కనిపించిందట — తరాజూ గుళ్లూ తెచ్చి ఒకడెవడో వాటిని గోనె సంచిలో వేసుకొనిపోయాడు.

అమ్మి వెళ్ళిపోయాక — ఏమీ తోచక పోవడమనేది తొలిసారిగా తెలిసింది. ఎండ వేళల్లో ఆ చెట్లూ, పొదల మొదల నీడల్లో నిల్చుని ఎదురుగా ఎండిపోతూన్న మల్లిపందిర్నీ, జేగురు గడపలమీద రాలిపోతూన్న ఇంటికప్పునీ చూసి చూసి —

చేతుల్లేని రాతిబొమ్మముఖంమీద పెచ్చులు కట్టిన పసుపు ఊడలాగి వచ్చే సేవాణ్ణి...

ఏడాది కిందట—మా తాతలనాటి ఇంటి పెణక కూలి వీధిగోడా, ద్వారమూ పడిపోయాయని విడిచిపోతున్న ఆద్దెకున్న వాళ్ళు త్తరం రాస్తే ఆ ఇంటిబెడద పూర్తిగా వొదిలించుకోడానికని మా వూరెళ్ళాను — అక్కడ ఆ వూరిగుడిసె ఉండకపోయినా, ఆ చెట్లుగాని పొదలుగాని మచ్చుకైనా లేవు—ఇళ్లూ మేడా ఒక మిల్లూ,—ముఖ్యంగా తెల్లగా సున్నంవేసిన ఒక గుడీ కనిపించాయి. అది చింతలమ్మవారి గుడి అట. చింతల్ని తీర్చే అమ్మతల్లిట. చింతలమ్మోరు మహా మహత్తెం, సత్తెంగల అమ్మోరట. ఆ గుడి ఉన్నచోటే చింతమాను మొదట వెలిసిందట; — గుడి లోపలికెళ్ళి చూస్తే పెద్ద కత్తీ, కుంకంభరిణె పట్టుకొని భీకరంగా వార్నిష్ రంగుల్తో పెద్ద సిమెంటువిగ్రహం కనిపించింది!...గుడినుంచి బయటికొస్తూంటే ఎదురుగా ఒక వేపచెట్టూ,చుట్టూ సిమెంటు చప్టా చెట్టు మొదట పెద్ద కత్తి, వసంతకంలో కడగని రక్తంమరకలూ — కొన్ని మూగజీవాలు కనిపించాయి

తర్వాత తెలిసింది—ఆ చేతుల్లేని రాతిబొమ్మని పురావస్తు పరిశోధన శాఖవారు తీసుకుపోయారట, మ్యూజియంలో భద్రంగా ఉందట; ఇక్ష్వాకులనాటి బౌద్ధశిల్పం, బుద్ధభగవాన్ణి ప్రసవించిన మాయాదేవి విగ్రహమట అది!... ఆ బొమ్మ—ప్రమిద దీపమూ—'అమ్మ'—



అమ్మ... అన్నీ కడలిగాలిలో కరిగిపోతున్నాయి — మళ్ళీ ఏం తోచకుండాఉంది... ఏమీ తోచడంలేదు... కదవస్తే యిప్పుడెంత బాగుండును! ఎంతబాగుండును!!... ప్చ్... ఆమె రాదు... ఆమె కనిపించదు!!

...ఇలాగే యీ అడ్డుచువ్వల దగ్గిరిలాగే — ఏమిటి చూస్తూ నిల్చున్నానో తెలియని యీలాంటి ఏమీ తోచని వేళల్లోనే ... మల్లెల ఘాటు తగిలి ఉలికిపడి తేరిచూసినప్పుడు... వొదులొదులుగా తరంగాల్లా ఎగిరే పట్టులాంటి సగం అల్లి వదిలేసిన కొప్పూ, శరన్మేఘమాలికల్లా ఆ కొప్పులో తలలు దాచుకొని ఉయ్యాలలూగే జాజిమల్లెలూ, రెపరెపలాడే చీరచెంగూ కనిపించి మాయమయ్యేవి, — తరుణుల వెనుతట్టునే ఆశ్రయించి ఉంటాడుట మన్మథుడు విల్లెక్కుపెట్టి; ఆమెను ఎదురుగా చూడాలని నాకుండేదిగాదు, నే చూడని ఆమెవదనం ఎంతో సుందరం! చూస్తే తగ్గిపోతుందని నాకు భయం!

ఓసారి కిటికీరెక్కలు మూసుకొని ఉంటే, గట్టిగా త్రోశాను—అవతల ఎవరో పాపం ఆనుకొని ఉన్నట్టుంది... తలుపులు తెరుచుకున్నాయి... అవే పూలు! అవే కురులు! ఆమే!! వెళ్ళిపోతూ కొంచెం తిరిగిచూసింది — ఆ ముఖాన్ని — ఆమెను చూడటానికి అదే మొదలు......ఆ తర్వాత ఎన్నోసార్లు, ఎన్నోసార్లేమిటి — ప్రతిసారీ ఆ ముఖాన్ని — ఆమెను చూస్తూ, చూడకపోతే ఏం తోచకపోతాను...



ఒకనాడు _ పేరేమిటో అడిగాను... నాకు ఇష్టమైన దేమైనా ఉంటే అదే ఆమె పేరట!

''కథ అంటే నాకు మహాయిష్టం..'' అన్నాను.

"అదే నా పేరు _ కథ అనే పిలు" అంది.

''ఛా...కథ అని ఎక్కడేనా పేరు వుంటుందా ?''

"ఎందుకుండదూ ? ఉంటుంది ! కథ అంటే తనకు యిష్టం అనుకునే వారున్నప్పుడు 'కథ' అన్న పేరు గలదీ ఉండి తీర్తుంది" అంది _ అంతే మరేమీ మాట్లాడుకోలేదు.

మళ్ళీ మరొకసారి _ కథకూ నాకూ అడ్డుచువ్వలు తప్ప మరేదీ మధ్య లేనప్పుడు, "నాతో ఉండిపోగూడదూ?'' అనడిగాను.

"నేను కథని తెలుసా ? !...కిటికీ చువ్వల కివ్వలేగాని _ అవ్వల ఆలోపల ఉండలేను !'' అంది.

"నేను కథలు రాస్తాను తెలుసా ?" అన్నాను.

''తెలీకేం ;...చువ్వల కవ్వల, నీ లోపల రాస్తావు _ కథలని; నీవి అవ్వలి కథలు _ నేనో, యీవలి కథను !...'' అంటూ విసురుగా వెళ్ళిపోయింది.

* * *

అనుకోకుండా ప్రయాణం _ రైలు దిగుతూంటే ప్లాట్‌ఫారంమీద కనిపించింది కథ! పచ్చి నెత్తురురంగు చీర కట్టుకుంది, అంచులూ మైజారూలేని చీర_పడమటి సాంధ్యరాగం పడి మరీ ఎఱ్ఱగా మెరిసిపోతోంది ... ఎరుపు రంగంటే ఆరోజుల్లో నాకు మరీ యిష్టంగా ఉండేది; ఎర్రసిరాతో రాసే వాణ్ణి కథలు; _ ''మీ కథలకి ఒక ప్రత్యేకత ఉంది! కట్టలుకట్టలుగా ఉన్న కథల్లో ఎఱ్ఱగా కొట్టొచ్చేట్టు కనిపించే మీ కథల్ని ఇట్టే ఏర్చిపారెయ్యగలం !'' అని ఒక సంపాదక మహాశయుడు అన్నమాటలు యిప్పటికీ పొడుస్తూనే ఉంటాయి_జాతీయాభిమానం పుట్టుకొచ్చి కరక్కాయ సిరాతో, రాత బాగా సాగకపోతే_ఇండియన్ ఇంకుతో_ తర్వాత నలుపురంగు సిరాతో రాశాను. ఆకుపచ్చమీద సరదా పుట్టి పచ్చసిరాతో రాశాను; నీలంరంగు సిరాసంగతి వేరే చెప్పనక్కర్లేదు. అన్ని రంగుల కాగితాలమీదా వ్రాశాను. పసుపు రంగు కాగితాల ఆకుపచ్చ సిరాతో రాసిన కథ లందుకొని ఒక పత్రికాయన అవేవో శుభలేఖ కాయితాలని ఊరుకున్నాడట_ పసుపుకాగితంమీద ఎఱ్ఱసిరాతో రాసిన కథని కధాముత్తైదువు అన్నాడొకాయన, ఇంద్రధనుస్సని పేరు మార్చాడో సంపాదకుడు తెల్లకాగితంమీద అన్నిరంగుల సిరాలతోనూ రాసిన ఒక కథకి _ ఇహ రాయందల్లా తెల్లరంగు సిరాతో_నల్లటి కాగితంమ్మీద_తెల్లటి అక్షరాల్తో ఎప్పుడో



ఒకప్పుడు రాసుకోక తప్పదు — ఆత్మ కథను—ఎవరికైనా

ఇప్పు డిక్కడే ఉంటున్నాను— ఆ ఫ్యాక్టరీలో నవ్వుతూన్న లేగులాబి పెదిమల్తో చెప్పింది కథ — అంతకంటె ఎక్కువ నేను వినదల్చుకోలేదు ఆమె చెప్పనూలేదు

*　　*　　*

కొన్నాళ్ళకు—అడ్డుచువ్వ లవతల కథ మళ్లా కనిపించింది వొచ్చేశాను అంటూ రక్తం ముద్దల్లాంటి ఎఱ్ఱటి పెదిమెలు మెరిసేలా నవ్వుతూ బజార్లోని టాయిలెట్ మేకప్ సామగ్రి అంతా ఆమె ఒంటిమీద ఉంది నైలాన్ పొరలు సముద్రాల్లాగ చుట్టుకుని ఉన్నాయి ఆ పొరల్లో ల ఆమె శరీరం ఉందో లేదో అనుమానం రెండుచేతులాపట్టి నలిపి ఉండచుట్టి వేయాలన్నంత వెర్రులెత్తించే టట్లుంది—సినీమా ఛాన్సు దొరికిందట పునర్జన్మ ఎత్తినట్టుందట ఆమెకి ! అంతే తర్వాత ఆమె మరి కనిపించలేదు

ఒకనాటి చీకటివేళ కనిపించింది—పెద్ద ప్రహరీలో ఉద్యానవనం మధ్య అందాల మేడ అద్దాలకిటికీల వెనుక ధగధగలాడే వెలుగులో కనిపించింది ! ఆశ్చర్యం వేసింది—ఆ అద్దాల కత్తెరల్లో ఆ లోపల ఎలా ఉండగలుగుతున్నది ! అని—ఎందు కుండదూ ? విలాసమూ డబ్బూ అంతు లేని కీర్తి నాతో ఉండిపోమంటే ఎందు కుంటుందీ ? నాతో ఏముందని ?— పేజీకి రూపాయి వెయ్యి నయాపైసాల కథా రెండువేల నపై కథా మహా అయితే నాలుగువేల నయాలు ఇంతేగద !

బహుమతు లెక్కువగా రచయిత్రులే కొట్టేస్తున్నారు...

కథ యీదారి మరి రాదు — ఈ అడ్డు ఊచ లవతల ఆమె మరి కనిపించదు! కిటికీ దగ్గరకెళ్ళడమే మానుకున్నాను, కడలిగాలి మర్చిపోయి చాలాకాలం దొర్లింది... మళ్ళీ ఈవాళ ఎందుకో నాలో బలంగా కిటికీదగ్గర నిల్చోవాలని బుద్ధి పుట్టింది! ......కడలి గాలి మందగించి పోయిందే!, కాటుకలో చుక్కలు గింజుకుంటున్నాయి. చాలా రాత్రయిందే!... ఏఁవిటో...చువ్వలవతల చీకట్లో నీడలాగ ఆమె కనిపిస్తున్నట్టే ఉందే!' ...... ఏంటో...రెక్కలులాగి మూసుకున్నాను.

బయటి గోలకి తెలివొచ్చింది. కిటికీ తెరిచాను. గుంపులు గుంపులుగా వెళ్తున్నారు — అడే?...తెల్లవార్తోంది.. రోడ్డువార నాలుగైదు గొంతులు వినిపిస్తున్నాయి.

"అదిగో ఆ ప్రహారీ లోపలే..."

"చాలా అందమైన మనిషేనట?..."

"మనిషేంటయ్యా?!...చుక్కలాంటమ్మాయ్!..."

"ఏదైతేనేం — చిత్రవధ...! ముక్కలు ముక్కలు..."

"షటప్! ఎవరూ హత్య చెయ్యాలేదట — ఆ అద్దాల కిటికీల్లోంచి దూకడంలో



ఛిన్నాభిన్నమైపోయి పడిందట—ఆత్మహత్య చేసుకుంటూన్నట్టు రాసిపెట్టి మరీ..." మరి ఉండబట్టలేక కిటికీచువ్వల్లో నోరుపెట్టి గట్టిగా అరిచాను, "ఎవరూ? కథా? చిత్రవధ అయిపోయిందా! ఆత్మహత్య చేసుకుందా కథ?!!"

"కథేమిటయ్యా?—నీ పైత్యం! దానియిప్పటి పేరు కళ' — అసలు పేరు 'చిన్నమ్మి' అట; అలాగే చేవ్రాలు పెట్టింది. వాళ్ళది, అదేదో'—', ఆ ఊరట మొదట".

ఆఁ! మా ఊరే!! చిన్నమ్మి! అమ్మి! కథ—అమ్మి!...

అబ్బాఁ!! తల తిరుగుతోంది......

చింతలమ్మ గుడి — మూగ జీవాలు — రక్తం మరకలు — అబ్బ!! ఏం తోచడంలేదు...



# పనికిమాలినవాడు!

ఆఫీసునుండి అలసిపోయి కొంపకి చేరుకున్న సన్యాసిరావుకి గుమ్మంలోనే ఆరున్నొక్క రాగంలో ఎదురయ్యాడు ముద్దులకొడుకు మోహన్ రావు చొక్కామీది బురదమరకలతోనే వాడు తండ్రిని కావలించుకొని వెక్కి వెక్కి పడ్డాడు తెల్లగా మల్లెపూవులా మెరిసిపోయే ప్యాంటు కాస్తా ఖరాబయిపోవటంతో కొడుకుని దూరంగా తోసేసి బిరబిరా లోపలకు పొయ్యాడు నట్టింట్లో ఎడపిల్ల ఒంటేలు పోసుకొని అరచేత్తో చిచ్చికొడుతూంది ఉయ్యాల్లో ఆరునెల్ల పసివాడు కొంప ఎగిరిపొయేటట్లు గుక్కపడుతున్నాడు చెడ్డ చిరాకు పుట్టుకొచ్చింది 'ఇదెక్కడ చచ్చినట్లు' — చెప్పులు విసురుగా మూలకు విసిరేశాడు

"ఇదిగో! ఎక్కడ చచ్చావ్, తొందరగా రా"

"ఏమిటా విసుక్కోవటం — ఏం కొంప మునిగిపోయింది" అంటూ దొడ్లోనుండి ఊడిపడింది ఊర్మిళ

"ఇక్కడ పిళ్ళనొదిలిపెట్టి దొడ్లో యేంచేస్తున్నట్లు - వాడు చూడు-ఆ బురద మరకలూ-ఆ చొక్కా అదే; ఛీ! ఛీ! ఒంటేల్లో ఆడుకొంటూంది వీడేమో కొంపలారిపోతూన్నట్లు ఒకటే ఏడుపు ఒక్కర్నీ సముదాయిద్దామన్న ధ్యాసేలేదాయె" కసురుకుంటూ మంచం వాల్చుకొని కూలబడ్డాడు సన్యాసిరావు

"ఒక్కదాన్ని ఎంతకని చచ్చేది పొద్దుననగా పోయి యింట్లోవాళ్ళు చచ్చారా - లేదా అని చూట్టానికి మాత్రం ఏ అర్ధరాత్రికో మీరు అడుగు పెడతారాయె అన్నాలే తయారు చెయ్యాలా - పిల్లల్నే సముదాయించాలా-కొంచెం వీణ్ణెత్తుకోండి కూర గిన్నె మాడిపోతూంది."

"నీకు బుద్ధుందా లేదా-అడ్డమాలిన చాకిరీచేసి అలసిపోయి కొంపకొస్తే కాస్తంత ఊపిరి పీల్చుకోవటానికి వీల్లేదుగదా-యిల్లంతా నానా గందరగోళము - పైగా వాణ్ణెత్తుకో, వీణ్ణెత్తుకో అంటూ ఒకటే గోల. ఛీ! ఛీ! కొంపలో ఒక్కక్షణం కూర్చోలేక పోతున్నాను బతుకంటే విరక్తి పుడుతోంది దేంట్లోనైనా పడి చావాలనిపిస్తోంది." పెళ్ళాంమీద ఎగిరిపడ్డాడు సన్యాసిరావు.

---

ఆలపాటి లక్ష్మీనరసింహారావు

"ఎందుకట్లా మాటలు పారేసుకుంటారు యిక్కడ నేనొక్కతినే హాయిగా కూర్చున్నా నంటారా! ఎప్పుడో కోడి కూయకముందు లేచి క్షణం తీరికలేకుండా యిప్పటివరకూ చాకిరీ చేస్తూ నే ఉంటిని పైగా మాటలుకూడా పడాల్సివచ్చె పాడు బతుకంటా - పాడుబతుకు. రాకరాక ఎప్పుడో రాత్రికొచ్చినా నానా రొష్టు పెడతారాయె మీరూరుకోండి పుణ్యముంటుంది

సన్యాసిరావుకి మండిపోయింది కాలుతో నేల అదిరిపోయేటట్లు తంతూ గావుకేక పెట్టాడు

"నోరు మూస్తావా లేదా? కప్పలాగా నోరు తెరిచి మాటకుమాట అంటించటంమటుకు నేర్చుకున్నావు ముందిక్కడనుండి కదులు"

"రమ్మనటం మీవంతే-పొమ్మనటం మీవంతే చూసేవాళ్ళకి ఎవరికైనా తెలుస్తుంది - ఎవరిమీద ఎవరెగిరిపడుతున్నారో మీకు దండంపెడతా ఊరుకోండి" అంటూ ఊర్మిళ లోపలికి పోయింది

"ఏమన్నావు? నేను నీతో పోట్లాటవేసుకుంటున్నానా! ఎంతెంత మాటలంటున్నావే ఏదీ అను-మళ్ళీ అను" వెంటబడ్డాడు సన్యాసిరావు

"మీకోదణ్ణం-నేను వాదమేసుకోలేను - నోరు మూసుకుంటున్నాను మీరు పోయి ఆ మంచం మీద కూర్చోండి. అన్నం కావటంతోనే పడ్డిస్తాను." మాట కెదురు చూడకుండా ఊర్మిళ కూర కలబెడుతోంది

సన్యాసిరావు విసురుగా వచ్చి మంచంమీద కూలబడ్డాడు. "మాట కూడ మాట్లాడనీయకుండా వెధవను చేసి పారేసింది అలసిసొలసి నీరసంగా వస్తే ఒక నవ్వంటూ లేదాయె దాని దుంపతెగ - నవ్వు లేకపోతే మానె కాస్త శుభ్రంగా కనపడి పిల్లవాళ్ళను శుభ్రంగా ఉంచితే పాయె పైగా మాటకుమాట జవాబులాయె ఈ కొంపలో తినటంకంటే హోటల్లో నాలుగు మెతుకులు కొరకటం నయం" అనుకున్నాడు

పెద్దవాడు వీధి అరుగుమీద పండుకొని రాగాలొలికిస్తున్నాడు. చంటివాడు ఏడ్చేడ్చి నిద్రకుపక్రమించాడు. ఎడపిల్ల అంబాడుతూ యిల్లంతా చుట్టవేస్తూంది

నీరసంగా మంచంమీద వెల్లకిలా పండుకన్న సన్యాసిరావుకి ఒళ్ళంతా కొట్టుకపోయినట్లయింది. లోపలి నరాలన్నీ జివ్వున లాగుతున్నాయి రక్తం ఉరకలు పెడుతోంది

"పెళ్ళి కాకముందు ఎన్ని కలలు కన్నాను పొడైన ముక్కు - ఆ ముక్కు

చూచికాదూ దీన్ని పెళ్ళాడింది! కాటుక పెట్టుకున్న చక్రాల్లాంటి కళ్ళు నవ్వుతూండగా మాటిమాటికి ముక్కెగ రేసే దీనికోసం తండ్రితో ఎన్ని దెబ్బ లాటలాడాల్సొచ్చింది-ఆ వెంకటయ్య పదివేలిస్తానన్నాడ్రా-సూన్నారాయణ ఎనిమిదన్నాడు. దమ్మిడీ ఖరీదుచేయ లేని ఆ ప్రకాశరావేమిస్తాడనిరా, వాడిపిల్లను చేసుకుంటానంటావు నేను చచ్చినా ఒప్పుకోననే తండ్రితో తానే మన్నాడు నేనొప్పుగుంటానన్లేదూ! డబ్బుకంటే జీవితాంతంతోడుగా బతికే పిల్లే ముఖ్యం అని తెగతెంపుల క్కూడా సిద్ధంకాలేదూ! - అవన్నీ మాసిపొయ్యాయి అప్పటి ఊర్మిళ కాదు పూర్తిగా మారిపోయింది కొంచెం విశ్వాసంకూడా లేదంటే - ఇంతకి తానేమన్నాడు ఊర్మిళా! నేను ఆఫీసునుండి యింటికి వచ్చేసరికి నీవు స్నానంచేసి పిల్లలకు నీళ్ళుపోసి తలదువ్వి బొట్టుపెట్టి తెల్లటి బట్టలేసు కొని పీధరుగుమీద కూర్చోనుండం డన్నాడు అంతకంటే ఎమన్నా పీస మంతమాట ఎక్కువన్నాడా! అప్పు డదేమంది - అమాంతంగా కాళీకావ తారమెత్తి నాకు తీరికెక్కడుంది మీరు పోయి మంచంమీద కూలబడం డంటుందీ! పోనీ కోపంగా లేనప్పుడు ఎప్పుడైనా ఆ ముక్కు నాజూగ్గా ఒక్కసారి పైకి అంటుందా! ఎప్పుడూ కోపమొచ్చినప్పుడే అసహ్యంగా పైకి క్రిందికి అది లేచిపడుతుందాయె దీని మొగం తగలబడ. నానా అరుపూ అరుస్తుంది పక్కింటివాళ్ళు వినేటట్లు-పరువుపోయేటట్లు...'' మనస్సులో సాగదీసుకుంటూ విలపించాడు సన్యాసిరావు.

సన్యాసిరావు 'సెంటిమెంటల్ ఎఫెక్ట్స్' ఎక్కువగా ఉన్నవాడు గోరంతల్ని కొండంతలు చేసి అతని మనస్సు బాధపడిపోతుంది కోపం లేనప్పుడు మనిషి జావగారిపోతాడు పెళ్ళాంతో వివాదం ముగిసి అరగంట గడిచినా అతని మనసు శాంతించలేదు భార్య నన్నీవిధంగా అంది అని ఊహిం చుకుంటూ ఆ అనని విషయాన్ని కెలిక బాధపడిపోతున్నాడు "ఛీ! ఏమైనా సరే యీ యింట్లో నిమిషముండ గూడదు ఈ రాత్రి ఎట్లా అయినా చచ్చిపోవాలె'' అంటూ ఒక నిర్ణ యానికి వచ్చాడు. విసురుగా లేచి చెప్పులు తొడుక్కున్నాడు

"దాని దుంపతెగ! ఒకసారైనా బయటికొచ్చి చావదేం! చివరిసారి మొగమైనా చూచిపోదామనుకుంటే!"

సన్యాసిరావు చిందులుతొక్కుతూ అద్దంఉన్న గూటిదగ్గరికి నడిచాడు



"మనల్ని వదిలిపెట్టి పోవడానికి ఇష్టంలేనట్టుంది! అందుకనే యముడితో పోట్లాడుతున్నాడు!"

దువ్వెనతో క్రాపు సరిజేసుకున్నాడు అద్దంలో మొగం కందగడ్డలా క్రోధంగా కనిపించింది ఆత్మహత్య చేసుకోబోయేవాళ్ళు ముందు యిట్లాగే కనబడతారనుకున్నాడు మళ్ళీ జన్మలో అద్దం చూడటం పడుదుగదా అని రెండోసారి మొగం చూచుకున్నాడు

ఎంతకీ ఊర్మిళ బైటికి రాలేదు లోపలికిపోయి యీడ్చుకొద్దామా అని పించింది చివరికి ఎందుకులే అనుకున్నాడు

వీధితలుపు ధడేలుమని వేసేశాడు ఇంతవరకూ మొగుడి చెప్పుల చప్పుడు వింటూఉన్న ఊర్మిళ అవికాస్తా ఆగిపోయి వీధి తలుపు చప్పుడు వినిపించే సరికి ఆదరగా బయటకు వచ్చింది

"అన్నం ఉడికింది భోజనంచేసి పోండి-మళ్ళీ ఎక్కడికిపోతున్నారు?" అంది

సన్యాసిరావు వెటకారంగా నవ్వాడు

"నక్షత్రాలు లెక్కపెట్టటానికి - తోడుగా వస్తావా - కలిసి లెక్కపెడదాము" చచ్చే విక్టేశాననుకున్నాడు

"ఎప్పుడోతిన్న అన్నము-కాస్తంత భోజనంచేసి పోరాదండీ - ఎప్పుడొస్తారె యేమో " కొంచెం విచారంగా వినిపించింది గొంతు

"నోటిని దెబ్బకు కట్టేసింది రాకాసికూతురు అయితే నేను భోజనంచేసి నక్షత్రాలని మెడలు విరిగిపోయేవరకు లెక్కపెట్టి రావాలన్న మాట - ఏం విచారం! ఏం విచారం - అంతా దొంగనాటకం చచ్చినా యిక యిక్కడ భోంచేయ కూడదు "పేగులు అరుస్తున్నా వీధిలో పడ్డాడు

వీధిలో నడక ప్రారంభించిన ఐదు నిముషాలకు కాని కందగడ్డలాగా మారి పోయిన మొగాన్ని చిరునవ్వు చిందేలా తనవశంలోకి తెచ్చుకోలేకపోయాడు తలకాయ వంచుకొని చకచకా నడిచి పోతున్నాడు

"ముందుగా ఎక్కడికి దారి తీయటం? రైల్వే లైనువేపు పోయి యే యెక్స్‌ప్రెస్ క్రిందనో తలకాయ పెడితే — టకటకా — టకటకటక — అంటూ రైలు చక్రాలు మెడకాయను కసుక్కున తెంచేసి మైలు దూరం విసిరేస్తే — అబ్బో—భయంకరం—దాని కంటే కొంచెం తేలిగ్గా అయిపోయే పద్ధతి బాగుంటుంది ఏటి ఒడ్డుకుపోయి దారుణంగా పెరిగిన చింత చెట్టు కొసారు కొమ్మమీద కెక్కి "హర హరా" అంటూ క్రిందకి దూకితే లాభం లేదు! కాళ్ళూ చేతులూ విరిగి మనిషి చావకపోతే-నానా ఘోరంగా ఉంటుంది పోనీ రైలెక్కి యే బదరీ నారాయణం దారినో పోతూ ఎత్తాంటి ఒక కొండమీది నుండి అమాంతంగా లోయలోకి దూకేస్తే — బాగానే ఉంటుంది కానీ తనకా దారి తెలిసి చావదే-ఇంతకీ ఏం చేద్దాం "

ఆలోచనలో ప్రపంచాన్నే మరచి పోయి నడుస్తున్న సన్యాసిరావు భుజాన్ని పట్టుకొని ఒకచెయ్యి ఆపింది ఆ చేతికి సంబంధించిన వాడు సన్యాసి రావు "క్లోక్‌ర్క్" రమణ

"ఏమిరోయ్ మిష్టర్! యిలా దారి తీసావ్ రాత్రిళ్ళు కొంపదలని మహానుభావుడవు ఎక్కడికి మహాత్మా!"

సన్యాసిరావు తెప్పరిల్లాడు ఎదురుగా రమణను చూచి తన నడక మందగించినందుకు గల కారణాన్ని తెలుసుకున్నాడు మొగం మీద చిరు నవ్వు మోసులెత్తింది

"ఏం! రమణా, ఎక్కడికో బయలు దేరావు భోజనం అయిందా"

"నీది?"

అయిందని అబద్ధమాడేశాడు సన్యాసిరావు

"అదృష్టవంతుడివిరా బ్రదర్! అనుకూలమైన దాన్ని పరికోరి చేసు కున్నావు ఇంకోగంటయినా గడవందే మనకి సాపాటు నాస్తి"

"తన పెళ్ళాన్ని పొగుడుతున్నాడు వెధవ రాస్కెల్! దానిసంగతి వీడికేం తెలుసు! తనపెళ్ళాం గుణంతా నెరగడు కానీ యితర్ల పెళ్ళాల గుణాన్ని అవలోకన చేశాననుకుంటున్నాడు. అంతేలే! పొరుగింటి పుల్లకూర రుచి."

"వస్తారా! కొంచెం షాపింగు చేయాలి. వెధవది ఫిబ్రవరి అని సంతోషిస్తే — యీ ఇరవయ్యోనిమిది నాడే పాలడబ్బా అయిపోయింది. నీ దగ్గరేమైనా ఒక ఐదురూపాయలుంటే అప్పు పెడతావురా — తిరిగి తిరిగి కాళ్ళరగిపోతున్నాయ్."

"ఇదా వీడి అవుసరం-అడగటంలో కూడా "క్లాస్" వెలగబెడుతున్నాడు. అందుకేగావును బట్రాజు గుణం అద్దెకు తీసుకుంది. పరాయి వాళ్ళని మంచి చేసుకోవాలంటే వాళ్ళ పెళ్ళాలను పొగడాలనుకుంటున్నాడు చచ్చు వెధవ." అనుకున్న సన్యాసిరావు "లే" వన్నాడు. ఉన్నా చచ్చినా యీయకూడ దనిపించింది.

"వస్తారా" అంటూ రమణ వెళ్ళిపోయాడు.

"ఇందాక ఎంతదాకా వచ్చాము-ఆఁ — బదరీనారాయణం దారిలో లోయలో దూకటం వరకు గాదూ: అది లాభం లేదు-పోవాలంటే కనీసం ఒక పెద్దనోటు కావాలి — లేకపోతే అనేక మహిమలు కలిగిన ఒక ముని పుంగవుని ఆశ్రయిస్తే — ఒకటి రెండేళ్లలో మహామహిమాన్వితుడనై - దాని మనస్సు నా వైపు తిప్పుకుంటే-" ఉలిక్కి పడ్డాడు సన్యాసిరావు. "మళ్లా దాన్నా—ఛీ! ఏ మొగం పెట్టుకొని."

ఆఫీసు మేనేజర్ దారిలో పోతూ సన్యాసిరావునిచూచి విష్ చేశాడు-మళ్ళీ తనకు చేస్తాడుకదా అనే నమ్మకంతో.

"ఈ వెధవ కెవడూ విష్ చేసేది - యివ్వాళెట్లా అయినా చచ్చిపోతుంటిని" అనుకొని సన్యాసిరావు వాడికేసి చిరునవ్వు వొలకపోశాడు - అందుకున్నట్లు — వాడికంటే పెద్ద ఆఫీసరులా.

మేనేజర్ గొంతు పచ్చివెలక్కాయ మింగింది. నాలిక్కొరుక్కొని అవమానంతో మొగం ముడుచుకుని వెళ్ళిపోయాడు.

"బలేగా మాడింది వెధవ మొగం-డబుల్ రోస్టు పెసరట్టులా — లేకపోతే ఎంత నిక్కు — సెలవియ్యరా బాబూ అంటే-ఆఫీసంటే పడిచచ్చేవాడులా-పని చాలా ఉందంటాడు. రేపల్లా కుమిలి కుమిలి చస్తాడు. ఆఫీసంతా కోతిలాగా చిందులు తొక్కుతాడు" రేపటి వాడి ప్రవర్తన తలచుకుం

టుంటే పగళ్ళబడిపోయేటంత నవ్వొచ్చింది సన్యాసిరావుకి

మేనేజర్ని తలచుకుంటుంటే సన్యాసిరావుకి వాళ్ళఆఫీసరు గుర్తొచ్చాడు

"మంచి గుమ్మడికాయంత పొట్టని ఇన్ షర్టులో కనపడకుండా చేయాలని ఎంతగా బాధ పడుతాడు! గద్దముక్కు - చీకిరికండ్లు – ఉన్నవా లేవా అనిపించే కోడిపొచ్చులాంటి నాలుగు వెంట్రుకలు – బోడిగుండుమీద గాలికి ఎగిరిపడుతూంటే ఎంతగా నవ్వొచ్చేది ఇంతకీ నేనేమన్నానని వాడికంత కోపం-యివ్వాళ ట్లాకసురుకున్నాడు" క్రితం దినం పదిగంటలప్పుడు ఆఫీసులో జరిగిన సంగతి జ్ఞాపకం వచ్చింది సన్యాసిరావుకి "అందులో తప్పేముంది – ఇంతలా నన్ను తిట్టటానికి" మళ్ళీ ఆ విషయాన్నే జాగ్రత్తగా తలచుకున్నాడు

రాజారావూ, రమణా అందరికంటే ముందుగా ఆఫీసుకొచ్చి బాతాఖానీ కొడుతున్నారు సన్యాసిరావు వచ్చి తనకుర్చీపై కూలబడ్డాడు మాటమీద మాటవచ్చి రాజారావన్నాడు "ఒరే రమణా, మన ఆఫీసర్ని అందరమూ పెద్దపులి అనుకుంటామా! ఎంత మంచి వాడనుకున్నావు! నిన్న సాయంత్రము జెబి బిస్కట్లు మెయిన్ బజార్లోతింటూ పోతున్నాడు నాకు ఎదురయ్యేవరకు విష్ చేసి తప్పుకోబోయాను దగ్గరకు పిలిచి ప్యాకెట్ లో ఒకటి తీసుకొని తిన్నదాకా వదిలిపెట్టలేదురా–బజార్లో చాలా సోషల్ గా ఉంటాడు" అంటూ నిన్నటి దినం తిన్నటువంటి బిస్కట్ రుచి ఇంకా యేమైనా మిగిలుందేమో నని నాలికతో పెదాలుతడుపుకుంటు న్నాడు

రమణం ఆశ్చర్యపోయి "అలాగా– ఐతే చాలా మంచి వాడంటావ్?" అన్నాడు తనకుకూడా ఎప్పుడైనా అటువంటి ఛాన్సు దొరకవచ్చని కలలు కంటూ

"ఒరే! సన్యాసిరావూ – వింటున్నావా! మన ఆఫీసరు చాలామంచి వాడు" వేలుపెట్టి రాజారావు పొడిచాడు

సన్యాసిరావు వాడి అమాయకత్వానికి జాలిపడ్డట్లు మొగంపెట్టాడు

"ఒరే! యీ రోజుల్లో నడిబజార్లో నానా గడ్డికరవటం నాగరికతా లక్షణమనిపించుకోదురా! అయినా నీ పన్న పాయింటుకొద్దాం తను తినేదేమిటో తినకుండా తన క్రింది ఉద్యోగస్థుణ్ణి తనతోపాటు తిన మనటం బలవంతం చేయటంగాక మరేమిటి! ఆ బిస్కట్ నీవు తీసుకోకుండా ఉంటే పంజరిగేది యివాళ ఆఫీసులో తెలిసేది పోనీ



"ఏమిటి సార్! నాకు పనంటే భయమా? ఈ ప్రపంచంలో నా భార్యకుతప్ప మరి దేనికీ భయపడను"

సోషల్ ఫెలో అంటున్నావు అట్లా అయితే యివ్వాళ నీవు నాలుగు పచ్చి మిరపకాయలపకోడీలు కొరుక్కుంటూ మన ఆఫీసరుకి కనపడి ఆఫరుచేయి తీసుకొని తింటే అప్పుడు ఒప్పుకుంటాను" పకపక మని పగలబడింది నోరు

నగ్నసత్యం వింటానికి బావుండదు రాజారావుమింగలేక ఉమ్మిమింగాడు రమణ "అంతేరా! బలేగా చెప్పావు" అన్నాడు సన్యాసిరావుకి షేక్‌హ్యాండు యిస్తూ

బహుశా యీవార్తే ఎవరిద్వారానో ఆఫీసరు చెవిలోపడి ఉంటుంది ఇవ్వాళ పనిచేసుకుంటుంటే, పిలిపించి సన్యాసిరావును చెడామడా తిట్టాడు

"ఏమిటిసార్! అట్లాతిడతారు ఏం జేశాను?" అన్నాడు సన్యాసిరావు "ఏంచేశావా! అడ్డమాలిన డ్రాఫ్టు రాసి — ఇంకామాట్లాడు తున్నావా! ఇక్కడచూడు 'రిఫరెన్స్' అనేమాటలో యిది యన్నేనా అని– "యు" లాగా కనపడటంలే! ఇదిగో యిది మొదటిసారిగా తలచి వదలిపెడుతున్నాను

యికనుండి తలబిరుసుగా ప్రవర్తిం చావా "సస్పెన్డ్" చేస్తానని అగ్గిమీద గుగ్గిలం అయిపోయాడు.

మధ్యాహ్నం రెండుగంటలకు జరిగిపోయిన యీ విషయం తలంచుకుంటుంటే సన్యాసిరావుకి ఒళ్ళు మండిపోయింది. వెధవని చాచి లెంప కాయ కొట్టాల్సింది! పొరపాటు చేశాను. వాడి బొంద! వాడికి సంతకం పెట్టటంతప్ప చదవటంరాదే! వాడా నాకు వంకలుపెట్టేవాడు - రాజీనామా కాగితం రాసి మొఖం పగిలపోయేటట్లు విసిరికొట్టి రావాల్సింది." ఉద్రేకంతో చేతులు నులునుకుంటున్నాయి.

"రేపటికి ఎట్లాగైనా చచ్చిపోతూనేఉంటిని. ఇవ్వాళ తిట్టినతిట్లకి ఆఫీసరు నాలుగుచుక్కలు కన్నీళ్ళు రాలవడంటావా - రాలవడు - వాడిది గుండెకాదు - సీసపుగుండు - రమణగాడుమాత్రం ఏడుస్తాడు - అడపా తడపా అప్పిచ్చేవాడు దొరకడని - రాజారావు కొంచెం సంతోషిస్తాడు- యివ్వాల్సిన యాభై రూపాయిలు యివ్వటం తప్పినాయని. నన్ను యింతగా బాధపెడుతూందే - అది - అదే - నా పెళ్ళాం - ఊర్మిళ - రేపేం చేస్తుంది -ఏడుస్తుందా ?-ఏడవదా ? - ఛీ! పాడైంది-అది ఏడిస్తే నాకేం - ఏడవకపోతే నాకేం" వేగంగా నడుస్తున్నాడు సన్యాసిరావు.

కడుపులో ప్రేగులు అరుస్తున్నాయి. ఆకలో ఆకలో అంటూ చిన్నపిల్లాడిలా మారాము చేస్తున్నాయి-వాటికి సంబంధించిన యజమాని సన్యాసిరావు పడే బాధని గమనించకుండానే!

సన్యాసిరావు వాటిబాధ గమనించాడు. "అడ్డమాలిన కడుపు - పనికిమాలిన కడుపు - యీ కడుపుకోసం ఎన్నిబాధలు పడాలి - దేబిరించాలి - ?ంగదణ్ణాలు పెట్టాలి - దీనంగా చూడాలి - కుక్కకంటే హీనమై పోవాలి - ఒళ్ళుమ్ముకోవాలి-ఏడవ్వే-ఏడవ్వే." తానను కొన్న మాటలు తనకే నవ్వు తెప్పించాయి.

ఎట్లాఅయినా చస్తూనే ఉంటిని. కడుపునిండాతినే చద్దామనుకొని సన్యాసిరావు చొక్కాజేబులు తడుముకున్నాడు. అర్ధరూపాయిబిళ్ళ చేతికి తగిలింది-పరవాలేదనుకొని హోటల్లో దూరి 'పెసరట్. టీ' తీసుకొని బయటపడ్డాడు.

మంటలుమండే కడుపు నిండేవరకు మనసుకూడా చల్లారింది. "ఇప్పుడెక్కడికి పోవాలి"-చెరువుగట్టుకేసి పాదాలు దారితీస్తున్నాయి-చిన్నప్పుడెప్పుడో చదువుకునే రోజుల్లో సాయం

కాలేజీలో పుస్తకాలు పట్టుకొని చదువు కోవటానికి అక్కడికి పోయేవాడు అప్పుడు చిన్నమ్మని-ముతరాసి కులానికి చెందిన పడుచు - అందమైంది - రోజూ చేలకిపోయి గడ్డిమోపెత్తుకొని ఆదారినేవస్తూ శనక్కాయలూ, పెసర కాయలూ, ఊచబియ్యం పెట్టేది" చిన్నమ్మ జ్ఞాపకానికివచ్చేసరికి సన్యాసి రావు శరీరం పులకరించింది

"ఎంత బాగుండేది — ఒకరోజున మాత్రం అడిగాడు — పెసరకాయలు పెడతావా! అని ఆరోజునుంచి రోజూ అడగకుండానే పెట్టేది — ఇప్పుడేమ యిందో — చదువైన తరువాత అటు కేసే పోలేదు—ఏం చేస్తూందో-పెళ్ళ యిందా-పిల్లలా-యీమధ్యనఎప్పుడూ జ్ఞాపకానికి వచ్చిచావలేదు - వస్తే పోదును" మధురమైన ఊహాలు అల్లి బిల్లిగా అల్లుకుంటున్నాయి

"ఎవరది-అబ్బాయిగారు లాగుందే- ఏమండోయ్ అబ్బాయిగారు — బాగు న్నారా" సన్యాసిరావు టక్కున ఆగి పోయాడు "వెన్నెల-నీడ - వెన్నెల నీడలో వేపచెట్టు క్రింద నిలబడింది ఎవరూ?" అనుకున్నాడు

"మరిచిపొయ్యారా! నేనండీ — చిన్నమ్మని - ఎందుకు మరచిపోరూ- పదేళ్ళాయె - చూచి"

వెన్నెల తెల్లబోయేటట్లు నవ్వింది చిన్నమ్మ వెన్నెలలోకివస్తూ

"నువ్వా! గుర్తుపట్టరే - బాగు న్నావా చిన్నమ్మా - పెండ్లయిందా- మొగుడిదీవూరేనా-ఎప్పుడొచ్చావ్" గబాగబా ప్రశ్నలు గుప్పించి వేశాడు

"చిన్నప్పటిగుణం చిన్నమెత్తు తగ్గలేదు ఇన్ని ప్రశ్నలు వేస్తే - ఎట్లా మాట్లాడేది" దగ్గరగావస్తూ అంది చిన్నమ్మ

చిన్నమ్మ ఏమారిపోయింది నడుము లావైంది కండ్లు కొంచెం నల్లగా— పెద్దగా అయినట్లున్నాయి — గొంతు కూడా మారింది — బుగ్గలు మాత్రం లావైనట్లున్నాయి బెరుకనేదిలేకుండా సన్యాసిరావు దగ్గరికవచ్చి కండ్లల్లో కండ్లుపెట్టి చూసింది,

"ఎడకగుర్తు పట్టాను-ఎక్కడుంటు న్నారు? అసలే కనపడటం లేదు" ఇది వరకు చొరవే జ్ఞాపకానికి తెచ్చుకుంది

"ఇక్కడే—పెళ్ళయింది—ముగ్గురు పిల్లలు రెండుప్లస్‌లు - ఒకటి మైనస్- నీకు"

"ఇద్దరు-ఒక ఆడా-ఒకమగా- మొన్న పండక్కి వచ్చాను - అత్తగారిది కోటయ్యకొండదగ్గర"

"చాలా మారిపొయ్యావు-లావుగా తయారయ్యావు - ఇప్పటికీ జ్ఞాపకం వస్తావు"



"మీరు మాత్రం - పెసరకాయలు శనక్కాయలు ఎవరు పెడుతున్నారు- ఏం పని యీ వూళ్ళో?"

"గుమస్తా ఉద్యోగం - ఇంగ్లీషులో క్లర్క్ అంటారు - జిహ్వా చచ్చిపోయింది చదువై పోయిందగ్గర్నుంచీ- నాలుగు పెసరకాయలు పెడతావూ?"

బాధంతా మరిచి పోయింది సన్యాసిరావు మనసు



''లేడీస్ సీట్ పక్కనే ఇవ్వండి.''

ఆది మీ లాంటి ఉబలాటం మాత్రం కాదు.''

''మరైతే ఎటువంటిదంటారు? కొంచం వివరిద్దురూ?''

''తప్పకుండా, కాని ఇప్పుడు కాదు. ఇది తగిన సమయమూ కాదు; అనువైన ప్రదేశమూ కాదు. మరి మీరు వెళ్ళండి.''

బిందుమాధవి నేత్రాలలో కోపం స్పష్టంగా ద్యోతకమైంది. ''వెళ్ళకపోతే మానుకుంటానేమిటి? చక్కగా సరదాగానూ వుంటుంది. కాలక్షేపంగానూ వుంటుంది — సినీ ఆర్టిస్టును చూద్దాం రమ్మంటే క్లాసులో పాఠం చెప్పినంత గందరగోళంగానూ మాట్లాడతారేమిటి?''

ఆగ్రహాన్ని, విసుపుదలనూ నడకలో వ్యక్తంచేస్తూ వెళ్ళికార్లోకూర్చొని ధన్ మని తలుపువేసుకుని, తక్షణమే స్టార్టు చేసుకొని పెద్దస్పీడుతో లాగించి దూసుకుపోయింది!

అదే తొలిపరిచయమైనా తనపైన ఏదో చనువూ, అధికారమూ వున్నట్లున్న ఆ ప్రవర్తనకు ఆశ్చర్యపోయాడు చక్రపాణి. ధన్ మన్న ఆ కారు తలుపు వేసిన శబ్దం కొండలలో ప్రతిధ్వనించి క్షణకాలం అతడి మనస్సును కలవరపెట్టింది. దుమ్ము రేపుకుంటూ దూసుకుపోతున్న ఆ లేత ఆకుపచ్చరంగు కారు మిలమిలలు కనుపించినంతవరకూ

హస్తూండిపోయాడు చక్రపాణి ఎందుకో
ఃకారణంగా అతడి పెదవులపై చిరు
ుగవు నిలచింది

హేమంత ఋతువు కావడంవల్ల
ర్వత వాయువులతి శీతలంగా మేనిని
ోకుతున్నాయి సూర్య కిరణాలకు వెచ్చ
నమేలేదు సప్న విపద్గ్రిస్తునివలె
ిస్మయావిష్టుడై నిలచి భావనా స్రవంతిలో
తేలిపోతూన్న అతడు ప్రొద్దువాలటం
గమనించనేలేదు గాలిలో తేమ అధిక
మైంది ఇంకొక జాము ప్రొద్దుకంటె
ఎక్కువుండదు సంధ్యా సూర్యరశ్మిలో
నల్వంకలు మహీధర శిఖరాలు కిరీటాల
వలె ప్రకాశిస్తున్నాయి ఆలయంలో
స్వామికి ఉయ్యేలసేవ జరిగే సమయం
సమీపిస్తూండడంవల్ల తిరిగి వీధులు జనా
కీర్ణమవ్వసాగాయి

కూర్చున్న చోటునుండిలేచి నడక
సాగించాడు చక్రిపాణి తనబస వైపుగా
దేవాలయాంతర్భాగంనుండి సన్నాయి
వాయిద్యం మృధుమధురంగా విన
వస్తోంది సాయంకాలారుణకాంతులింకా
లీలగా దేవాలయ శిఖరాగ్రభాగంపై
దోబూచులాడుతున్నాయి ఆ కాంతులలో
బంగరుకలశా లొక్కసారి తళుక్కు
మంటున్నాయి గోపురపు గూళ్ళలో నివ
సిస్తూన్న పారావతాలు టపటపా రెక్కలు
కొట్టుకుంటూ అటు యిటు ఎగిరి తిరిగి
గోపురంపై వ్రాలుతున్నాయి

క్రమంగా సంధ్యాంధకారం మూల
మూలలా అలముకొన సాగింది దేవా
లయం చిత్ర విచిత్ర దీపాలంకరణతో
శోభాయమానంగా కన్పట్టుతూంది
సన్నాయి వాయిద్యమాగిపోయి అర్చ
కులు ఉచ్చైస్వరాలతో పఠిస్తూన్న
మంత్రాలు శ్రుతిపేయంగా వినవస్తు
న్నాయి చక్రపాణి భక్తి పారవశ్యంతో
ఆలయాభిముఖంగా నిలచి బయటినుండే
అంజలి ఘటించాడు దివ్యప్రశాంతి
నందిన మనస్సుతో నివాసం జేరుకొని
సూట్ కేస్ సర్దుకొని చేతబట్టి బస్సుస్టాండ
వైపు నడిచాడు

బస్సులూ, కార్లూ కొండలెక్కేవి
ఎక్కుతున్నాయి, దిగేవి దిగుతున్నాయి
ఆ వాహనాలలోని భక్తులు తమ ఆరాధ్య
దైవాన్ని పలువిధాల స్మరిస్తున్నారు,
తారస్థాయి కంఠస్వరాలతో జగము శీత
లము, శాంతము అయివున్నది ఆకసాన
ఒక్కటొక్కటిగా నక్షత్రాలుదయిస్తు
న్నాయి హేమంతకాల చంద్రికలో ఆ
వాలుకారాశి, దిగువ తిరుపతి నగరం,
పర్వతాల నావరించివున్న వృక్షలతాదులు
అతిమనోహరంగా చూపట్టుతున్నాయి
ఒక్కొక్కచోట పర్వత శృంగాలనుండి
వెలికివస్తూన్న నిర్ఝరాలు తళతళలాడ్తూ
వెండిరేకులలా కన్పిస్తున్నాయి చంద్ర
కిరణ ప్రసారోజ్వలమైన పర్వత శిఖరాలు
ఆ ప్రశాంత విభావరియందు ప్రశాంతంగా

నిలచిమనస్సు కాహ్లాదత కలిగిస్తున్నాయి. నీలాంబరాన శుధాంశుడు మందంగా తేలి పోతున్నాడు ఆ ప్రశాంత ప్రకృతిలో చక్రపాణి మనస్సాకింత సేపు ప్రాపంచిక చింత విస్మరించింది

## 3

మెత్తని అడుగుల సవ్వడికి చక్రపాణి తలెత్తాడు గుమ్మం పొడవునా నిల్చున్న అందాల భరిణ మాధవీ కుమారిని చూచి కొద్దిగా కలవరపడ్డాడు 'ఏమిటన్న'ట్లు కనుబొమలు వాటంతటవే ముడి బడ్డాయి

"మే ఐ గెటిన్ సర్ ?" కళతో మెరిసిపోతున్న కళ్ళను చక్రాల్లా తిప్పుతూ అడిగింది

'కిన్నెర కంఠమంటే యిదేకాబోలు' అనుకొంటూ 'యస్, గెటిన్' అంటూ కుర్చీ చూపించేడు అందంగా నడచి వచ్చి కూర్చుంటూ చుట్టూ కలియ జూచింది మాధవి ఆ రూమ్‌లో యింక ఎవరూ లెక్చరర్సు లేరు. అందరికీ క్లాసెస్ వున్నట్లున్నాయి ఒకమూల డ్రాయరు దగ్గర మాత్రం ఒక ట్యూటర్ కూర్చుని కాంపొజిషన్ బుక్స్ దిద్దు కొంటున్నాడు

"ఏం కావాలి ? యేమైనా నోట్సు కోసం వచ్చారా ?"

సమాధానంగా నవ్వింది మాధవి హ్యాండ్‌బాగ్‌లో నుండి ఒక కార్డు తీసి యిస్తూ "రేపు నా బర్త్‌డే" అంది

మందహాసంతో అందుకున్నాడు పాణి

"సాయంకాలం పార్టీ, ఎంటర్‌టెయిన్ మెంట్సూ అన్నింటికీ మీరు తప్పకుండా హాజరవ్వాలి '' దరహాసవదనంతో అతడి ముఖం పరీక్షగా చూస్తూ అంది

"అలాగే లెండి" చిరునవ్వుతో అన్నాడు

సందేహంగా తలెత్తింది మాధవి "నిజంగా వస్తారా, యేదో ఒక సమా ధానం చెబుతున్నారా ?"

బిగ్గరగా నవ్వేశాడు చక్రపాణి "ఎవరొచ్చేదీ, రానిదీ పిలుపులోనే నికరంగా తేల్చేసుకుంటారన్నమాట !"

"లెక్చరర్స్ అందర్నీ పిలిచేను, అందరూ తప్పక వస్తారు మీరుకూడా మానడానికి వీలులేదు'' అతడిపై తన కేదో అధికారమున్నట్లు చెప్పడం తనకే సిగ్గేసింది తీరా అనేశాక "తిరుపతి నుంచి వచ్చాక ఒకసారి మా యింటి కొస్తానన్నారు రాలేదేం ?''

''అయితే ప్రతి సంవత్సరం మీరిఖా ఘనంగానే చేసుకుంటారా పుట్టినరోజు?" మాట మార్చాడు పాణి

ఒక్క క్షణం తటపటాయించి చెప్పింది ''నేను చేసుకోను, చేస్తారు మా పేరెంట్సు "

"అదృష్టవంతులు ''

"అంతమాత్రానికే?'' అమాయకంగా




"బాగుంది-ఎక్కడ తేను! ఇది పెసర కాయలు వచ్చే కాలమేనా?" అని "

"రారాదూ-అల్లా-కట్టదాకా కలిసి మాట్లాడుకుంటూ పోదాము" వస్తే-ఏదైనా అడగాలనిపించింది పాడు మనసుకి.

"ఇంకానయం—రేపు పొద్దున మా యింటికి రండి — ఇప్పుడే రారాదూ — మళ్ళీ మరిచిపోతారేమో — కాసేపు

కలిసి మాట్లాడుకోవచ్చు-మా ఆయనని కూడా చూద్దురుగాని.''

''మీ ఆయనకూడా వచ్చాడూ — అయితే రేపు వస్తాలే — అప్పుడప్పుడూ కనపడుతూండు — వస్తా'' తలకాయ తిప్పుకొని గట్టెక్కాడు.

చెరువునిండా నీళ్ళున్నాయి. కదిలే నీళ్లల్లో చంద్రబింబం బంగారు కలశంలా మెరుస్తోంది. పద్నాలుగు క్యారెట్లది కాదు — ఇరవై రెండు — జిగజిగమని మెరుస్తో అలలు ఒడ్డుకి తగుల్తున్నాయి. గోరు వెచ్చటిగాలి చెంపల్ని వేళ్ళతో నిమురుతూంది. జుట్టు రేగగొడుతూంది - జవరాలులా-ప్రియురాలులా -

గుడిదగ్గర మెట్లచివర చతికిల పడ్డాడు సన్యాసిరావు. నీళ్ళు కాళ్ళ కానుతున్నాయి-అహ కాళ్ళే నీళ్ళని తంతున్నాయి.

''ఒకవేళ చిన్నమ్మే కనుక వస్తే యేం మాట్లాడేవాడు - సిగ్గులేకపోతే సరి-నయం-ఇంకా వచ్చింది కాదు - నానాతిట్లు తిట్టేది—అంతవరకు చూపించిన అభిమానం కాస్తా చంపుకునేది - చివరికి దీనికి యిటువంటి పాడుబుద్ధి పుడుతుందేం - అదే యీ మనసుకి-ఆడది ఒంటరిగా కనిపించిందంటే చాలు - అసలే కోతి - కల్లు తాగింది - ముల్లు గుచ్చుకుంది - నిప్పు తొక్కింది — అప్పుడు దానిగంతులు చూడలా — అదే మాదిరి — కొంచెం ఎక్కువ. నిక్షేపంలాంటి పరువు పోయేది. చిన్నప్పుడు పెసరకాయలు పెట్టిన ఆపద్బాంధవిని-అనాధ రక్షకిని-యీ రాత్రి నాశనం చేసి ఉండేవాడిని'' లెంపలు వేసుకున్నాడు

సన్యాసిరావుకి నీరసం కమ్మింది. చిన్నమ్మ మీద ఆక్షణంలో కలిగిన ఆలోచనకి చాలా బాధపడ్డాడు. కండ్ల వెంట గిర్రున నీళ్ళు తిప్పుకున్నాడు. ఇటువంటి పాడు ఆలోచన వచ్చినందుకు చావటం ఉత్తమం-మనసు చావుచావుమని పదేపదే పోరుపెట్టింది.

''ఎట్లా చావటం — దేంట్లోపడి చావటం'' గొణుక్కున్నాయి అస్పష్టంగా పెదిమలు.

''వెర్రివాడా! — చావుకే మార్గం దొరకలేదా — చూడూ — ఎన్ని నీళ్ళున్నాయో — రాకాసి లాంటి పెళ్ళాంతో పోరు క్షణంలో ముగిసిపోతుంది — రక్తాన్ని పీల్చే జలగలాటి ఆఫీసరు పీడావదిలి పోతుంది - పాడు కోరికలు కోరే శరీరంలోని దానవుడు కిక్కురు మనకుండా చస్తాడు-లే-లేచి కర్తవ్యం పాలించు'' వ్యధతో మూలిగే మనసు గోలపెట్టింది.

-సన్యాసిరావు లేచాడు-మోకాళ్ల లోతు నీళ్ళల్లోకి దిగాడు.

''ఒళ్ళంతా గడ్డకట్టుకపోయె యీ

చన్నీళ్ళలో - దీంట్లోపడి చావాలా - ఎంతలోతుందో ఏమో-నీళ్ళల్లో పడ్డ వాడు వెంటనే చావడటగా-మూడు మాట్లు మునిగి లేచి-బిందెడు నీళ్ళు తాగి పోతాడటగా..."

"ఎన్ని నీళ్ళు తాగితేనేం - ఎన్ని మాట్లు మునిగి లేస్తేనేం - చావటం ఖాయం - పడు - వెంటనే దూకు - దెబ్బకి ప్రాణం పోతుంది."

"నీ ఒడుపు నాకు తెలుసులే-నన్ను వదిలించుకోందామని - ఇంతకష్టంగా చావటమా-కొంచెం తేలిగ్గా చచ్చే ఉపాయం ఉంటే బాగుణ్ణు - విషం మింగితే - చేదుగా ఉంటుందటగా - తీరిగ్గా ఆలోచించాలి."

గబగబా ఒడ్డెక్కాడు సన్యాసి రావు. కాళ్ళు గ డ గ డా వణుకు తున్నాయి. నడవలేక కూర్చున్నాడు.

"నీకు చద్దామని లేదు - నువ్వు దేనికీ పనికిరావు - ఏ పనీ చేయలేవు - పెళ్ళాందగ్గరికిపోయి తప్పయిందని ఒప్పుకో ...''కిలకిలానవ్వింది మనసు.

''నవ్వు-అంతే నవ్వు-నవ్విన నాప చేనే పండుతుందంటారు-ఇంతకీ నేను చావననా - తప్పకుండా చస్తాను - ఇంటికి తిరిగి పోవటమా-కల్లోమాట- అ యి నా నా చా వు సం గ తి నీ కెందుకూ-నోరుమూసుకొని నీ పనేదో నీ వు చే సు[illegible]రా దూ!" పైకే మాటల్ని వదిలేశాడు సన్యాసిరావు.

''నేనా-నిన్నా! చావమన్నానా- పుట్టిది-నువ్వే పెళ్ళాంతో పోట్లాటేసు కొని చస్తానని యీ చెరువు దగ్గర కొచ్చావు మాట్లాడవేం''

"నీ అమ్మకడుపు కాలా-అంతలా అరుస్తావేం. దణ్ణంపెడతా - నోరు మూసుకోవే!"

మనస్సు ఆపుకొలేక నవ్వాపుకుంది. సన్యాసిరావు దానికి చేయెత్తి నమ స్కరించాడు.

''మరిచేపోయినా - నిన్న మాలతి వచ్చిందటగా - ఎట్లాఉందో ఏమో - చిన్నప్పుడు ములక్కాడలా ఉండేది. యీ పడాది మూడుమాట్లు నవసినవసి యింటికొచ్చిందట. దా ని త ం డ్రి బొద్దింకమీసాల మామయ్య - కన పడటం లేదు - ఏమిచేస్తుందో-దాన్ని చూచివచ్చిన తరువాత చస్తేనేం...?"

"చావకుండా తప్పించుకోవటానికి ఉపాయం-కాకపోతే మాలతికీ నీకూ సంబంధ మేమిటి - ఉన్న సంబంధం ఏనాడో ఊడిపొయ్యె."

"నువ్వు కాస్త ఊరుకోవే-తెంచు కుంటే తెగిపోయేయా యీ మమ తలు - బంధుత్వం - పైగా మేనమామ బిడ్డ - పేరుకూడా నా పేరులాంటిది కాదు - మాలతి - అంటుంటేనే ఒక

పున్నూ జ్ఞాపకానికి రావటంలా-చిన్న ప్పటినుండి కలిసి పెరిగాము-అన్నింటి కంటే ముఖ్యం నన్ను ప్రేమించింది- దాన్ని చూట్టం తప్పా!"

''పుట్టిది - అది నిన్ను ప్రేమించ లేదు-నిన్ను నీవే మోసంచేసుకుంటు న్నావు."

''కాదు గట్టిది. లేకపోతే రేపు పెళ్ళనగా నగలన్నీ పెట్టుకొని అర్ధ రాత్రి కొంపవదలి నా గది కెందు కొస్తుంది - వచ్చినది పోకుండా నాకీ సంబంధం యిష్టంలేదు బావా! యిద్ద రమూ కలిసి ఎక్కడకన్నా పోదాము- నన్ను నువ్వే చేసుకో-అంటూ కాళ్ళా వేళ్ళా పడలా-అప్పుడు నే నేమన్నా - అంతా అయిపోయిన తరువాత పరువూ మర్యాదా నట్టేట్లో కలిపి యిల్లా రావటం మంచిదికాదని యింటిదాకా - పడ్చేదాన్ని సాగనంపి రాలా?''

"పరువుకోసం కాదు ఆరోజు నువ్వు పాకులాడింది - నాకు తెలుసు- ఆ బోడ్డింక మీ సాల మామయ్యకు భయపడి "

''అదీ ఉందిలే-సరేగాని-నీకివన్నీ ఎల్లా తెలిసాయి - నా పర్సనల్ ఎఫైర్సన్నీ-ఊర్మిళకే తెలవవే?"

''నా మాటవిని యింటికి పో - ఊర్మిళ ఎదురు చూస్తుంటుంది - ఇంత వరకూ అన్నం తిన్నదో లేదో - లే - తొందరగా లేచిపో!"

మనస్సు మెడపట్టుకొని గెంటింది. సన్యాసిరావు కదలకుండా అల్లాగే కూర్చున్నాడు. ఎన్నో విషయాలు మెదడులో మెదిలేవరకు పెళ్ళాంమీద కోపం కొంచెం తగ్గింది.

"ఒకవేళ చచ్చిపోయాననుకో - డైలీపేపర్లలో ఫొటో పడుతుందా-దేశా నికి సెలవలిస్తారా - రోజువారీ కార్య క్రమం ఇరవైనాలుగు గంటలనుండి కొంచెం తగ్గుతుందా - నా పెళ్ళానికి సానుభూతి సందేశాలూ - గంపెడు టెలిగ్రాములూ అందుతాయా - అందవు-నేనేం దేశానికి నాయకుణ్ణా- ఆఫీసులో కాలికింద చెప్పుని - చెప్పు కింద తేలునాయె - నెలచివరిరోజు గదా - కొంపలో అన్నీ అయిపో వచ్చాయి. ఇప్పుడు చస్తే చుట్టాలంతా వచ్చి మీదపడితే-కావాల్సిన సామా నెల్లా - అదే వాళ్ళను మేపటానికి - ఊర్మిళ బతుకేమయిపోతుంది-అయినా ఆత్మహత్య చేసుకున్న వాళ్ళని ఆస్ప త్రిలో ముక్కలుముక్కలుగా కోస్తా రటగా — అదేదో తలచుకుంటుంటే బతికుండగనే కోసినట్లుంది. ఈ చావు చక్రకంటే ఊరుకోవటం మంచిది కాదూ!''

దీనంగాచూస్తూ బాష్పాలు రాలు



"ఉహుఁ, మా అబ్బాయికి కట్నం అక్కర్లేదు-ఉంటానికి యిల్లివ్వండి-చాలు!"

స్తున్న ఊర్మిళ బస్ట్ సైజు ఫోటో సన్యాసిరావు మనసులో మెదిలింది. దాన్ని అంతగా యేడిపిస్తున్నానే అనుకుని చాలా బాధపడి పోయాడు.

"పరికోరి చేసుకున్న వాణ్ణి-దాన్నట్లా పడిపి స్త్రీభగవంతుడు నన్ను క్షమిస్తాడా-పడిచింది-ఒకరునన్ను క్షమించేదేమిటి-రోజూ నాతో ఎంతగా పోట్లాట వేసుకుంటూంది-నరకం-ఆ కొంపలో మళ్ళీ కాలు పెట్టటమా! కలలో "

సన్యాసిరావు మనస్సు మళ్ళీ ఉద్రేకపడింది ముక్కుపుటాలు ఆగకుండా పాములాగా బుసలు పెడుతున్నాయి. గోరువెచ్చనిగాలి చల్లదనానికి మళ్ళింది. చలిగాలి చొక్కాలోదూరి కితకితలు పెడుతూంది ముంగురులు నుదుటి మీదపడి ఆడుకుంటున్నాయి. రావాకులు గాలికి టప టప కొట్టుకొంటున్నాయి — దాదాపు అరగంట గడిచింది. విషయం అంటూలేని అంతులేని ఆలోచనలో నుండి మెదడు దిగ్గునలేచి కూర్చుంది.

"ఒకవేళ చచ్చిపోవటమే నిజమైతే-నాలుగేండ్ల మోహన్‌రావు ఏమైపో

తాడు ?— చదువు చెప్పించేవాళ్ళు లేక నీళ్ళకావిళ్ళు మోసుకొని బతుకు తాడు-పిల్లది యేమౌతుంది?- ఒడిశె లాగా ఎదిగి పెళ్ళికాక గుదిబండగా తయారవుతుంది. పాలుకుడిచే పసివా డేమైపోతాడు?- ఏమో - చెప్పలేను. అంతా వీధిలోపడి అడుక్కు తింటూంటే ఫలాని సన్యాసిరావు సంతానం అంటే- ఎంత నామోషీ - ఇన్సూరెన్సన్నా కట్టలేదు — వాళ్ళెట్లా బతుకుతారు. వచ్చేటప్పుడు దాని మొగమైనా చూడక పోతిని - పిల్లవాళ్ళని కడసారిగా ముద్దాడక పోతిని ఆ చంటివాడిమీదే మనసుపోతూంది - అచ్చంగా తల్లి పోలిక - ముక్కూ మొగం అంతా అచ్చుపోసినట్లే."

చావటం రేపటికి వాయిదా వేసి సన్యాసిరావు దిగ్గున లేచాడు. మనిషి క్రుంగిపోయాడు. "ఎందుకు! నా మనసు పిల్లలమీద యింత కొట్లాడు తుంది. చావదలచుకున్నవాణ్ణి చావ కుండా ఎందుకు తిరిగిపోతున్నాను. నేను పనికిమాలినవాణ్ణి. మనిషై పుట్టిన వాడు ఏ రోగమోవచ్చి చావాలి. అంతేగాని వాళ్ళంతవాళ్ళు చావలేరు. అహ-అలాగామ. ఏమైనాగాని రేపు తప్పక చావాల్సిందే — కడసారిగా అందరి మొగాలు బాగాచూచి-కొంచెం బాధలేని చావు కోరుకోవటం పెద్ద తప్పేమీకాదు." అనుకుంటూ ఇంటి గుమ్మందగ్గర ఆగిపోయాడు.

"పిలవటమా-వద్దా"

లోపల నిశ్శబ్దంగా ఉంది. గుండెలు వేగంగా కొట్టుకున్నాయి. "అది ఉందా. లేకపోతే యే బావిలోనైనా దూకిందా!" ఉరకలు వేసే మనస్సును ఆపుకోలేక మెల్లగా తలుపుతట్టేడు.

ఊర్మిళ తలుపు తెరచుకొని వెలు పలికి వచ్చింది. మొగమంతా ఏడ్చి ఏడ్చి పీక్కుపోయింది. మొగుడి చేయి పట్టుకొని "ఇంత సేపు ఎక్కడున్నారు? నన్నిలా ఏడిపిస్తే మీకేమొస్తుంది." బావురుమంటూ ఏడ్చింది.

సన్యాసిరావు గుండె ద్రవించి పోయింది. "పాపం! అన్నం తిన్నదో లేదో! తిననట్లేఉంది — ఏమైపోయాననుకుందో! ఊరుకో అందామా-వద్దా..."

వద్దనుకుంటూనే పెళ్ళాం కళ్ళ నీళ్ళు తుడిచాడు సన్యాసిరావు. ఆడ దాని ఏడుపుకే కరిగిపోయే తాను ఎందుకూ పనికిమాలినవాణ్ణను కున్నాడు.

"ఇద్దరికీ కలిపే వడ్డించు" అంటూ మూలిగి కాళ్లుకడుక్కుంటానికి పెరటి వైపు నడిచాడు

అనుకున్నపని ఒక్కటీ సాధించలేని సన్యాసిరావు ఎప్పుడూ "పనికిమాలిన వాణ్ణ"ని తిట్టుకుంటాడు. 



జాబిలి తలవంచగా, మోమును చూపించవే
హంసలు దరిజేరగా అందెలు కదిలించవే

ఒరవీడిన కత్తిలా ఒరులను జడిపించవే
పురివిప్పిన నెమలిలా హాయిగ నటియించవే

గోరెంటల రంగుతో గోళ్ళను మెరిపించవే
నవ్వుల కెరటాలతో పువ్వుల మురిపించవే

చుక్కలు నీకోసమై నేలకు వంగినవిలే
మబ్బులు నీకురులలో మల్లెలు చల్లినవిలే

వెన్నెల నీకాళ్ళపై పన్నీటిని పోసెలే
తెమ్మెర నీపైటనే దొంగిలించ జూచెలే

గుండెలలో గాయము కొంచెము మానిందిలే
అపుడే ఈ దీనుని కోపముతో చూడకే

కలల కలువపూలతో మాలలు గుచ్చానులే
నీ మెడలో వేయగా నేనిటు వచ్చానులే

జంటలతో నిండిన చల్లని ఈ తోటలో
ఒంటరిగా ఉండుట తగదని గమనించవే.

# ఏమిటీ బంధం?

'తాతయ్యా, నీకు చేతనయిన పన్లు ఒక్కటి మూడంటే మూడున్నాయి. అవేమిటో చెప్పగలవా?' మూలగదిలో నున్న పెట్టెలన్నీ బయటపడేసి వాటి లోని చెత్త అనబడే కాగితాలన్నీ బయట పడేస్తూ గంభీరంగా అంది శారద.

వరండాలో పడకకుర్చీలో కాళ్ళు జాపుకునికూచుని, అర్ధనిమీలిత నేత్రా లతో ఆకాశంవంక చూస్తూన్న రాఘవేంద్రబాబు చిరునవ్వుతో శారద వంక చూశాడు.

'తెలియదు చిట్టితల్లీ! నువ్వు చెప్పు పోనీ'

'ఏమిటంటే, మొదటిది, శారదా!! అమ్మా!! శారదా, అమ్మా అంటూ నా వెంట పసిపిల్లాడిలాగా తిరగటం, రెండోది, అమ్మా శారదా! మంచి భావం వొచ్చిందమ్మా, కాస్త రాసిపెడుదూ! చెయ్యొణుకుతోంది, అంటూ నాచేత తెల్ల కాగితాలు ఖరాబు చేయించటం, మూడవది అర్ధనిమీలిత నేత్రాలతో ఆకాశంవంక చూస్తూ కూర్చోటం, తెలిశాయా?' అంటూ పెదిమలు బిగబట్టుకుని, కోపంగా చూసింది తాతయ్యవంక శారద.

వృద్ధరాఘవేంద్రబాబు కుర్చీ కదిలి పోయేట్లు నవ్వాడు.

'చూశావా తల్లీ, జీవితమంతా ఆలో చించి నే తెల్సుకోలేని విషయాల్ని నువ్వు 'కట్టె' 'కొట్టె' 'తెచ్చె' అన్నట్లు మూడు వాక్యాల్లో చెప్పేశావు. అందుకే అంతటి వివేకవతియైన శారదంటే నాకు అంత ప్రాణం'

'ప్రాణాలకేంగానీ, చూశావా తాతయ్యా, ఈ పుస్తకాని కప్పుడే యౌవ్వనం ఉడిగిపోతోంది. కాగితాలన్నీ గోధుమరంగు తాల్చాయి. ఇదుగో! ఇది చూశావా? దీని కప్పుడే ప్రౌఢత్వం గూడా పోయి వృద్ధాప్యం ఆవరిస్తోంది! అయ్యయ్యో! ఈ భారమయిన గ్రంథా నికి పాపం త్యాగగుణం ఎక్కువల్లే వుంది. చాలామటుకు పురుగులకి ఆహార మయిపోయింది.'

అంటూ పరిహాసంగా నవ్వుతూ ఒక్కొక్క పుస్తకాన్ని ఎండలోకి గిరవాటేసి పెట్టెల్లోని పురుగులన్నీ దులుపుతోంది.

'అమ్మా, శారదా, శుక్రవారం వాసుదేవ్ వొస్తున్నాట్టమ్మా, ఇవాళే జాబు వచ్చింది'

టి. ఎస్. లక్ష్మి



శారదకి ఈ మాటలేం వినిపించలేదు. చేతిలో తిరగేస్తున్న పుస్తకంలో ఎర్ర సిరాతో కొట్టవచ్చినట్టున్న పేర్లు 'వాసుదేవ్, నీరజ' ఆమె దృష్టిని ఆకర్షించాయి. తాతయ్య మాటల్లో చాలాతడవలు తనా పేర్ల ప్రసక్తి విందిగానీ వాట్లని గురించి 'అత్యంత ఆత్మీయులు' అన్న మాటల కంటె ఎక్కువ తెల్సుకోలేక పోయింది. తనీ రోజు వాట్లని గురించిన చరిత్ర తెల్సుకోవాలన్న ఆత్రుత అరికట్టలేక పోయింది. పెట్టెలన్నీ ఎండలోకి లాగేసి పుస్తకాలన్నీ దూరదూరంగా పరిచి తన చేతిలోని కాగితాలతో గదిలోకి వెళ్ళి తలుపులు మూసుకుంది. కుర్చీలో కూర్చుని తాకితే చిరిగేట్టున్న పేపర్లని బల్లమీద పరచి చదవసాగింది.

* * *

తలుపుతట్టినచప్పుడుకి రాసుకుంటున్న కాగితాలు వదిలేసి రాఘవేంద్ర బాబు తలుపుతెరిచాడు. ఆకర్షణీయమైన యువకుడు నిలబడివున్నాడు.

'నమస్తే. మీరే అనుకుంటాను రాఘవేంద్రంగారు', సభ్యతా సంస్కారం, వుట్టిపడుతోంది అతని మాటల్లో. ఒకసారి నిశితంగా ఆయన్ని పరికించాడు.

'అవున్నాయనా! ఇలారా, కూర్చో' కుర్చీ జరుపుతూ అన్నాడు.

'చూడగానే ఆకర్షించే వ్యక్తి' అనుకున్నాడు రాఘవబాబు.

'ఆ, ఇంతకీ వచ్చిన పనేమిటి?'

'ఏంలేదు. మీ యింట్లో భాగం అద్దెకి వుందనితెల్సి వచ్చాను. ఇస్తారా?'

'ఇవ్వటం మాట అలా అట్టిపెట్టు,

ముందర మీకు సరిపోతుందో లేదో చూసుకోవూ!' ఆయన కెందుకో ఆ యువకుని మర్యాదవాచకంతో సంబోధించాలనిపించలేదు తా మిద్దరూ ఏదో అస్పష్టభావబంధితులమయినట్లు, ఆయనమాటల్లో మర్యాదకంటె ఆప్యాయతే ముందుకురికింది

'ఒకసారి చూపించండి అయినా మా యిద్దరికి సరిపోనంత చిన్నది కాదనుకుంటాను' అన్నాడు

ఇల్లంతా ఒకసారి చూసివచ్చారు ఇంటికి సంబంధించిన మాటలయిన తరువాత రాఘవేంద్రబాబన్నాడు

'చూడు బాబూ, పేరుకి మీ కా భాగం కానీ, ఇంట్లోవుండేదయినా నేనొక్కడ్నే కావలిస్తే మీ రీ భాగంకూడా వాడుకో వచ్చు నాకేం అభ్యంతరం వుండదు ఆ, ఇంతకీ అమ్మాయిని ఎప్పుడు తీసుకొస్తావు ...సరే - సరే.. ఆ, ఇంతకీ నీ పేరడగనేలేదు చూశావా!' ఏదో ఆశ్చర్యజనకమయిన విషయం జరిగి నట్లుగా అన్నాడు.

'వాసుదేవ్' యువకుడు చిరునవ్వుతో జవాబు చెప్పి శలవుతీసుకు వెళ్ళిపోయాడు

'ప్చ్! ఏదో ఎక్కడో లోపంవుంది కుర్రాడిలో ఎక్కడో అర్థంకావటంలా' గొణుక్కుంటూ రాతలో మునిగిపోయాడు

* * *

ఇంటిముందు ఆగిన బండిచప్పుడుకు తలయెత్తి చూశాడు రాఘవేంద్రబాబు వాసుదేవ్ వెనకాలే ఆమెకూడా దిగింది చుట్టూచూస్తూ నెమ్మదిగా లోపలికొస్తోంది

ఆయన క్షణం నిర్ఘాంతపోయి తేరుకున్నాడు 'అందానికర్థం ఆ పిల్లేనేమో!'

'ఓహ్! సరూ వుంటే ఇప్పుడు అలాగే వుండేదేమో ప్చ్' ఏంలాభం! ఇప్పుడు తన అర్ధాంగిలేదు, తన తనయ లేదు అయినా పాపిష్టివిధి ఇద్దర్నీ ఒకేమాటు దూరం చేయాలా? పూర్వస్మృతులతో ఆయనకళ్ళు అశ్రుభరితా లయ్యాయి అప్రయత్నంగా ముత్యాలవంటి కన్నీటి బిందువులు చెక్కిళ్ళమీదుగా జారిపోయాయి ఆయనచూపు చెదిరిపోయింది

'నమస్కారం, బాబాయిగారూ' తన్ను ఉద్దేశించిన మృదుస్వరాన్ని, ముకుళిత హస్తాల్ని చూసి క్షణం చలించిపోయాడు తడబాటు సర్దుకుని, 'ఆ, ఆ, వచ్చారామ్మా, మంచిది, పదండి లోపలికి' తన వ్యాకులపాటు సర్దుకుని లోపలికి దారి తీశాడు

ఆమెకి అన్నీ వివరించిచెప్పి వచ్చి వరండాలో పడకకుర్చీలో కూలబడ్డాడు వాసుదేవ్ సామాను లోపలికి చేరేస్తున్నాడు

ఇవాళ తనమనస్సెందుకో సంతోషంతో పొంగిపోతోంది ఎందుకో, తన శరీరమంతా చిన్నగా వణుకుతోంది ఏదో ప్రచ్ఛనమయినభావన హృద

యాన్ని కలచివేస్తోంది సంతోషమో దుఃఖమో చెప్పలేనిస్థితి

'ఇంకా ఎంతసేపు అటు చూస్తూ నుంచుంటావు ? వంటప్రయత్నం కానీ' కొంచెం తీక్షణంగా వచ్చిన మాటలకి వులిక్కిపడ్డాడు రాఘవబాబు వాసుదేవ్ భార్య నుద్దేశించి అన్నమాట లివి ఆయన తనధ్యాసలో మునిగిపోయాడు

వాసుదేవ్ ఆఫీసుకి వెళ్ళటానికి వచ్చి ఆయనముందర నిలబడ్డాడు ఏదో చెప్ప టానికి సంకోచిస్తున్నట్టుగా వుంది మొహం రాఘవేంద్రబాబు తలెత్తి చూశాడు

'ఓహ్, ఆఫీసుకి వెడుతున్నావా నాయనా, వెళ్ళు, వెళ్ళు అమ్మాయి కేం భయంలేదు నేను జాగ్రత్తగా చూస్తూం టాను ' అతని ప్రశ్న నూహించుకుని ఆయనే సమాధానం చెప్పేశాడు

'చూస్తారా ? సరే, జాగ్రత్తగా చూడండి ' వెళ్ళిపోయాడు

మాటలో ఏదో విరుపు, ఏ మూలో వ్యంగ్యం కళ్ళల్లో ఏదో భావం, ఇదో తరహా అనుకుని నిట్టూర్చాడు రాఘ వేంద్రబాబు

'బాబాయ్ భోజనమయిందా' మృదు వుగా అడిగింది ఆమె

కళ్ళు మూసుకుని ఆలోచనా ప్రవా హంలో కొట్టుకుపోతున్న రాఘవేంద్ర బాబు కళ్లు తెరిచాడు ఆమె నిలబడివుంది

'ఓ, నువ్వా అమ్మాయ్ ! ఊఁ, భోజనమా ? ఏదీ ఇంకా కాలా ఇదుగో లేస్తున్నా, ఇంక ప్రయత్నం మొదలు పెట్టాలి' అన్నాడు

ఆమె నిర్ఘాంతపోయింది ఒక్క క్షణం తీవ్రంగా ఆయనవైపు చూసి లోపలికి నడిచింది. 'బలేవారే మీరు ! ఇప్పుడు టైమెంతో తెలుసా బాబాయ్ ! పన్నెండుగంటలయింది. ఇంకా ప్రయత్న మెప్పుడు, భోజనమెప్పుడు ?' ఆమె కుంపటిరాజేసి బియ్యం కడుగుతోంది

ఆమె చొరవకి నిర్ఘాంతపోతూ నిలబడి పోయాడు రాఘవేంద్రబాబు

'ఒక్కమాట చెప్పండి పొద్దున రాత్రికి కలిపి ఒకమాటే వండేసు కుంటారా లేకపోతే . '

ఆయన తేరుకుని అన్నాడు 'లేదమ్మా, నేను రాత్రిపూట భోజనం చెయ్యను' 'సరే ఒక్క అరగంట బయట కూర్చోండి' అనేసి ఆమె పనిలో మునిగి పోయింది హితాహితజ్ఞానం కోల్పోయిన మనిషికిమల్లే బయట కుర్చీలో కూర్చుండి పోయాడు

'బాబాయ్ ! బుట్టలో కూరలేం లేవు మరి కూర ఏం చేసుకుందా మను కున్నారు ?' గుమ్మంలో నుంచుని అడిగిందామె

'అవునమ్మా, పొద్దున మార్కెట్‌కి పోదామనుకుంటూనే మర్చిపోయాను'

దిమ్మెరపోయిన మనసుని అదుపులోకి తెచ్చుకుని సమాధానం చెప్పాడు

'ఇంత అశ్రద్ధ అయితే ఎలా బాబాయ్ మనిషికి ఆలోచన లొక్కటేనా ఏమిటి ఆహారం ?' ఆయన భారమంతా తనే మోస్తున్నట్టుగా సణుక్కుంది

'ఇది ఇవాళ వచ్చింది కాదమ్మా తొమ్మిది సంవత్సరాలనించీ ఇలాగే గడిచిపోతోంది ఇకముందు మటుకు గడవదా తల్లీ' చిన్నగా నవ్వుతూ అన్నాడు ఆమె మాట్లాడకుండా లోపలికి వెళ్ళింది

తర్వాత అరగంటవరకు లోపల్నించి ఏవో చిన్న చిన్న ధ్వనులు వినిపిస్తూనే వున్నాయి రాఘవబాబు తిరిగి ఆలోచనా ప్రవాహంలో పడిపోయాడు ఆయనకి ఆమెని వారిద్దామనిగానీ, నీకెందుకమ్మా ఇంతశ్రమ అందామనిగానీ, ఆఖరికి సానుభూతిగా నాకోసం ఎంత శ్రమ పడుతున్నావమ్మా అని గానీ అందామని కూడా ఆ వృద్ధమస్తిష్కానికి తోచలా ఆమెకి బాధ్యత, తనకి అధికారం వున్నట్టు అనిపించింది

అరగంట తరువాత లోపల్నించి పిలుపువచ్చింది రాఘవబాబు మడికట్టు కుని వచ్చి పీటముందు కూచున్నాడు విస్తరిలో అన్నీ పొందికగా వడ్డించి వున్నాయి ఆమె నేతిగిన్నె పుచ్చుకుని పక్కన కూచుంది

'ఇవాల్టికి మీకీ కందిపొడి పచ్చడి భోజనమే బాబాయ్ రేపట్నించి ఇంత అశ్రద్ధగా వుంచేమటుకు వూరుకునేది లేదు' అంటూ నెయ్యి వడ్డించింది

ఆయన బుద్ధిమంతుడయిన కుర్రాడికి మల్లే భోజనంచేస్తున్నాడు ఆమె ఆయన్ని శ్రద్ధగా చూస్తూ కూచుంది

హఠాత్తుగా ఆయన తలెత్తి ఆమెవైపు చూశాడు కళ్ళు నిండివున్నాయి నీళ్ళతో మసకలేసినకళ్ళు ఆమె రూపాన్ని ద్వివిధాల్లో చిత్రించాయి ముత్యంవంటి బిందువులు చెంపలమీదుగా జారి విస్తరిలో పడ్డాయి

ఆమె ఒక్కక్షణం ఖంగారుపడి పోయింది 'ఏమయింది బాబాయ్ ?'

ఆయన అంగవస్త్రంతో కళ్ళు తుడుచుకుని ఆమెనిచూస్తూ అన్నాడు 'ఏం లేదమ్మా ఇంత ఆప్యాయంగా వడ్డించిన భోజనంతిని ఎన్నిసంవత్సరా లైందా అని ఆలోచిస్తున్నా "

ఆమె కళ్ళు దించుకుంది 'ముందు భోజనం కానివ్వండి బాబాయ్, తర్వాత మాట్లాడుకోవచ్చు' అంటూ లేచి దేని కోసమో వెతుకుతోంది

'సీరూ, సీరూ' వాకిటిలోంచి పెద్దగా కేకలు వినబడ్డాయి ఆమె ఒక్కక్షణం నిర్ఘాంతపోయినిలబడిపోయింది వెంటనే తేరుకుని, 'బాబాయ్, మీరు భోజనం కానివ్వండి ఆయనొచ్చారు, నే వెడు

తున్నాను' అంటూ హడావుడిగా వెళ్ళి పోయింది

ఐదునిమిషాల తర్వాత పక్క భాగం లోంచి మాటలు వినపడుతున్నాయి నెమ్మదిగా

'ఓహో ముసలాయనకూడా రసికుడే నన్నమాట' వాసుదేవ్ కంఠం

'మాట్లాడవేం ?' అబ్బ ' ఎంత కరినత్వం ।

'ఇవాళ నీ . ముద్దుల పాపాయి. నీ ప్రియమయిన సోదరుడూ రా లేదా ఏమిటి ?' వ్యంగ్యపూరిత పరిహాసం .

'. . . .. . '

'పోనీలేగానీ పాపం. ఆ వృద్ధబడుగు మీద ఏం ప్రదర్శిస్తావుగానీ నీ వన్నె చిన్నెలు. ఏంకొత్తనాటక మాడుతున్నావో అనే చూద్దామని వొచ్చా' సరే వెడుతున్నా. నీ నాటకం పూర్తికానివ్వు' బూట్ల చప్పుడు వేగంగా దూరమయిపోయింది దానివెనకే సన్నని రోదన ధ్వని

రాఘవబాబు నిర్ఘాంతపోయి కూచుండిపోయాడు బాహ్యస్మృతి కలిగేటప్పటికి చేతులు. విస్తరిలోని భోజనం ఎండిపోయాయి చేతులు కడుక్కొని వెళ్ళి కుర్చీలో కూలబడిపోయాడు

* * *

'ఇదుగో చూడు బాబూ. ఒక మాట చెప్పాలి. ఇలారా' ఆఫీసునుంచి తిరిగి వచ్చిన వాసుదేవ్‌నిపిల్చాడు రాఘవబాబు




'ఏమండీ. ఏమిటి సంగతి' పేంటు జేబుల్లో చేతులు పెట్టుకుని దూరంగా

నిలబడి మృదువుగా అడిగాడు వాసుదేవ్.

రాఘవబాబు ముఖం ఒక్కక్షణం అసహ్యంతో నిండిపోయింది యీ మృదుత్వ వాక్కుల్లో, సుందరరూపంలో ఎంత కఠినత్వం ఇమిడివుంది! గంటల్లోనే పూర్తి వార్ధక్యం ఆయన మొహాన్ని కమ్మేసినట్లుంది ఆయన వాసుదేవ్ మొహంలోకి సూటిగా, తీక్షణంగా చూస్తూ అన్నాడు

'మీరు ఈ ఇల్లు ఖాళీచేసెయ్యండి బాబూ'

వాసుదేవ్ ఉలిక్కిపడ్డాడు తనను తాను సంబాళించుకుని చిరునవ్వు నవ్వుతూ 'పెద్దవారు, మీరు నాతో హాస్యం ఆడుతున్నట్టున్నారు '

'హాస్యమా ? అబ్బే అదేం కాదు నేను నిజంగానే చెబుతున్నాను మీరు ఇల్లు ఖాళీ చేసెయ్యాలి ' ఆయన మాటలు దృఢంగా ధ్వనించాయి

'ఎందుకని' వాసుదేవ్ సాలోచనగా ప్రశ్నించాడు.

సమాధానానికి తడబడ్డాడు రాఘవబాబు ' ..ఎందుకయితేఏం? మీరు ఇల్లు ఖాళీ చేసెయ్యాల్సిందే వీలయినంత త్వరలో చేసెయ్యి' అనేసి కంగారుగా లోపలికివెళ్ళి తలుపు వేసుకున్నాడు

వాసుదేవ్ లోపలికి నడిచాడు గోడవారగా నిలబడ్డ నీరజని చూసి హాస్యమాడాడు "నీరూ, పాపం ముసలాయన్ని మొదటిదెబ్బతోనే హడలకొట్టేసినట్టున్నావు' అది అతని హాస్యపు ధోరణి'

నీరజ భూమిలోకి కుంచించుకుపోయి నిస్తేజంగా అతనివంకే చూస్తూనుంచుంది గోడకి అటువేపున్న రాఘవబాబు చెవులు మూసుకుని ధఢాలున తలుపు తీసుకుని బయటికి వెళ్ళిపోయాడు

* * *

మరునటిరోజు పొద్దున పదిగంటలు దాటింది రాఘవబాబు వరండాలో కుర్చీలో కూర్చుని దూరంగా రోడ్డుకేసి చూస్తున్నాడు

తలుపుపక్కన గాజులచప్పుడయింది

'బాబాయ్' ఆయన వులిక్కిపడి ఇటు తిరిగిచూశాడు నీరజ తలుపు పక్కన తలదించుకుని అపరాధినిలానిలబడివుంది ఆమెలో నిన్నటి నిర్భయాత్వం చొరవ ఇవాళ నామమాత్రంగాకూడా లేవు

'ఏమ్మా, ఏం కావాలి ?'

సమాధానంలేదు తలుపుచాటునించి రోదన నాపుకుంటున్న ధ్వని, టపటపమని నీటిబిందువులు భూమ్మీదపడిన శబ్దం వినిపించింది

రాఘవబాబు చలించిపోయాడు హృదయం కరిగి నీరయింది నెమ్మదిగా ఆమెదగ్గర నుంచుని తల నిమురుతూ,

'ఎందుకమ్మా,ఏంజరిగింది?'అన్నాడు ఆయనకంఠం ఏమూలో చిన్నగా వణికింది

ఆమె ఒక్కసారిగా బావురుమని ఆయన హృదయంలో తలదాచుకుని వెక్కివెక్కి ఏడుస్తోంది ఆయన ప్రేమ పూర్వకమయిన హస్తస్పర్శకి ఆమెలో నిండివున్న బాధ, దుఃఖం పొంగి పొర్లి పోయాయి

కొంతసేపటికి ఆమె ఆయన హృదయంలో తలదాచుకునే వెక్కిళ్ళు ఆపుకుంటూ అంది.

'బాబాయ్.. మీరేమన్నా చెయ్యండి గానీ మమ్మల్ని ఇల్లుఖాళీచెయ్యమని మటుకు అనొద్దు నాకు ఈమాత్రం ఆత్మీయతకూడా దూరంచెయ్యకండి బాబాయ్'

రెండునిమిషాలు నిశ్శబ్దంగా నడిచి పోయాయి.

'అదికాదు తల్లీ, ఆ సంగతి నాకంటె గూడా నీకే ఎక్కువ క్షేమకరమయింది' ఆయనమాటలు బరువుగా ధ్వనించాయి

'బాబాయ్, మీ బిడ్డ ఈ స్థితిలోవుండి ఇలా ప్రార్థిస్తుంటే మీ రింత కఠినంగా సమాధానం చెప్పేవారేనా ? చెప్పండి' నీరునిండిన కళ్ళతో తలెత్తి ఆయన వంకేచూస్తూ జాలిగా ప్రశ్నించింది నీరజ

సంవత్సరాల తరబడి ఆయనలో నిగూఢముగా నిక్షిప్తమయిన ప్రదేశంలో కానరాని దెబ్బకొట్టింది నీరజ ప్రశ్న ఆయన ఒక్కసారి వులిక్కిపడ్డాడు నిజమే! తన సరూయే ఈ స్థితిలోవుంటే తనింత నిర్దయగా ప్రవర్తించగలిగే వాడేనా ?

మూసుకున్న ఆయన నేత్రాలనుండి నీళ్ళుజారి ఆమెతలమీద పడ్డాయి 'సరే తల్లీ, నీ ఇష్టమే కానివ్వు.'

ఆయన చెయ్యి ప్రేమగా ఆమె వీపు నిమిరింది

* * *

'వొదినా వొదినా' పెద్దగా కేకలు పెడుతూ మెట్లెక్కి వస్తున్నాడు అందమైన సన్నని పొడుగాటి యువకుడు

గుమ్మంలో కూర్చుని ఏవో కుట్టుకుంటున్న నీరజ తలెత్తి చూసింది ఆకేకలకి ఆమెకళ్లు సంతోషంతో మెరిశాయి 'రా, రాజూ' అంటూ ఆప్యాయంగా ఆహ్వానించింది

'ఏంవొదినా చెప్పా పెట్టకుండా ఇల్లుమారి వొచ్చేశారు ఎడ్రసు తెలియకపోతే ఈ బిడ్డ, తల్లిని ఎలా వెదుక్కుంటూ వస్తాడో చూద్దామనుకున్నావా ఏం' అంటూ చనువుగా ఆమెదగ్గిర నేలమీద కూర్చున్నాడు

'అలా అయినా నువ్వే నెగ్గావుగా రాజూ' చిరునవ్వుతో ఆమెలేచి కుట్టు సామాను లోపలపెట్టి వచ్చింది

వరండాలో కుర్చీలో అర్ధనిమీలిత నేత్రాలతో ఆకాశంవంక చూస్తున్న రాఘవబాబుని చూసి 'ఈయన ఎవరు' అన్నట్టు చేత్తో సంజ్ఞచేశాడు రాజు

'ఆయన బాబాయిగారు రాజూ రా వెడదాం' అంటూ అతన్ని రాఘవబాబు దగ్గరకి తీసుకొచ్చింది

'బాబాయ్ ఇతను మా మరిది, రాజు, బి ఎ చదువుతున్నాడు' అంటూ పరిచయం చేసింది

రాఘవబాబు అతనివంక చూశాడు నిర్మలమయిన మొహంలో నిష్కల్మషమయిన కళ్ళు మెరుస్తున్నాయి మనిషిలో ఉత్సాహం కొట్టవచ్చినట్టు కనిపిస్తోంది

'నమస్కారమండి' అన్నాడు చేతులు జోడించి

రాఘవబాబు కుర్చీలో సర్దుకు కూర్చుని 'కూర్చోబాబూ' అంటూ కుర్చీ చూపించాడు అతనిలో సంకోచమనేది ఎక్కడా వున్నట్లులేదు చొరవగా మాట్లాడేస్తున్నాడు

'చూశారా బాబాయ్ ఈవిడగారు ఈ పసిబిడ్డని మాతృవిహీనుడిగా చేసి వేద్దామని నాకు తెలియకుండా మకాం మార్చేసింది 'మనకెందుకులే ఇంకా వీడి గొడవ అనుకుందేమో' అయినా నేను విడిచిపెడతా ననుకున్నారేమో' అంటూ పరిహాసపూర్వకంగా నవ్వుతూ ఆమెవంక చూశాడు నీరజ సిగ్గుపడిపోయి తిరిగి నవ్వుతూ,

'బాబాయ్, ఇతన్ని గనుక మీదగ్గరొక గంట కూచోపెట్టకున్నారంటే ఇంక వొదిన అనే పదాన్ని మీరు జన్మలో వినాలనుకోరు రాజూ, బాబాయితో మాట్లాడుతూవుండు, నేనిప్పుడే వస్తా' అంటూ లోనికి వెళ్ళిపోయింది

'రాజూ, నువ్వు అన్నయ్య వాళ్ళతో వుండకుండా వేరే ఎందుకుంటున్నావు?' రాఘవబాబు యధాలాపంగా ప్రశ్నించాడు ఆ ప్రశ్న వినగానే అతని మొహం మలినమయి దీనంగా మారిపోయింది ఏదో చెప్పబోయి, ఈ అపరిచిత వృద్ధునితో తనవిషయాలు చెప్పటం సమంజసమా కాదా అన్న సంకోచంతో ఆగిపోయాడు తిరిగి ఏదో ఉద్రేకంతో చెప్పసాగాడు

'వదిన నన్ను సంవత్సరంక్రితం ఇంట్లోంచి వెళ్ళిపొమ్మంది బాబాయ్' అంటూండగానే అతని కంఠం గద్గదమైపోయింది రెండుక్షణాలాగి తిరిగి ఉత్సాహంగా చెప్పసాగాడు

'వాసుఅన్నయ్య నాకేదో వరసకి దూరపు బంధువు మాతృ పితృ విహీనుడయిన నన్ను తొమ్మిదిసంవత్సరాలప్పుడు అన్నయ్య తనదగ్గిర తెచ్చిపెట్టుకొన్నాడు సొంతతమ్ముడికంటె ఎక్కువగా ఆదరించి విద్యాబుద్ధులు చెప్పించాడు నాకు పన్నెండు సంవత్సరాలప్పుడు వదిన మా యింటికి వచ్చింది అప్పటికామె నాకంటె నాలుగుసంవత్సరాలు పెద్దది పసితనంలో మాతృవిహీనుడనయిన నాకు వదిన వచ్చినతరువాత




"నా యింట్లో నన్నే అవమాన పరుస్తావా ? ఉండు నీకు పాఠం నేర్పుతాను "
"చాలు ' ఇప్పుడు నేర్చుకున్నది చాలు "

మాతృప్రేమ ఏమిటో తెల్సింది ఆవిడ నన్ను పసిపిల్లాడిలాగా లాలించి ప్రేమించి పెంచింది ఆవిడని నే నెప్పుడూ వదినగా, ఒకయువతిగా చూడలేదు ఆవిడ ఎప్పుడూ నా మనోపథంలో అత్యుత్తమ మయిన మాతృస్థానంలో నా మాతృదేవతగా ప్రత్యక్షమౌతుంది జన్మించిన ఎన్నెండు సంవత్సరాలకి దొరికిన మాతృదేవత వదిన ' అతని కళ్ళు నీళ్ళతో నిండి విచిత్రంగా మెరిశాయి మొహంలో ఏదో దివ్యంత్వం భాసించింది చెప్పటం ఆపేశాడు రాఘవబాబు చిత్రంగా ఈ విచిత్రయువకునివంక చూస్తున్నాడు

'బాబాయ్, నాకు టైఫాయిడు వచ్చినప్పుడు వొదిన నెలరోజులు చేసినసేవ ఏ తల్లీ తన బిడ్డకికూడా చెయ్యదు నేను అతిశయోక్తిగా చెపుతున్నాననుకోకండి, ఆ తరువాత ఆ తరువాత' అతను రుద్ధకంఠంతో చెపుతున్నాడు

'ఆ తరువాత వొదిన కేమయిందో, తనప్రేమంతా ఎక్కడ దాచుకుందో నన్ను ఇంట్లోంచివెళ్ళి హాస్టల్లో వుండమని శాసించింది అన్నయ్యతో మొరపెట్టుకున్నాను అన్నయ్య మాట్లాడక వూరుకున్నాడు బాబాయ్! నాకు ఇప్పటికీ ఒక సంగతి అర్థంగాదు ! మృత్యు

ముఖంలోంచి నన్నంత శ్రమపడి రక్షిం చిన వొదిన అంత నీరసస్థితిలో ఇంట్లోంచి ఎందుకు వెళ్ళకొట్టిందో అర్థంకాదు కానీ కారణమేమిటో కనుక్కోటానికి నేనెప్పుడూ ప్రయత్నించలేదు సరే, అప్పట్నించి మనకి హాస్టల్‌వాసమను కోండి ఆ తరువాతయినా రెండురోజుల కొకసారి వచ్చి వొదినను చూసివెళ్ళే వాడిని ఒకరోజున ఆ మాత్రం రాక పోకలుకూడా బంద్ చెయ్యమని ఆర్డరు వేసింది నే నేం చెప్పానో తెల్సా బాబాయ్, 'కావలిస్తే నీ చేత్తో కాస్త విష మిచ్చి చంపెయ్ అంతేగానీ సమీపంలో వుండి మాతృదేవతని దర్శనం చేసుకోని మూర్ఖుడు ఎవడూ వుండడు' అని మొండికేశాను దాంతో ఏంచేస్తుంది పాపం గప్‌చుప్‌గా వూరుకుంది' అని రాజు పకపకా నవ్వుతున్నాడు,

రాఘవబాబు క్షణం నవ్వుతూ మరు క్షణం విచారపూరితంగా మారే ఈయువ కుని గాథ వింటూ వుండిపోయాడు

నీరజ లోపలినుంచి వచ్చింది ఆమె కళ్ళు తడిగా వుండి గంభీరప్రేమతో చూస్తున్నాయి రాజువంక నీరజనిచూసి రాజు వుత్సాహంతో చెపుతున్నాడు 'బాబాయ్, మా అన్నయ్య ఏమంటాడో తెల్సా నేను నీరజదేవిగారి బిడ్డనట - ముద్దుల పాపాయినట' అంటూ బిగ్గరగా నవ్వాడు

'రాజూ, ఫలహారం చేద్దువుగాని రా అని ఆమె లోపలికి వెళ్ళిపోయింది రాజుకూడా వెనకాలే వెళ్ళిపోయాడు

రాఘవబాబు మనసు రోదించింది వాసుదేవ్, బిడ్డ అన్నపుడు కనపరచిన వ్యంగ్యం ఈ పసిబిడ్డడు వింటే ఏమయి పోతాడు ?

*　　*　　*

సంధ్యాకాశం ఎఱ్ఱరంగు పులుము కుంది పక్షులు గుంపులు గుంపులుగా తమ తమ నివాసాలవైపు ప్రయాణం సాగిస్తున్నాయి దూరంగానున్న చింత చెట్టుమీదగూడిన పక్షులు ఒక్కసారిగా శబ్దంచేస్తూ పైకెగిరాయి రాఘవబాబు సంధ్యాసౌందర్యం తిలకిస్తూ తన్మయు డౌతున్నాడు అప్రయత్నంగా అతని చెవులు పక్కభాగంనుంచి వస్తున్న సంభాషణ నాలకిస్తున్నాయి

'ఏమండీ, రాజు పొద్దున మీరు వెళ్ల గానే వచ్చాడు ఇవాళ కాలేజీకి సెలవట ఇది రక్కంటే గూడా చిక్కిపోయా డండీ'' నీరజకంఠం అత్యుత్సాహంతో చెపుతోంది సంవత్సరాల వియోగానం తరం ముద్దుబిడ్డని వీక్షించిన మాతృదేవి ప్రథమ సందర్శనోత్సాహం ఆమె కంఠంలో పరుగులు తీస్తోంది

'ఓహో, అయితే ఇంకేం? ఇవాళంతా తమరు భూమ్మీదకాకుండా స్వర్గంలోనే తేలిపోయారన్నమాట' సరే ఇంతకీ

దేవిగారికి ఏం కానుకలు సమర్పించు కున్నాడు ప్రసన్నురాలుని చేసుకోటానికి'

సమాధానం లేదు

రాఘవబాబుకి ఆ కంఠాన్ని చేతుల్తో గట్టిగా నొక్కి చంపేయాలన్నంత కోపంతో వూగులాడిపోయాడు వివేకం హెచ్చరించింది 'అది తనకేసంబంధమూ లేని పొరుగువారి సంగతి '

తిరిగి వాసుదేవ్‌కంఠం ధ్వనించింది 'ఏం సమాధానం లేదు అవున్లే పాపం పొద్దున్నుంచి అమృతసమానమైన సరస వాక్కుల్తో ముగగినదానివి నా మాటలు పాపం, కాలకూట విషానికిమల్లే వున్నాయల్లేవుంది ' నవ్వుతున్నాడు

రాఘవబాబులో వివేకం నశించింది వ్యధతోకూడిన మొహం రౌద్రాకారం దాల్చింది పెద్దపెద్ద అంగలు వేసు కుంటూ పక్క భాగం గుమ్మంముందు కొచ్చి గాలికెగిరిన తెరగుండా కన్పిం చిన దృశ్యంచూసి నిశ్శబ్దంగా వెనుతిరిగి వెళ్ళిపోయాడు వాసుదేవ్ బాహు బంధంలో నిస్తేజంగా భర్తవంక చూస్తున్న నీరజ రూపమే ఆయన కళ్ల ముందు కదిలి రాత్రంతా శివరాత్రి జాగారంచేశాడు రాఘవబాబు,

*　　*　　*

వారంరోజులు గడిచిన తరువాత ఒక వుదయాన వాసుదేవ్ హడావుడిగ ఏవో నాలుగు పొట్లాలు తీసుకొచ్చి రాఘవబాబు కిచ్చియెదురుగా కూర్చున్నాడు అతనిలో ఉత్సాహం, సంతోషం పరవళ్ళు తొక్కు తున్నాయి

'ఇవన్నీ ఏవిటిబాబూ' అన్నాడు రాఘవబాబు

'ఏంలేదు మీరు ఈ తీపి తిని మమ్మల్ని ఆశీర్వదించాలి' నమ్రతలో సిగ్గు కలిసినమాటలు మధురంగా వెద జల్లాడు వాసుదేవ్ చిరునవ్వుతో

'విశేష మేమిటో చెప్పావుకావు' కారణమేమిటో వూహించుతూనే అడి గాడు నవ్వుతూ రాఘవబాబు

'ఇంకా విశేష మేమిటని అడుగుతా రేవిటండీ,మాస్టర్ వాసుదేవ్‌వస్తున్నాడు' అంటూ పక్కకిచూసి కొంటెగా నవ్వు తున్నాడు. తలుపునానుకుని నిలబడ్డ నీరజ మొహమంతా సిగ్గు పులుముకుని లోపలికి పరిగెత్తింది

రాఘవబాబు అర్థంచేసుకున్నాడు

ఆయన స్నేహపూర్వకంగా నవ్వుతూ వీపుమీద చెయ్యేసి నిమురుతూ వాసుదేవ్ నుద్దేశించి అన్నాడు

నిజంగా చాలా సంతోషమయిన వార్త చెప్పావుబాబూ చాలా సంతోషంగా వుంది సర్వగుణ సంపన్నుడయిన పుత్రుడు కలగాలని దీవిస్తున్నాబాబూ' సంతోషంతో ఆయన గొంతువణికింది

'నీరూ, నీరూ, ఇలారా ఒకసారి' బిగ్గరగా పిలిచాడు వాసుదేవ్ నీరజ

గుమ్మందగ్గర - నిలబడి ప్రశ్నార్థకంగా చూసింది వాసుదేవ్ వంక

'ఇలారా బాబాయిగారికి నమస్కారం చేయి' అంటూ ఆదేశించాడు భార్యని

నీరజ రాఘవబాబు పాదాలనంటి నమస్కరించింది, ఆమె తలమీద చెయ్యివేసి అస్పష్టంగా ఏదో దీవించాడు

'వుండమ్మా వుండు, ఇప్పుడేవస్తా' అంటూ లోనికి వెళ్ళిపోయాడు తడబాటుతో తిరిగి బయటికివచ్చి చేతిలో నున్న బంగారపు గొలుసు ఆమె చేతిలో పెడుతూ,

'అమ్మా! నా సంతోషంకోసం ఇది తీసుకోమ్మా, కాదనకు' అని ఆమెచేతిలో గొలుసు వుంచి గుప్పెడు మూశాడు

తడబాటుగా, గంభీరంగా, సంతోషంగా వణుకుగా, విచిత్ర రీతుల మారుతున్న రాఘవబాబునిచూసి దంపతులు నిర్ఘాంత పోయారు నీరజ వాసుదేవ్ నెమ్మదిగా లోపలికి వెళ్ళిపోయారు

పూర్ణగర్భిణియైన తన సరు భారంగా అడుగులు వేస్తూ ముందుకు కదిలి పోతున్న దృశ్యం అస్పష్టంగా దూరమయిపోయింది రాఘవబాబు మనో నేత్రంలో

* * *

ఎండలో తీక్షణత తగ్గి చల్లగాలి ఆరంభించింది రాఘవబాబు మొక్కలకి కుదుళ్ళు కట్టి, ఎండిన కొమ్మలు తుంపుతున్నాడు గేటు తెరుచుకుని సన్నని నల్లని యువకుడు లోనికొచ్చాడు

'వాసుదేవ్‌గారుండేది ఇక్కడే గదండీ' రాఘవబాబుని చూసి అడిగాడు

'అవున్నాయనా, అదో, ఆ భాగంలో అంటూ తర్జనితో నిర్దేశించి తనపనిలో నిమగ్నుడయ్యాడు

అతను వరండాలో నిలబడి 'అక్కగారూ' అని పిలిచాడు నీరజ బయటికొచ్చింది ఆమెమొహం సంతోషంతో విప్పారింది

'నువ్వా రామూ, రా ఇలా కూర్చో' కుర్చీతెచ్చి బయిటవేసింది అతను కూర్చోకుండానే పేంటు జేబుల్లోంచి రెండు ఏపిల్‌పళ్ళు తీసి కుర్చీ మీద వుంచాడు

'కులాసాగా వున్నావా రామూ, రావటమే మానేశావు' ఆమె ఆప్యాయంగా అడిగింది

అతను సమాధానం చెప్పకుండా చిరునవ్వు నవ్వాడు రెండు నిమిషాలాగి అన్నాడు 'రాజుకనబడితే మీ అడ్రసు తెల్సుకొని ఇవాళ వచ్చాను'

'ఇంకా ఎన్ని రోజులు స్వహస్తపాకం రామూ? వుద్యోగం దొరికి సంవత్సరం దాటిపోతున్నా కాలయాపన చేస్తున్నావుగానీ—'

ఆమె మాటల్ని మధ్యలోనే త్రుంచేసి 'నువ్వెప్పుతూ అలాగే అంటావు అక్కా,

సరేలే వెళ్ళివస్తా' అంటూ ఆమెకి నమస్కరించి వెళ్ళిపోయాడు

ఆమె గేటుదాకా వెళ్ళి అతను వెళ్ళిన వైపే చూస్తోంది

'ఎవరమ్మా నీరజా ఆ అబ్బాయి?' రాఘవబాబు అడిగాడు ఆమె గేటు దగ్గర్నుంచి లోపలకి నడచి వరండా గట్టుమీద కూర్చుంది

'రాము, బాబాయ్' అంది

'నీకు తమ్ముడున్నట్టు ఎప్పుడూ చెప్ప లేదేం తల్లీ? వుండకుండా వెళ్ళి పోయాడేం?' రాఘవబాబు కడిగిన చేతులు తుడుచుకుంటూ కుర్చీలో కూర్చున్నాడు

'నాకు అంత అదృష్టంలేదు బాబాయ్, నాకు నా అన్నవాళ్ళుగాని తోడబుట్టిన వాళ్ళుగానీ ఎవరూలేరు '

'ఓహో, అయితే వరస తమ్ముడన్న మాట ఎవరయితేనేం తల్లీ, ప్రేమ, ఆప్యాయత వుండాలిగానీ' కుర్చీ వెనక్కి చేరగిలబడుతూ అన్నాడు రాఘవబాబు

'అది కూడా కాదు బాబాయ్ ఇది వరకు మేమున్నచోట పక్కయింట్లో వుండేవాడు చిన్నప్పుడే తలితండ్రులు పోయారట ఒక అక్కగారు వుండే దట ఇతన్ని ఎంతో ప్రేమగా చూసే దట ఆవిడనివదలి రాము ఒక్క క్షణం గూడా వుండలేకపోయేవాడట అక్కగారు రాముని తనతోపాటు అత్త వారింటికి తీసుకువెళ్ళిందట ఇతను ఆమెతో రావటం భర్తకి ఇష్టంవుండేది గాదట అయినప్పటికీ తమ్ముడ్ని ప్రాణం లాగా చూసుకుంటూ ఎలాగో అతనికి ఇంటర్ వరకు చదువు చెప్పించింది ఆఖరికి ఒకరోజున భార్యా భర్తల పోట్లాటలో అతను వుద్రేకంతో ఆమెని మెట్లమీదనించి తోశాడట నిండు గర్భిణిగావున్న ఆమె దొర్లి క్రిందపడి చనిపోయిందట ఆ తరువాత బావగారు రాముని ఇంట్లోంచి పంపించేశాడుట ఇతను బట్టలదుకాణాల్లోను, ఇంకెక్కడో పద్దులురాసి, ప్రైవేట్లు చెప్పుకుని ఎలాగో బి ఎ లో చేరాడు అప్పుడే మేమున్న ఇంటి పక్కన ఒక చిన్న గదిలో వుండే వాడు అంతవరకు అతను నాకు తెలి యదు సంవత్సరంన్నర క్రితం ఒకరోజు ప్రొద్దుట పన్నెండు గంటలప్పుడు మా యింటికి వచ్చాడు మాసి చినిగిన దుస్తులు, అవమానం, నీరసం, అశక్తత మొహంలో తాండవమాడుతున్నాయి లోపలికివచ్చి 'అక్కగారూ, నేను ఈ పక్కగదిలో వుంటున్నాను మీరయినా ఒక్క పదిహేను రూపాయలిస్తే నా చదువుపూర్తిచేసిన వారవుతారు, లేకపోతే నా ఖర్మ ఇంతే అనుకుంటాను' అంటూ నిరాశగా దాదాపు ఏడుపు స్వరంలో అడిగి క్రింద కూలబడ్డాడు

'బాబాయ్! నిజంగా నేనా క్షణంలో ఎంత ఆశ్చర్యపడ్డానో చెప్పలేను నేనా

వ్యక్తిని అంతక్రితం ఎప్పుడూ చూసిన జ్ఞాపకంలేదు అంత చొరవగా తన పరీక్ష ఫీజుకి తక్కువయిన డబ్బు నన్ను ఇమ్మనమని అడుగుతున్న ఆకుర్రాడితో ఏం చెప్పాలో అర్థంకాలేదు

'తిరిగి ఆతనే అన్నాడు 'మీ డబ్బుని గురించి భయపడక్కర్లేదక్కయ్యా ఈ నెలాఖరుకి మీ కిచ్చేస్తాను ఇద యినా మా అక్కవుంటే మిమ్మల్నడిగే అవసరం వచ్చేదికాదు ఎందర్నడిగా పదిహేను రూపాయిలు దొరికాయికాదు ' అని తనలో తనే కుమిలిపోతూ ఏడవ సాగాడు నేను మాట్లాడకుండా పది హేను రూపాయలు తీసుకొచ్చి అతని కిచ్చాను అతను ఆశ్చర్యంతో కృత జ్ఞతతో చూస్తూ, 'ఒక అక్క పోయినా ఇంకో అక్క దొరికింది మీ డబ్బు నెలాఖరుకి ఇచ్చేస్తా అక్కయ్యా' అంటూ సంతోషంగా వెళ్ళిపోయాడు అన్నట్టు గానే పదిరోజుల తరువాత డబ్బు తీసు కొచ్చి ఇచ్చేశాడు నా కెందుకో తీసుకో బుద్దిపుట్టలేదు తిరిగి ఇచ్చేస్తూ, 'డబ్బు ఇవ్వక్కర్లేదు తమ్ముడూ! నాకు తమ్ముడు లేని లోటు తీర్చు వీలున్నప్పుడు వొస్తూవుండ'మన్నాను

'అంత తేలిగ్గా వొదిలిపెడతాననుకు న్నారా అక్కయ్యా! చూడండి, విసుగు పుట్టి మీరే ఇంక రామాకు తమ్ముడూ! అంటారు' అంటూ డబ్బు వదలిపెట్టి వెళ్ళిపోయాడు.

నీరజ చెప్పటం ఒక్క క్షణం ఆపింది రాఘవబాబు ఆమెవైపు చూస్తున్నాడు ఆమె చిన్నగా నవ్వి తిరిగి చెప్పసాగింది దృష్టి శూన్యంవైపు చూస్తున్నట్లుంది

'రామూ చాలా విచిత్రమయిన వ్యక్తి బాబాయ్ రాజు ఎంత ఉత్సాహవంతుడో రామూ అంత గంభీరుడు వొచ్చినప్పుడు ఐదు నిముషాలకంటే ఎక్కువ ఎప్పుడూ వుండడు వొచ్చే ప్రతిసారీ ఏవో పండ్లో పూలో తీసుకొస్తాడు వారించినా వినడు 'నా సోదరికోసంతెచ్చే చిన్నకానుకలు ఇవి' అంటాడు ఒకసారి మీరు అంటాడు మరొకసారి నువ్వు అంటాడు పరిహాసంగాగూడా ఎప్పుడూ మాట్లా డడు అతని చూపులెప్పుడూ ఆప్యా యంగా కృతజ్ఞతగా చూస్తూవుంటాయి ఒకసారి ఏమన్నాడో తెల్సా బాబాయ్, 'నేను చచ్చిపోయినా నన్ను ప్రేమిస్తున్న ఒక సోదరి వుందని నాకు చాలా సంతో షంగా వుంది అక్కా !' అన్నాడు తన చనిపోయిన సోదరిని నాలో వూహించు కుంటా డనుకుంటాను రామూ బి ఎ అయిన తరువాత ఏదో కంపెనీలో వుద్యోగం చేస్తున్నాడు వారానికో, పది హేను రోజులకో ఓసారి వస్తాడు ఆ రావటంకూడా ఈయనకి ఇషంవుండదు '

అప్రయత్నంగా వెలువడ్డ ఆఖరి



"చూడండి మొన్న మీరు జీవిత భీమామీద నమ్మకం లేదన్నారు. ఇవ్వాళ కొంచెం ఆలోచించండి. మీకు ప్రాయంతోపాటు జ్ఞానంకూడా పెరిగి ఉంటుంది. అందుకనే..."

---

వాక్యం తరువాత ఆమె అప్రతిభురాలై పోయింది. గబగబా లేచి లోపలికి వెళ్ళి పోయింది.

రాఘవబాబు ఆశ్చర్యంగా చూస్తున్నాడు. తన బాధని మాటమాత్రం బైటకి చెప్పుకోని గంభీరురాలు. ఏదో పరధ్యాన్నంలో జారిన మాటలకి సిగ్గుపడి పోయింది.

ప్రపంచంలో వ్యక్తులు విచిత్ర తరహాలు. తమబాధలు గాధలు బైటకుచెప్పుకోలేని గంభీరులు. ఎదుటివారు పక్కాగా ఆలకించినా సహించగలరుగానీ, అప్రయత్నంగా నయినా తమనోట ఒక్క వాక్యం వెలువడ్డా సిగ్గుతో ఇదై పోతారు.

ఆ తరువాత వారంరోజుల వరకు నీరజ రాఘవబాబుని తలెత్తి చూడలేక పోయింది.

* * *

అటుపైన ఆరునెల్లు గడిచిపోయిన తరువాత ఒకరోజున సాయంసంధ్య తిలకిస్తూ రాఘవబాబు తనలో తనే ఇలా అనుకున్నాడు.

'ఓహ్ ! నేనే ఏదో పొరబడ్డాను. ఇద్దరిమధ్యా ఏదో పెద్ద అగాధం వుందను

కుని అపోహపడ్డాను ఇద్దరూ చిలకా గోరింకల్లాగా వున్నారు '

రాఘవబాబు అభిప్రాయాన్ని వమ్ము చేస్తూ ఆ మరుసటిరోజు సాయంత్రం విచిత్రమయిన సంఘటన జరిగింది

ఆ సాయంత్రం కాఫీ ఫలహారాలయిన తరువాత నీరజ, వాసుదేవ్ సంభాషణలో ఎద్దారు మధ్యలో నీరజ వినయంగా అడిగింది

'ఏమండీ, రాజు విషయం ఒకరవ్వ తెల్సుకోండి ఎందుకనో వచ్చి నెలరోజు లయింది ఎప్పుడూ ఇన్ని రోజులు రాకుండా వుండలేదు '

'ఏం, పాపం విరహంతో చస్తున్నావా' దిగులు పెట్టుకున్నావా' ఒక్కసారిగా కోపోద్రిక్తుడై కరినంగా అరిచాడు

'కాదండీ ! ఏం సుస్తీ చేసిందోనని ' ఆమె గొంతులో బిడ్డసుఖాన్ని శంకిస్తున్న మాతృదేవి గొంతు పెరపెర ధ్వనిస్తోంది.

వాసుదేవ్ కంఠం తారస్థాయి నందు కుంది

'ఎప్పుడూ రాజు, రాజు ఇదెజపం ఎదురుకుండా మొగుడన్నవాడు చచ్చా డన్న జ్ఞానం వుందా ? నువ్వుగూడా వాడి తోనే పో" ఉద్రేకంగా మొరటుగా, అసహ్యంగా అరుస్తున్నాడు

గుమ్మం తెర అవతల ఎవరో కదిలి వెడుతున్న నీడపడింది నీరజ తడబడుతూ గుమ్మంలోకి వెళ్ళింది మసకచీకటిలో గేటుదాటుతున్న ఆకారం అస్పష్టంగా కని పించింది ఆమె గుండెలు అమిత వేగంతో కొట్టుకుంటున్నాయి ముందుకొచ్చి రాఘవబాబునిచూసి వణుకుతూ 'బాబాయ్ ఆ వెళ్ళింది' అంది

ఆయన కళ్ళుమూసుకొని నిర్లిప్తంగ సమాధానం చెప్పాడు, 'అవునమ్మా రాజు వెళ్ళిపోయాడు '

ఆమె వెలవెలపోయినమొహంతో అటే చూస్తూ విరుచుకు పడిపోయింది అటుపైని రాజుని ఎవరూ ఎప్పుడు ఆ వూళ్ళో చూడలేదు

* * *

ఆమె తరచుగా వున్నదున్నట్లే పడి పోతూవుండేది మనిషి నీరసించి కృశించి పోయింది డాక్టర్లు హిస్టీరియా అన్నారు ఇంకేదో అన్నారు మందులు వాడారు అయినా ఆమె హృదయం ఘోషిస్తున్నదానికి ఎవరూ జవాబు చెప్పలేక పోయారు

వాసుదేవ్ నిద్రాహారాలు మాని ఆమె దగ్గరే గడిపాడు అతని ఏడుపుని కూడా ఆమె లెక్కచెయ్యలేకపోయింది ఒకి నిశిరాత్రి తన చిహ్నమయిన శిశువుని వొదిలి ప్రపంచబంధాలని తెంచుకుని స్వేచ్ఛాప్రపంచంలోకి ఎగిరిపోయింది

* * *

శారద చదువుతున్న పుస్తకంలోని



రాత అక్కడితో ఆగిపోయింది. మనస్సంతా ఏదో ఆవేదన అలుముకోగా మిగిలిన పేజీలు కూడా తిరగేసింది. ఆ తరువాత అక్కడక్కడ కొన్ని అసంపూర్తి విషాదగేయాలున్నాయి. చివరి పేజీలలో వాసుదేవ్‌ని గురించి రాసివుంది. వ్రాతంతా అస్పష్టంగా, అశాంతితో రాసినట్లు అవక్రమంగా రాసివుంది.

* * *

రోజుల పసిగుడ్డుని గుండెలకి హత్తుకుని రిక్షాదిగి లోపలికి వచ్చాడు వాసుదేవ్. వాసుదేవ్ గుర్తించలేకుండా అయిపోయాడు. విచారంతో లోతుకు పోయిన కళ్ళు, రేగినతల, పెరిగినగడ్డం, మాసి నలిగిన బట్టలు, చూడటానికి భయంకరంగా వున్నాడు.

కుర్చీలో పడుకున్న రాఘవబాబుకి వాసుదేవ్‌ని చూడంగానే ఎక్కడలేని అసహ్యం ముంచుకొచ్చింది. హంతకుని చూసినట్టుగా అసహ్యంగా, నిర్లక్ష్యంగా

ఒకసారి చూసి, తిరిగి కళ్ళుమూసుకున్నాడు. వాసుదేవ్ తనముందు నుంచున్నట్టు అలికిడి తెలుస్తూనే వుంది. అయినా ఆయన కన్నులు విప్పలేదు. అతను జాలిగా పిలిచాడు.

'రాఘవబాబూ'

'ఊ' కళ్ళుమూసుకునే అన్నాడు.

'నన్ను అసహ్యించుకుంటున్నారా రాఘవబాబూ' జాలిగా మాట్లాడుతున్నాడు వాసుదేవ్.

సమాధానంలేదు.

హఠాత్తుగా అతను, రాఘవబాబు వొళ్ళో పసిబిడ్డని పడుకోబెట్టి ఆయన కాళ్ళమీదపడివెక్కి-వెక్కి-ఏడుస్తున్నాడు.

'నన్ను క్షమించండి బాబా. క్షమించండి. పాపిని! నీరూని దక్కించుకో లేకపోయాను. ఈ పసిగుడ్డునయినా చూడండి బాబాయ్. ఈ పసికందుని మీ కివ్వమని నీరజ ఆఖరికోరిక. కాదనకండి బాబాయ్. ఆమె మిమ్మల్నెంతగా ప్రేమించి గౌరవించిందో మీకు తెలియదు రాఘవబాబూ' అతను తడబడుతూ, ఏడుపులో మాటలు మింగేస్తూ రాఘవబాబు పాదాల్ని వూపేస్తూ రోదిస్తున్నాడు.

రాఘవబాబు చలించిపోయాడు. కళ్ళుతెరిచి పసిగుడ్డువంక చూశాడు. అమాయకమైన చూపుల్తో చేతుల్ని కొట్టుకుంటూ, చిరునవ్వు వొలకపోస్తోంది. రాఘవబాబు మనసు క్షణం విసుక్కుంది. 'ఏమిటీబంధం తనకి'. తిరిగి ఆయన మనసు జాలితో ఆర్ద్రమైపోయింది ఆయన కళ్ళముందు తను గొలుసు బహూకరించిన నాటి నీరజ ప్రత్యక్షమయింది. మరుక్షణంలో సరుగా మారిపోతోంది. ఏమిటి తనకీ ఆమెకీ సంబంధం? బంధుత్వంలేదు, అమితమయిన ఆత్మీయతలేదు, ఏవిధమయిన బంధంలేదు. కొన్ని నెలల పరిచయం తనింట్లో వారున్నారు. ఒక్కసారి ఆమె తనబాధ్యత వహించినట్లు ఆప్యాయంగా భోజనం పెట్టింది – కాని ఒక్క విషయం మటుకు నిజం. తనకా క్షణంలో తన బరువు బాధ్యతలన్నీ ఆమెమీదవేసి శేషజీవితం నిశ్చింతగా గడపాలన్న వూహ కలిగింది. అదిగూడా క్షణమాత్రమే మరుక్షణం గాజు మేడలాగా పగిలిపోయింది. ఆమె ఆప్యాయంగా వడ్డించిన భోజనం కూడా తను పూర్తిగా తినలేకపోయాడు.

ఆమె ఏనాడూ తన మనసువిప్పి సుఖదుఃఖాలు తనతో చెప్పుకోలేదు. పెద్దవాడుగా, పితృస్థానంలో ఉన్నవానినిగా వూహించి తన్ను ఏ సలహాలూ కోరలేదు అయినా ఆమెని చూసిన ప్రథమంలోనే ఏమూలో అరనిజ్వాలగా తనలో వెలుగుతున్నమంట చల్లబడింది. తనసరుని ఆమెలో చూసుకున్నాడా? ఏమో! అది తనకే పూర్తిగా తెలియనివిషయం.

అయినా ఆమెకి తన మీదెందుకంత నమ్మకం? పసిబిడ్డ సంరక్షణభారం తన్ను వహించమనడంలో అర్ధం? భర్త మీద అవిశ్వాసమా? తనమీద గౌరవమా? నమ్మకమా? ప్రేమా?

ఆమె చివరిక్షణాల్లో హాస్పటలుకి వెళ్ళటానికి రిక్షాలో కూర్చున్నప్పుడు నమస్కారంచేసి ఏమంది? 'ముందు భారం మరేవహించాలి బాబాయ్' అంది. అంటే దాని అర్ధం ఇదేనా? తనమృత్యువుని ముందే వూహించిందా? అంతా అగమ్యగోచరం! తనకీ ఆమెకీ ఏదో బంధం వున్నట్లు కనిపించకపోయినా వున్నట్లే అనిపిస్తోందే? ఏమిటీ విచిత్రం?

ఇహలోకంలో సంబంధంలేని దానిలాగా పసిపాప పెద్దగా ఏడుస్తోంది. రాఘవబాబు ఆలోచనల్లోంచి బయట పడ్డాడు. పసిపాపని చూడంగానే తిరిగి ఏదో ప్రేమ, మమత తన హృదయాన్ని పెనవేస్తోంది. దైవవిచిత్రం! అంతటి విషాదంలో కూడా ఆయన కెందుకో సన్నగా నవ్వొచ్చింది.

వాసుదేవ్ ఇంకా రోదిస్తూనేవున్నాడు. రాఘవబాబు ఒక్కసారిగా జాలితో కదిలిపోయాడు. నిన్నటిదాకా అంత గంభీరంగావున్న పురుషుడు ఒక్క స్త్రీ మరణంతో ఇవాళ సర్వస్వం కోలుపోయిన వాడికి మల్లే ఎంత జాలిగా ఏడుస్తున్నాడు. ఒక్క స్త్రీ మరణం ఈ పసిబిడ్డకి, పురుష హృదయానికి తీరనిలోటు కలిగించిందా? ఇదేనా బాంధవ్యం? జీవితం తరచిన కొలదీ అడుగడుక్కీ అనేక చిత్ర విచిత్రాలు ఎదురౌతాయి. ఒకొక్క విచిత్రానికి ఒకొక్కపేరు. జాలి, ప్రేమ, హృదయం మనసు, మమత అన్నీ అవే.

రాఘవబాబు ఏదో స్థిరనిశ్చయుడయినట్లు పసిపాపని చేతిలోకి తీసుకునినుంచున్నాడు. ఆయన మనసు ఒక్కసారిగా హాయిగా చల్లగా ప్రశాంతంగా వున్నట్లనిపించింది. పనిమనిషికి పసిపాపని ఇచ్చి వాసుదేవ్‌ని తీసుకొని లోపలికి నడిచాడు.

* * *

రాఘవబాబుఒడిలో తలపెట్టి ఏడుస్తున్నాడు వాసుదేవ్. ఏదో దూరలోకాల్లోకి చూస్తున్న చూపులు - చెప్పుకుపోతున్నాడు.

'నీరూ వాళ్ళది మా గ్రామమే రాఘవబాబూ. ఆమె తల్లిమీద ఏవేవో చాలా దుష్ప్రచారాలు వాడుకలో వుండేవి. బంధువులందరూ వెలివేశారు. నీరజని చూడగానే నా భార్యగా ఉండదగినది ఆమే అనిపించింది. ఆమెని హృదయపూర్వకంగా ప్రేమించాను. నా అనేవారు లేని నేను, వెలివేయబడిన ఆమెని వివాహబంధంతో నాదాన్ని చేసుకున్నాను. ఆ తరువాత సంవత్సరానికి ఆమె తల్లి చనిపోయింది. నీరూ హృదయం అమృత భాండం రాఘవ

బాబూ! ఆమెని ఎంతగా ప్రేమించానో నా క్కొక్కడికే తెలుసు. నా కలలు ఫలించబోయే సమయంలో ఆమె నన్ను ఏకాకినిచేసి వెళ్ళిపోయింది' అతను ఏడుస్తున్నాడు.

శాంతంగా వింటున్న రాఘవబాబు ఒక్కసారి ఉద్రేకంతో చలించిపోయి కానీ నువ్వామెని మానసికంగా చిత్రవధ చేశావు వాసుదేవ్' ఉద్వేగాన్ని అణుచుకుంటూ కఠినంగా అన్నాడు.

'లేదు రాఘవబాబూ! మీకు తెలియదు నేనామెని ఎంతగా ప్రేమించానో! ఆమె ప్రేమంతా నా ఒక్కని కోసమే అవ్వాలి. అందులో ఎవరు పాలుపంచుకున్నా నే సహించలేను. ఆమె ఎవర్ని ప్రేమగా చూసినా నే భరించలేను రాఘవబాబూ; అది ఎటువంటి ప్రేమయినాసరే. ఆమె నా ఒక్కడిదే. ఆమెని ప్రేమపూర్వకంగా శాసించగల మరెవ్వరిని చూసినా నేను ఈర్ష్యతో చచ్చిపోతాను బాబాయ్; నేను భరించలేను' అతను తల ఊపుతూ కళ్ళు మూసుకుని రోదిస్తున్నాడు.

'నువ్వు స్త్రీ హృదయాన్ని అర్థం చేసుకోలేకపోయావు వాసుదేవ్. ఆమెని నీ అవివేకంతో దూరంచేసుకున్నావు. ఆమె తన స్త్రీ సహజమయిన మాతృప్రేమని రాజు మీద చూపించటం నువ్వు ఓర్వలేకపోయావు. ఆమె ప్రేమని పరిధిలో బంధించాలనుకున్నావు. దాని సహజతనునాశనం చెయ్యాలనుకున్నావు ఆ పని చెయ్యలేక ఆమెని మానసికంగా హింసించావు. చిత్రవధ చేశావు. స్త్రీకి అంతకంటె తగలగల ఆఘాతం వేరే వుండదు వాసుదేవ్! ఆమె అభిమానాన్ని చంపుకుని రాజును ఇంట్లోంచి పంపించేసింది. అయినా నువ్వతని రాకపోకలు కూడా సహించలేకపోయావు...నువ్వు వాళ్ళకంటకట్టిన అవమానాన్ని రాజు వింటంతో ఆమె గుండె బ్రద్దలయింది నువ్వామె ప్రేమని అర్థంచేసుకోలేకపోయావు. రాజు ఒకసారి నాతో ఏమన్నాడో తెలుసా వాసుదేవ్ 'జన్మించిన పన్నెండు సంవత్సరాలకి దొరికిన మాతృదేవత వొదిన' అన్నాడు. నువ్వాపసిహృదయాన్ని గాయపరిచావు. నీ అసూయాగ్ని చేత అడుగడుగునా ఆమెని కాల్చిచంపావు వాసుదేవ్ నువ్వు హంతకుడివి.'

రాఘవబాబు బిగ్గరగా అరుస్తు మొహం చేతులతో కప్పుకున్నాడు.

'లేదు రాఘవబాబూ, లేదు. ఆమె నన్ను రెచ్చగొట్టింది. నీకు తెలియదు బాబాయ్ ఆమె తనప్రేమలో ఆఖరికి తనబిడ్డకయినా భాగమివ్వటం నే భరించలేనని ఆమెకి తెల్సుబాబాయ్. అయినా ఆమె వాళ్ళనెందుకు ఆదరించాలి? అది పితృప్రేమగానీ, మాతృప్రేమగానీ, భ్రాతృ

ప్రేమగానీ నే సహించలేనని తెల్సి ఆమె ఎందుకలా చేసింది బాబాయ్?'

అతను కిందపడి దొర్లుతూ వెక్కి-ళ్ళు పెడుతున్నాడు.

రాఘవబాబు విచిత్రంగా అతని వంక చూశాడు. ఎంత పిరికివాడు! తన తప్పు తెలిసికూడా ఒప్పుకోలేని భయస్తుడు. చేసిన అపరాధానికంటె అది అపరాధమని తెల్సినప్పుడు ఆ బరువు వహించలేనంత పెరిగిపోయి అణగద్రొక్కే-స్తోంది

'లేదు వాసుదేవ్. నువ్వు జీవితాన్ని అర్థంచేసుకోలేకపోయావు. అతికి పోయి అసలుకి మోసం తెచ్చుకున్నావు. మానవ సహజమైన ప్రేమ వివిధరూపాల్లో ప్రవహించి సార్థకత చెందినప్పుడే దానికి పరిపూర్ణత. దానిని బంధించటానికి ప్రయత్నించటం అవివేకం. నీ తల్లి నిన్నెంతగా లాలించి ప్రేమించకపోతే నువ్వింత వాడివయ్యావు! ఆ మాతృప్రేమనే నీ భార్య ఒక అనాధబాలునిమీద చూపితే ఎందుకు సహించలేవు? ఒక నిస్సహాయునికి ఆమె సోదరిప్రేమ పంచిఇస్తే నువ్వు ఎందుకు భరించలేవు? తండ్రిగా భావించిన ఒకవృద్ధునిమీది ప్రేమని నువ్వు గౌరవించ లేకపోయావు. నువ్వు వట్టి స్వార్థపరుడివి. అందుకే ఆమె నీకు పసిబిడ్డనికూడా వొప్పగించలేక పోయింది! నువ్వామెకి భౌతికంగా సర్వసౌఖ్యాలు సమకూర్చావు. మానసికంగా మాడ్చి చంపావు. మనిషికి కావల్సింది సుఖసౌఖ్యాలొక్క-టేకాదు వాసుదేవ్! మానసికోన్నతి పొందినప్పుడే మనిషికి శాంతి

గంభీరంగా నిమీలిత నేత్రాలతో చెపుతూన్న రాఘవబాబుని ఆశ్చర్యంగా చూస్తూండి పోయాడు వాసుదేవ్.

*    *    *

'అక్క-గారూ' అనుకుంటూ లోపలికి వచ్చాడు రాము. బయట తలుపుకి తాళం చూసి రాఘవబాబు దగ్గరకొచ్చాడు 'ఏమండీ! ఈభాగంలో వాళ్ళేమయ్యారు? ఆమె కులాసాగా వున్నదా?' అని అడిగాడు ఎన్నిసార్లు చూసినా అతనికింత వరకు రాఘవబాబుతో పరిచయంలేదు

రాఘవబాబు నెమ్మదిగా చెప్పాడు 'లేరు బాబూ. ఆమె ఆడశిశువును ప్రసవించి చనిపోయింది. అతను ఒకరాత్రి పూట చెప్పకుండా ఎటోవెళ్ళిపోయాడు ఆ పసిపాప నా దగ్గరే వుంది బాబూ'

రాము విద్యుద్ఘాతం తిన్నవానిమల్లె రెండు నిముషాలు మ్రాన్పడిపోయాడు తేరుకుని ఎవరినో ధ్యానిస్తున్నట్లు కళ్ళు మూసుకుని ఒక్క-క్షణం నిలబడ్డాడు కళ్ళవెంబడి రెండశ్రుబిందువులు రాలాయి.

తనుతెచ్చిన రెండు కమలాపళ్లు రాఘవబాబు ముందుంచాడు, 'అక్క- మీ గురించి చెప్పింది రాఘవబాబూ. నేను చాలా దౌర్భాగ్యుణ్ణి. ఏ ఒక్క- సోదరినీ

దక్కించుకోలేకపోయాను. ఇంకొక సోదరి ఎక్కడన్నా దొరుకుతుందేమో తిరిగి ప్రయత్నించాలి.' అతను విషాదంగా నవ్వి వెళ్ళిపోయాడు.

'నీరజ చెప్పినట్లు ఇతను చాలా విచిత్రమయిన వాడు' అనుకున్నాడు రాఘవబాబు.

* * *

అంతటితో ఆ పుస్తకంలో రాసిన పేజీలు ఆఖరయిపోయాయి. శారద బరువుగా పుస్తకం మూసి లేచింది.

'తాతయ్యా! ఈ పుస్తకంలోని పసిబిడ్డని నేనేకదూ?' పుస్తకం రాఘవబాబు ఒడిలోవుంచి అడిగింది.

ఆయన ఒక్కక్షణం శారదవంక చూశాడు. తిరిగి పుస్తకాన్ని పరీక్షగా చూసి 'చదివావాతల్లీ' అన్నాడు.

'ఊ'

'అవునమ్మా, వాసుదేవ్ నీ తండ్రి. నీరజ మీ అమ్మ. నేను ఇవాళ నీకా సంగతులన్నీ చెబుదామనుకున్నాను. నా కా భారాన్ని తప్పించావు' ఆయన కళ్లు మూసుకుని చిన్నగా నవ్వుతూ అన్నాడు.

కొద్దిసేపు నిశ్శబ్దం తాండవించింది.

అయితే తరువాత 'ఆయన' సంగతేమీ తెలియలేదా తాతయ్యా' ఆమెకి ఎందుకనో 'ఆయన' బదులుగా 'నాన్న' పదం వాడాలనిపించలేదు

రాఘవబాబుకి అర్ధమయింది ఆమె ఎవర్ని గురించి అడుగుతుందో. 'ఎవరు? వాసుదేవ్ సంగతామ్మా! అదే నేనిందాక చెప్పబోయాను తల్లీ? ఇందాక నే వుత్తరం వచ్చింది. వాసుదేవ్ రేపు వస్తున్నాట్టమ్మా! పదహారు సంవత్సరాల తరువాత అతనికబురు నాకివాళే తెలిసింది తల్లీ!'

శారద నిశ్శబ్దంగా లోనికి వెళ్ళిపోయింది.

* * *

'ఆ అర్ధరాత్రి పారిపోయిన తరువాత ఎన్నిచోట్ల తిరిగానో నాకే తెలియదు రాఘవబాబూ. చివరికి రంగూన్ చేరుకున్నాను. చేతిలో మిగిలిన డబ్బుతో వ్యాపారం మొదలు పెట్టాను. భగవంతుడి దయవలన వ్యాపారం అభివృద్ధిలోకి వచ్చింది. ఎప్పటికప్పుడు మీకు నా ఉనికి తెలియజేస్తూ వివరాలు రాయాలనిపించేది. కానీ అంత పిరికిగా పారిపోయిన నన్ను గురించి మీరెలా భావిస్తున్నారో అని సిగ్గుపడిపోయే వాడిని. కొన్ని సంవత్సరాలు ఒక మిత్రునిద్వారా మీ క్షేమ సమాచారాలు తెలుస్తూనే వున్నాయి. ఆ తరువాత అవికూడా తెలియక పోయాయి. నాకు రావటానికి ఇప్పటికి వీలయింది రాఘవబాబూ'.

వాసుదేవ్‌లో ఏదో పెద్ద మార్పు వస్తుందనుకున్న రాఘవబాబుకి నిరాశే

కలిగింది. విరాగిలా ప్రశాంతంగా ఉన్న ఒక నిరాడంబరపురుషుడుగా వూహించాడు తను తిరిగి పదహారు సంవత్సరాల తరువాత కలుసుకోబోతున్న వాసుదేవ్‌ని. సిరిసంపదలకి ఆలవాలమయిన వేష భూషణాదులతో, వయసుతెచ్చిన మార్పు తప్ప వేరే ఏమీ గమనించలేక పోయాడు రాఘవబాబు అతనిలో ప్రత్యక్షంగా.

శారదలో అతన్ని చూడగానే ఒక్కక్షణం అలజడి కలిగిన మాట నిజమే. కానీ ఆతరువాతకూడా ఆమెలో తన తండ్రిపట్ల వుండవలసిన పితృభావంకానీ, గౌరవ ప్రేమలుగానీ కలగనట్లే అనిపించింది. రక్తసంబంధం ఏ మూలో అణుమాత్రంగా మొలకెత్తించిన పితృభావంకూడా పైకి ఎదగలేక పోయింది. ఆ రోజంతా ఆమె నిర్లిప్తంగా వుండిపోయింది. తను చూడలేని తన మాతృరూపం ఆయన పక్కన వూహించగానే ఆమెగుండె కలుక్కు మంటోంది.

'మీ ఋణం ఎలా తీర్చుకోవాలో తెలియదు రాఘవబాబూ. ఇన్ని సంవత్సరాలు శారదని తలిదండ్రులు లేనిలోటు కనిపించకుండా పెంచారు. ఇప్పుడు మీకు అభ్యంతరంలేకపోతే ఆమెని తీసుకువెళ్ళి మనస్థితి గతులకు సమానమయి సంబంధంచూసి పెండ్లిచేసి ఆమెకి సుఖమయిన గృహస్థ జీవితం కల్పించాలని నా ఆశయం' చెప్పటం ఆపాడు వాసుదేవ్.

రాఘవబాబు గుండె ఒక్కసారి ఆగి మళ్ళీ కొట్టుకోవటం మొదలుపెట్టింది. ఆయన సమాధానం ఇవ్వకుండా కళ్ళు మూసుకుని పడకకుర్చీలో పడుకుని ఉన్నాడు. జీవితం ఎంత విచిత్రమయింది! తనకి ఏమీకాని ఆమె తనపాప భారం వహించమని తన్నర్థించింది. భీరువుకి మల్లే పసిబిడ్డభారం వదిలేసి పారిపోయాడు అతను. కన్నబిడ్డ కన్న మిన్నగా ప్రేమించి పెంచాడు తను. పదహారుసంవత్సరాల తరువాత తిరిగి వచ్చి తనబిడ్డని తీసుకువెడతానంటున్నాడు. తను కాదనగలడా? ఆ అధికారం తనకుందా? పెంచినంతలో తనకాహక్కు వస్తుందా? తండ్రిగా అతని బాధ్యతని కాదనగలడా? ఇన్ని సంవత్సరాలు ఈ బాధ్యత ఏమయిందని నిలవెయ్యగలడా? అయినా అతనితో తనకనవసరం? శారద తనప్రాణం. ప్రాణం వెళ్ళిపోతే తను బ్రతగ్గలడా! ఈవృద్ధదశలో కంటిదీపంలా వెలుగుతున్న శారద లేకపోతే ఆచీకటిలో తనేమైపోతాడు? లేదు, శారదని తను వదల్లేడు అంతే. వివేకం హెచ్చరిస్తోంది. తను వట్టి స్వార్థపూరితుడా? తను సామాన్య సంసారి. అతను? లక్షాధికారి. తనబిడ్డకి కోటీశ్వరునిచ్చి చెయ్యగలవాడు. శారద రాజభోగాల్లోవిహరిస్తుంది.

తను ? తనతోవుంటే ఒక సామాన్య సంసారిణి అవుతుంది. అతి సామాన్య మయిన గృహిణి అవుతుంది అటువం టప్పుడు తనామె సుఖానికి అడ్డుతగుల్తు న్నాడా ? ఆమె సౌభాగ్యాన్ని నిరోధిస్తు న్నాడు. లేదు, లేదు. ఆమె తండ్రితో వెళ్ళి పోవటమే తనకోరిక. తను పెంచిన ప్రేమని వదులుకోలేడు. అయినా అది తప్పనిసరి. ఋణానుబంధం అనుకొని సరిపెట్టుకోవాలి. శారద వెళ్ళిపోవాలి'

ఆలోచనలతో వేగిపోతున్న రాఘవ బాబు కళ్ళమ్మట అశ్రుప్రవాహం ధారకడు తోంది. తెప్పరిల్లుకొని అతిసామాన్యంగా అన్నాడు;

'వాసుదేవ్ ! ఆమె కిష్టమయితే తీసుకు వెళ్ళు'.

తండ్రి, తాతల సంభాషణ శారద లోప ల్నించి వింటూనేవుంది. ఆమెతల ఆలో చనలతో పగిలిపోతోంది. తనిప్పుడు తండ్రితో వెళ్ళిపోవాలా ? తాతయ్యతో వుండిపోవాలా ? తనా వృద్ధుని వదిలి వెళ్ళగలదా ? ఆయన ప్రేమని, ఆప్యాయ తని, ఆదరణని మరిచి తను వెళ్ళిపోవా ల్సిందేనా ? ఇన్ని సంవత్సరాలు తనేమై పోయిందో అవసరంలేని తండ్రికి తన సుఖమిప్పుడు కావల్సివచ్చిందా ? తనా వృద్ధుని నిరాశ్రయునిగా వదిలి వెళ్ళి పోతుందా ? లేదు లేదు. తనంత కృతఘ్ను రాలు కాదు. తను వెళ్ళలేదు. ఆమెలో అంతర్గతంగా నాటుకున్న క్రోధం పైకు బికింది. అయినా తన్నంతకాలం పెంచి నందుకు దనతండ్రి ఆవృద్ధునికి కృతజ్ఞత తెలుపుకో గలిగాడుగానీ, తనతోపాటుగా ఆ నిస్సహాయవృద్ధుని కూడా రక్షించే భారంవహించగలిగే విశాలహృదయం లేదా ? ఆయనని గూడా రమ్మని ఆహ్వానించలేనంత స్వార్థపరుడా తనతండ్రి ? తండ్రి గలిగిన అనాధ శిశు వుని కంటిరెప్పలా కాపాడిన వృద్ధునికి చూపగలిగే కృతజ్ఞత ఇదేనా ? ఏమైనా తను వెళ్ళలేదు. శారద దృఢనిశ్చయ అయింది.

వాసుదేవ్ అంటున్నాడు, 'మీరే శారదని ఒప్పించండి రాఘవబాబూ' రాఘవబాబు మౌనంగా వుండిపోయాడు.

*　　*　　*

రాఘవబాబు అతికష్టంమీద శారదని తండ్రితో వెళ్ళటానికి అంగీకరింప జేయగలిగాడు. ఆ రాత్రంతా ఇద్దరూ మౌనంగా రోదిస్తూగడిపేశారు ఆసంగతి ఇద్దరికీ తెలుసు. అయినా ఒకరినొకరు ప్రశ్నించగల ధైర్యం ఒక్కళ్ళకీలేదు. నోరు కదిపితే అశ్రువులు కట్టలు తెంచు కుంటున్నాయి. పదహారు సంవత్సరాల నించీ వున్న బందం నేటితో ఆఖరవు తుందా ? సూటిగా ఒకరినొకరు ధైర్యంగా చూడలేక పోతున్నారు. పసిహృదయం,

ముసలిమనసు మూగగా వేదన చెందు తున్నాయి.

తెల్లవారింది, శారద వెళ్ళబోయే సమయమొచ్చింది, వాకిటిలో బండి నిల బడి వుంది. వాసుదేవ్ పెట్టె బెడ్డింగు బండీలో పెట్టాడు. శారద తాతయ్యా దగ్గరకొచ్చింది శలవుతీసుకోటానికి. ఆమె నోటివెంబడి మాట రావటంలేదు. నిశ్శబ్దంగా వంగి రాఘవబాబు పాదాలకి నమస్కరించింది. వెచ్చని రెండు నీటి బిందువులు ఆయన పాదాల నభిషే కించాయి. ఆయన వొంగి ఆమెని పైకి తీసుకుని తన హృదయంమీద తల ఆన్చుకున్నాడు. వృద్ధుని హృదయం విరక్తితో భావరహితంగా వుంది.

'ఇది ఋణానుబంధం తల్లీ. సుఖంగావుండు'

శారద మౌనంగా ముందుకు నడి చింది. బండిపట్టుకు నిలబడింది. ఆమె కళ్ళముందు అస్పష్టంగా ఒక దృశ్యం కదుల్తోంది. చూపు మందగించిన రాఘవ బాబు సందెచీకటిలో దీపం వెలిగించ టానికి అగ్గిపెట్టెకోసం వెతుకుతూ ముందుకు తూలి. దేనికో తగిలి పడి పోయాడు. నిస్సహాయంగా చేతులెత్తి అదృశ్యరూపుడైన పరమాత్మని ప్రార్థి స్తున్నాడు నాటకసమాప్తి కొరకు.

ఆమెమనసు ఏదో నిశ్చయించుకుని నిశ్చలమయింది. ఆ దీపం వెలిగించాల్సిన బాధ్యత తనది. ఏ బంధంకొరకు తను పెంచబడిందో దానిని నిర్వర్తించటం తన కర్తవ్యం; అది మానవధర్మం.

శారద పరుగునవెళ్ళి రాఘవబాబుని కౌగిలించుకుంది. 'నిన్ను వదిలి వెళ్ళను తాతయ్యా' ఆమె కంఠంలో స్థిరత్వం ధ్వనించింది. దాన్నెవరూ మార్చలేరు.

రాఘవబాబు ముడుతలుపడిన చెక్కిళ్ళ మీంచి అశ్రువులు జాలువారాయి. ఆమె శిరసును గాఢంగా ముద్దుపెట్టుకున్నాడు.

వాసుదేవ్ ఆశ్చర్యంగా చూస్తూ నుంచుండిపోయాడు !





అడవి బాపిరాజుగారి స్వప్నమూర్తి సౌందర్యావధియైన 'శశికళ' ఒక రకంగా ఈ కవి కేవిప ఇష్టదేవత. భావకవుల్లో ఏరి సింతులందరికీ ఇష్ట దేవత లున్నారనీ. ఎన బ్రతుకుతో ప్రతికళికి వలపించే చతుర 'శశికళ' యని బాపిరాజుగారు వ్రాసుకున్నారు 'ఎండిమియాన్' అనే శీర్షికతో వారు వ్రాసిన గేయంలో శశికళా ప్రాదు ర్భావ వృత్తాంత ంది ఏను గురు వైన కూర్డేగారితో బాపిరాజుగారు తీర్థయాత్రలు చేస్తూవుండగా ఒక ఘటన ం జరిగింది నదిలోయలో, వెన్నెల్లో, బండమీద నేను వాల్చి నిదురపోయే బాపిరాజుగారిపై ఒకా నొక వెన్నెల వెలుగో, అప్సరసో వాలింది. దానినే కొన్నాళ్ళతర్వాత కూర్డేగారు చిత్రంగా రచించి 'ఎండి మియాన్' అని పేరు పెట్టారు. ఎండి మియాన్ అనేవాడు గ్రీకుదేశపు గోపబాలుడు; అతిలోకసుందరుడు అతడు ఒంటరిగా నిద్రిస్తున్నప్పుడు ఒకానొక అప్సరస అతణ్ని వలచివచ్చి అతనిమీద వాలించట. ఈ కథను కీట్సు మున్నగు కాల్పనిక కవులు కావ్యరూపంలో చిత్రించారు. బాపి రాజుగారికి జరిగిన సంఘటన ఈ వృత్తాంతాన్ని పోలివుంది కలలో తనమీద వాలిన ఆ దివ్యసుందరికి, ఆ అపూర్వ సౌందర్యరేఖకు, బాపిరాజు గారు 'శశికళ' అని పేరు పెట్టు కున్నారు. ఆవిడకోసం ఒక చిన్ని లోకాన్ని సృష్టించుకున్నారు.

'చంద్రలోకం తూర్పు దెసలో
సూర్యలోకం పశ్చిమంలో
చిన్నిలోకం ఒకటీ ఉన్నాదే
ఓనా వెన్నెల చిన్నారి పడుచా
ఆలోకమేలే,
కన్నె రాణివి నువ్వే నువ్వేనే'

అని ఒక అలోక లోకంలో పూజా పీఠం అమర్చి ఆవిడ వాసీనురాలిని చేసి, పట్టంకట్టి.'నా అమృతమూర్తివి, ఆత్మమధ్యవు నీవే' అని గానం చేశారు.

బాపిరాజుగారు సృష్టించిన శశికళ అలౌకిక గంధమలదుకున్న అలకా నగరసుందరియేకాని నిత్యజీవితంలో తారసిల్లిన తరుణికాదు. ఆవిడ అతనికి ప్రియురాలు మాత్రమే కాదు; 'గురువు', 'శిష్యురాలు'. ఆవిడే సూర్యలత, చంద్రబాల, గాన శిల్ప చిత్రాది కళామూర్తి, 'నగలలంక రించని కల'. ఆవిడే అతని 'బాణి' 'వాణి', 'రాణి'. స్వప్నంలో తళుక్కు మని ఆవిడ మాయమైపోయినతర్వాత ఆమెకోసం అతడు కొండలూ, కోనలూ గాలించాడు. సర్వ రసానందాలకు నిలయమైన దేవళం నిర్మించుకొని ఆవిడకోసం ఎదురుతెన్నులుచూశాడు.

ఆమె అతనికి మళ్ళీ సాక్షాత్కరించ లేదు. అతని బ్రతుకే ఒక అన్వేషణమై పోయింది. ఆపిడకూ తనకూ నడుమ వున్న భౌతిక రూపబంధాలను తెరగా భావించుకొని,

'ధవళమైనదీ తలపు దాటినది
దానికి మొదలూ చివరా లేనిది
నీకు ఇవతల—నాకు అవతల
తెర ఉన్నాది బాలా'

అని బాధపడ్డాడు. క్రమంగా ఆత్మ సాయుజ్యం పొంది లోకమంతటా ఆమె దివ్యలీలనే సందర్శించాడు

'కాలాన్ని కట్టేసి కాలికిందను రాతు
నాలోన నీవు నిత్యయౌవనవూ'

అంటూ కాలతీతుడై తుష్టాంతరంగు డయ్యాడు. ఆమె గాంధర్వ 'గ్రీవ గంగోత్తరీ పావనోద్భూత మందాకినీ స్వచ్ఛమై' విరియగా ఆనందపర వశుడై భగీరథత్వం వహించాడు 'అమృతాప్లావితనూ కమనీయ మూర్తి'యై 'నిత్యావిద్యా హృదయ మృత్యుంజయు'డైనాడు. పర్యవసానంగా ప్రణవస్వరూపిణియైన తన భావనా దేవిని తనలో పొదుగు కున్నాడు. ఆ క్షణంలో 'ఏనధికల శాంబుధి'యైనది; 'జను లెల్ల దేవు' లైనారు.

ఈ విధంగా బాపిరాజుగారు స్వప్నంలో దర్శించిన దివ్య సౌందర్యానికే రూపకల్పన చేసుకొని ఆమెతో సంయోగ వియోగాలను భవించి సమస్త కళాప్రసూనాలతో ఆమెనారాధించి తాదాత్మ్యసిద్ధిని పొందారు. "అతని ఆత్మయందలి సౌందర్య బోధమే శశికళ. ఆమెనారాధిస్తూ తన బ్రతుకును, లోకాన్ని సౌందర్యంతో నింపాలనేదే అతని జీవితాశయం" అన్న కాటూరి వారి అభిప్రాయం ప్రత్యక్షర సత్యం

## వత్సల :

నాయని సుబ్బారావుగారి 'సౌభద్రుని ప్రణయయాత్ర'లో నాయిక పేరు వత్సల ఈ కావ్యంలో ప్రధాన స్థానం సౌభద్రునిదే. వత్సల అక్కడక్కడ రేఖా సదృశంగా స్ఫురిస్తూ వుంటుంది అయినా ప్రణయచిత్రణకు అందెవేసిన చేతుల్లో నాయని వారు గణనీయులైన భావకవులు కాబట్టి వారి వత్సలనుగూర్చి సంగ్రహంగానైనా సరే వ్రాయడం సముచిత మనుకుంటున్నాను

నాయనివారి వత్సల అందరుకవుల ప్రేయసుల వంటిదికాదు. ఆవిడ అతని మేనత్త కూతురు అభిమన్యుడూ. అతని మేనమామకూతురు శశిరేఖ (వత్సల) పరస్పరం గాఢంగా ప్రేమించుకున్నారు. అభిమన్యుడు

రాజ్యభ్రష్టులై అడవుల్లో నివసించే పాండవేయులకు సంబంధించినవాడు కాబట్టి అతనికి తనకూతురు నివ్వడానికి బలరాముడు నిరాకరిస్తాడు పైగా ఐశ్వర్యవంతుడూ, సమ్రాట్టూ అయిన దుర్యోధనుడి కొడుక్కివ్వడానికి సంకల్పిస్తాడు. వత్సలాభిమన్యుల్లాగే ఈ కావ్యంలోని నాయిక వత్సలా, కవిగారూ ప్రేమించుకుంటారు. వారి చిన్ననాటనే అమ్మాయితండ్రి కవిగారి తల్లిగారికి వాగ్దానం చేస్తారు. ఏమని ? తప్పకుండా తన కూతుర్ని అతనికిచ్చి పెళ్ళిచేస్తానని. కాని కొంతకాలానికి తన అభిప్రాయం మార్చుకుంటారు. ఈ విషయాన్ని నాయనివారు నాయిక ముఖతః ఇలా అనిపించారు,

'చెప్పె నత్తమ్మచేతిలో చేయివైచి
నీ కుమారుని కిచ్చెద నా కుమార్తె
ననుచు మును నాన్న, నేడు పేరాస దగిలి
తోసిరాజనె చేసిన బాసలన్ని.'

వత్సలకూ కవిగారికీ దినదినం ప్రేమానుబంధం దృఢపడింది. బిచ్చమెత్తుకొని జీవిస్తూ వల్లకాటిలో నివసించే శివుణ్ని వరించిన పార్వతిలాగా తాను తనబావను పరిణయమాడడానికి ఉద్యుక్తురాలయింది కఠినవృక్షాన్ని కౌగలించుకొని ప్రాకిపోయే జాజితీగలాగా తనప్రియునితో పెనుగొనడానికి నిశ్చయించింది. కవి అన్నట్లుగా వత్సల 'వలపు బావిలో తెన్నినిలువులోతు' కొలవడం కష్టం. చిన్ననాటినుంచి అతణ్ని 'బావ' 'బావ' అని పిలుస్తూ అనురాగం చిలకరించింది. ఆ విధంగా అన్యోన్యంగా ప్రేమించుకున్న ఆ యిరువురి నగుమ కాలం కత్తులు నాటగా కవికి రక్తాశ్రువులు రగిలినవి. 'సౌభద్రుని ప్రణయయాత్ర'లో ఈ నిర్వేదమే అచ్చుగుద్దినట్లు కనిపిస్తుంది. ఈ కావ్యం చివర 'ఫలశ్రుతి' అనే ఖండికలో వీరివివాహానంతరసంయోగ శృంగారం ఎంతో సభ్యంగా చిత్రింపబడింది.

ఈ కావ్యంలోని ప్రత్యేకత 'మేన' సంబంధమున్న యువతీ యువకుల పరస్పర ప్రేమ. ఇంగ్లీషు కవుల్లో ఈ విధంగా ప్రణయం జరిపిన వారులేరు. వారి సాంఘిక వ్యవస్థలో ఈ వెసులుబాటు గూడా లేదనుకోండి. నాయని వారి ఈ కావ్యంలో ప్రణయం భగ్నరూపంలో కాకుండా వివాహ

రూపంలో ఫలశ్రుతినందడం మరో ప్రత్యేకత. ప్రేమించి పెళ్ళాడిన వారి దాంపత్యంలోని మాధుర్యం అనితర మైంది. దానిని ఈ కవిగారు రసమహితంగా చిత్రించారు. పేరున కిది సౌభద్రుని ప్రణయయాత్రయైనా దీంట్లోని సౌభద్రుడు నాయనివారే. వత్సల వారి ప్రేయసి; ధర్మపత్ని. పురాణ గాధలోని వత్సలాభిమన్యుల వరాలవలపును నవీన రూపంలో అందించిన భావకవిమణి శ్రీ నాయని.

'భావకవిత్వంలో శృంగార నాయికలు' అనే శీర్షిక క్రింద ఇంత వరకు ఊర్వశి, ఎంకి, కిన్నెరసాని, శశికళ, వత్సల అనే నాయికల గురించి చర్చించాను. భావకవిత్వంలో చెప్పుకోదగ్గ శృంగార నాయికలు వీరే. అధికార్ల సూర్యనారాయణగారి 'జానకి' వంటి నాయికలు కొందరున్నా కవితారంగంలో వారికి ప్రత్యేక పీఠం ఏర్పడలేదు. ఇంతకూ భావ కవుల్లో ప్రణయకవితాసృష్టి చేసిన వారిలో ప్రముఖులైన తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రిగారి మాటేమిటి? వారి 'హృదయేశ్వరి'లోని నాయిక సంగతేమిటి? 'హృదయేశ్వరి'లోని నాయిక పేరు స్పష్టంగా చెప్పబడ లేదు. నాయికా నిర్దేశం జరగనిదే ఆవిడను గురించి వివరంగా వ్రాయడం సమంజసం కాదు. కవి తానొక సుందరీమణిని ప్రేమించడం, ఆమెను వివాహమాడడానికి నిశ్చయించడం, మొదట ఆమె అందుకంగీకరించడం, పరిస్థితుల ఒత్తిడివల్ల తరువాత ఆవిడే నిరాకరించడం, కవి విరహాకాతరుడు కావడం-హృదయేశ్వరి కావ్యంలోని వస్తువిది.

ఈ కావ్యంలో నాయిక పేరు ఇద మిత్థమని చెప్పకున్నా ఆవిడ నిత్య జీవితానికి సంబంధించిన కొన్ని విశేషాలు సూచింపబడినవి. ఆమె యింటిముందట పొగడ చెట్టుందని, ఆవిడ 'శ్రీ రామ చరితమానసం' పఠిస్తుందని, అప్పుడప్పుడు నృసింహాల యానికి వెళుతుంటుందని, ఒక్కొక్కప్పుడు 'కపిశవర్ణ మనోజ్ఞాంశు కమ్ముదాల్చి,' జారుముడితో అంగ ణంలో తిరుగుతుంటుందని, ఆవిడకు హిందూస్తానీ సంస్కృత భాషలు ఇష్టమనీ, ఈ కావ్యపరిశీలనం వల్ల స్పష్టమయ్యే అంశాలు. ఈ కావ్యంలో ఆవిడ యింటిముందున్న పొగడ చెట్టు

మాటిమాటికి వర్ణింపబడింది. ఇది బైరను కవి ప్రభావమనుకుంటాను. బైరను ప్రేయసి 'మేరీ'. ఈవిడ బైరను కవిని కాదని మరొకర్ని పెండ్లి చేసుకుని కాపురం చేస్తుంటుంది. బైరను విరహతాపం భరించలేక ఆవిడ యింటిముందున్న చెట్లను The Dream' అనే గేయంలో పదే పదే వర్ణించాడు. శివశంకరశాస్త్రి గారి వకుళ తరు వర్ణన బైరను వర్ణనను స్ఫురింప జేస్తుంది. ఇరువురి ప్రణయమూ అసంపూర్తమే కావడం దీంట్లోవున్న చమత్కారం. శాస్త్రి గారి 'వకుళమాలిక' అనే కావ్యం 'హృదయేశ్వరి'కి అనుబంధమనిపిస్తుంది. ఇది 'గీతికా స్వాగతము.' దీంట్లో నాయికా నాయకులు 'ఇందిరా మాధవులు.' హృదయేశ్వరిలోని నాయికే దీంట్లో 'ఇందిర' గా రూపొందిన ట్లనిపిస్తుంది. కవియే మాధవుడైనాడు. ప్రథమదశలో స్నిగ్ధరమ్యమైన నాయికా ప్రేమ, పరిస్థితుల అవరోధంతో కుంఠితమై, క్రమంగా ప్రియనిరాసకమై పోయిన ఉదంతం ఈ కావ్యంలో హృదయంగమంగా చిత్రింపబడింది. ★



మా నాగాయి వాళ్ల నాటకబృందం రైలు దిగేటప్పటికి సాయంత్రం నాలుగు గంటలయింది నాగాయి లాయరు పరీక్ష ప్యాసయి వూళ్లో బోర్డు తగిలించినా నాటకాలమీద వ్యామోహం వదల్లేక ఒక ఎమెచ్యూర్స్ కంపెనీ సిద్ధంచేశాడు వాడితండ్రి నాటకాల్లో తిరిగి కొంత పేరు తెచ్చుకున్న మాట నిజమే కాని అందువల్లనే ఆయన పిత్రార్జితం కూడా దాదాపు హరించుకుపోయింది నాగాయికి చిన్నప్పటినుంచే నాటకాల పిచ్చి వుండటంచూసి పుట్టుకతోనే వాడికి నాటకాల రక్తం వచ్చిందని గ్రహించి వాడి జీవితం నాటకీకరణం కాకుండా పట్టుబట్టి వాడిని లాయరు చేశాడు తండ్రి

అదేం తమాషో మనవాళ్ళు తమ జీవితంలో ఒకటి ప్రారంభించి కొడుకులకు ఇంకో దారిచూపుతారు తండ్రి వ్యవసాయంచేస్తే కొడుకు ప్లీడరు మనవడు వ్యాపారం అండ్రి వ్యాపారంచేస్తే కొడుకు మేస్టరు మనవడు డాక్టరు అలా మారుతూ వస్తున్నాయి జీవితాలు చిత్రం ఏ వృత్తుల్లో వాళ్ళకు తమ వృత్తులకన్న ఇతర వృత్తులే ఆకర్షణీయంగా లాభకరంగా వుంటాయి ఎప్పుడూ। దీనికి కారణం బహుశా ఒకప్పటి వృత్తులే తర్వాత కులాలుగా మారిపోవటం ఎక్కువ తక్కువలు ఏర్పడటం కావచ్చు కాని ఇప్పుడు ఒక



# కూతురు

కొడవటిగంటి కృష్ణమూర్తి



కులంవాళ్ళు ఏ ఇతర వృత్తి అవలం బించినా కులంమటుకు మారదు! పెద్ద కులాలవాళ్లు నీచవృత్తి చేసినా ఫర్వా లేదు కాని తక్కువ కులాలవాళ్ళు గొప్ప పన్లుచేసినా, యోగ్యులైనా ఫర్వా వుంటుంది కామాలు!

ఎమెచ్యూర్స్ కంపెనీ ప్రారంభించ టానికి నాగాయి చాలా అవస్థపడ్డాడు. సినిమా యుగం వచ్చింతర్వాత నాటకాల స్థితి దిగనాసి పోయింది. నాటకాలతో దీపాలార్పుకున్నవాళ్ళు కొల్లలుగా వుండటం కూడా ఓ పెద్ద చిక్కయింది. అందుకని నాటకాలాడటమే జీవనో పాధి, వృత్తి కారాదని నాగాయి ప్రచారం చేశాడు వూళ్ళో. ఉబలాటంగా వున్న వాళ్ళకు నాటకాలవల్ల నష్టమేమీ లేకుండా వుంటే చాలదా అని ప్రశ్నించాడు. ఇన్ని సినిమాలున్నా నాటకాలు చూడటానికి ఎంతో మోజుపడే ఎంతో మంది గతి ఏమిటి అని ప్రశ్నించాడు. మన నాటక కళకు తిలోదకాలు ఇచ్చేసినట్టేనా అని సవాలు చేశాడు. నాటకాలాడటంవల్ల ఏవిధమైన ఇబ్బంది కలగకుండాను, నాటకాలాడే వారిని ఎవ్వరూ 'చిన్న చూపు' చూడకుండాను మార్గంకూడా సూచించాడు. నాటకాల తహతహ ఇగిరి పోతున్న కొందరికి రైలు పూర్తిగా ఆగిపోయినట్లయింది. ఎమెచ్యూర్స్ కంపెనీ అవతరించింది!

నాటకబృందం ఏర్పడటానికి మొదట్లో చాలా పేచీలు వచ్చాయి. నాగాయి పెట్టుబడి పెడతానన్నాడు. లాభంవస్తే నాటక బృందం అభివృద్ధికి వినియోగించాలి. నష్టం వస్తే అది నాగా యిది. నాగాయి అన్నిటికీ సంసిద్ధం కావటం చూసి మొదట్లో వాడిని నమ్మని వాళ్ళు ముందుకు వచ్చారు. అంతా దాదాపుగా సమానవాటాలు వేసుకుని నాటక సమాజానికి నాంది పలికించారు. నాటక బృందంలో మేష్టర్లు వున్నారు, గుమాస్తాలు వున్నారు, లాయర్లు వున్నారు. ఎవ్వరూ నాటకాలమీద ఆధార పడినవాళ్ళుకాదు. అందరికీ నాటకాలంటే అమితసరదా. నాటకాల్లో పాల్గొని బాముకునే దేమీ లేకపోయినా అందరికీ ఏదో ఆత్మసంతృప్తి!

ప్రారంభించిన వేళావిశేష మంటాడు నాగాయి, కాదు ప్రారంభించిన పద్ధతి అంటారు కొందరు. ఏమయినా నాగాయి బృందం లాభ నష్టాలు లేకుండా సాగి పోయింది. వాళ్ళ ఉత్సాహం చిలవలూ, పలవలూ వేసింది. అందరికీ ఏవో వృత్తు లుండటంవల్ల సెలవరోజుల్లో తప్ప నాటకాలాడ్డానికి వీలుకాలేదు. అందు చేత మొదట్లో స్వంతవూళ్లోను, తర్వాత చుట్టుపక్కల పల్లెటూళ్ళలోను ప్రదర్శిం చారు. నాటకశాల లన్నీ సినిమాహాలు లయిపోవటంవల్ల పీలైన సావిళ్ళలో,

తాత్కాలికంగా తయారుచేసిన ఎండిళ్లలో స్కూళ్ళహాలుల్లో ప్రదర్శనలు కొనసాగించారు

కొంత అనుభవం అయింతర్వాత నాగాయి ఓ కవికుమారుడిలాంటి వాడిని దువ్వి, ఓ నాటకం తయారు చేయించాడు భావాలన్నీ నాగాయి వయినా పేరు కవికుమారుడిది నాటకాన్ని చక్కగా తర్ఫీదు చేయించాడు నాటకాన్ని నిర్విఘ్నంగా, జయప్రదంగా ప్రదర్శించటమే ప్రధానోద్దేశ్యమని ప్రతిసారీ జ్ఞాపకం చేసుకురావటంతో నాటకకళాకారుల మధ్య సహజంగా పైకి వుబికే తగాదాలు, వ్యక్తిత్వాలు, పేచీలు తగ్గించుకోగలిగారు ప్రదర్శన సమయంలో ఒకరిని మించాలని మరిఒకరు పోటీపడటం కాక ఆయా పాత్రధారుల ప్రతిభ, నాటకంలో భావాలు బైటపడేటట్టు సహకరించుకోవటం అతి ముఖ్యమని, నాగాయి తనబృందంవారికి నూరిపోశాడు ఓ నాటక పోటీలో పాల్గొంటే వారి ఉడతాభక్తికి ప్రతిఫలంగా మొదటిబహుమతి వచ్చింది నాగాయి బృందానికి ప్రోత్సాహమియ్యటానికి ఇప్పు డీ వూరివాళ్ళే వాళ్ళ నాహ్వానించారు ·

సామానులు వగైరాతో కొందరు పొద్దునే వచ్చేశారు ఇప్పుడు మిగిలిన వాళ్ళు, నాగాయి వచ్చారు వారికి స్వాగతమియ్యటానికి వచ్చిన శ్రేయోభిలాషులవద్ద సెలవుతీసుకుని నాగాయి కొందర్ని హాలువద్దకు, మరికొందర్ని బసకు పంపి తను వెంకమ్మ హోటలుకు బైలుదేరాడు.

ఎప్పటి వెంకమ్మ హోటలు — ఎప్పటి కథ · — ఎనిమిదేళ్ళ క్రిందట నాగాయి ఈ వూళ్ళో కాలేజీలో చదివే నాటి సంగతి అప్పటికి నాగాయి వూళ్లో స్కూలు కాలేజీ కాలేదు అందుకని నాగాయి కాలేజీ చదువుకోసం ఈ వూరు వచ్చాడు ఆ హోటలుకూ, ఈ హోటలుకూ తిరిగి చివరకు వెంకమ్మ హోటలు కనిపించాకగా వాడు మరెక్కడికీ పోక బి ఏ. వరకూ నాలుగేళ్ళ చదువూ పూర్తి చేసింది· వెంకమ్మగారు మెరుగులు, నగిషీలుపెట్టని బంగారంలాంటిది చాలా ఘనకార్యాలు చెయ్యవలసిన వ్యక్తి, ఆడది అయిపోయింది గాని —

వెంకమ్మతండ్రికి వరసగా ముగ్గురు ఆడపిల్లలుపుట్టి ఆయనకు జీవితంలో చాలా నిరుత్సాహం కలిగించారు. అసలే గర్భదరిద్రుడు ఇక ఆడపిల్లలకు కట్నాలూ కానుకలూపోసి పెళ్ళిళ్ళు కూడా ఎక్కడ చేయించగలడు? కట్నం తీసుకోకుండా ఆడపిల్లని పెళ్ళి చేసుకోవాలనే తెలివితక్కువవా ళ్ళుంటారా ఎక్కడైనా? ఒకవేళ వున్నా వాళ్ళొట్టి మూఢులని తేలుస్తుంది ఆధునికనాగరికత ; అలాంటి మూఢత్వానికి కూడా అంగీక

రించే మొగవాళ్ళున్నా కూతుళ్ళకు పెళ్ళిళ్ళు చేయించే స్తోమతే లేదు వెంకమ్మ తండ్రికి. మూడోసారి ఆడపిల్ల కలిగేటప్పటికి వెంకమ్మ తండ్రికి ఒక చెంప పిల్లలంటే మొహం మొత్తింది - మరో చెంప మగపిల్లవాడు లేడే అనే విచారం ఎక్కువైంది ! ఆడపిల్లలు తల్లిదండ్రులకు అన్నివిధాలా ఖర్చు కలిగించి, చివరకు మరోగడపతొక్కి ఇంటిపేరు కూడా మార్చుకుంటారు. మొగపిల్లవాడయితే వంశోద్ధారకు డవుతాడు. మరి తద్దినాలు పెడతాడు. ఒకవేళ పెట్టకపోయినా పెద్దవాడయి ఏదోకొంత సంపాదించి వృద్ధాప్యంలో తల్లిదండ్రులను ఎంతోంత పోషిస్తాడు. కనీసం ఆ ఆశ ఆయినా వుంటుంది ! అందుకనే కామాలు ఆస్తి లేనివాళ్ళయినా మొగపిల్లవాడినే పెంచుకుంటారు. కాని ఆస్తి వున్నా లేకపోయినా తాము పెంచుకున్న పరాయివాడు నిజంగా తమ వంశోద్ధారకుడు ఎలా అవుతాడు ? కనక పెంచుకోవటం వృద్ధాప్యంలో ఆదుకోటానికే కావాలి !

పుట్టిన పిల్లల్ని ఎలా పోషించటమూ అని నానా అగచాట్లు పడుతుండగా వెంకమ్మ తల్లి మళ్ళీ గర్భవతి అయింది. ఈసారైనా మగపిల్లవాడు పుట్టడా అన్న ఆశ, మరో ఆడపిల్ల పుడితే గతేమిటి అన్నభయం మధ్య వెంకమ్మ తండ్రి హూనం అయినాడు. తన జాతకమూ, భార్య జాతకమూ తిరగేయించాడు - బోర్ల వేయించాడుకూడా ! కాని ఫలానా పిల్లఅని ఎవ్వరూ కచ్చితంగా చెప్పలేకపోయారు. ఒకవేళ కచ్చితంగా ఆడపిల్ల పుడుతుందని ఎవరేనా చెప్పితే ఆయన ఏంచేశేవాడో చెప్పలేం ! అసలే సరైన పోషణలేక కాన్పులమీద కాన్పులు రావటంవల్ల వెంకమ్మతల్లి చాలా నీరసించిపోయింది. ఆపైన కొత్త కడుపు ! పుట్టబోయే పిల్ల సంగతి దేముడెరుగు, అసలు తల్లి ప్రాణానికే మోసంవస్తుందేమో అని చాలామంది భయపడ్డారు. భార్యకింత ఘోరవిపత్తు తెచ్చిపెట్టాడని వెంకమ్మతండ్రిని ఎవరూ పైకి అనలేదుకాని ఆ శుభ సమయంలో ఎవ్వరూ ఆయనపట్ల సంతోషం ప్రకటించలేదు !

వెంకమ్మ సజీవంగా పుట్టటం అర్ధశత బంధువుల్లో ఎవ్వరికీ ఇష్టం లేదు. కాకులూ, గద్దలూ, కుక్కలూ, పందులూ పాములూ, చీమలవల్ల ఒక సమయాన కాకపోతే మరో సమయంలో ఏదైనా ప్రయోజనం వుంటుందేమోకాని వెంకమ్మవల్ల ఏ ప్రయోజనమూ వుండేటట్టు ఎవ్వరికీ తోచలేదు. సరైన తిండిలేక నిస్సత్తువతో అనారోగ్యం అభివృద్ధి అయ్యే కుటుంబంలో మరో అనారోగ్యమైన అనాకారి ఆడపిల్ల ఉద్భవించటం ఎంత ధైర్యవంతుణ్ణి అయినా చిత్తుచేస్తుంది. అదృష్టవశాత్తు వెంకమ్మ తండ్రికి ధైర్యం లేదు :



"మీ లోకం వదిలినా, ఇంకా మా వెంట పడుతున్నారూ!"

వెంకమ్మ అనారోగ్యం పురుట్లోనే పీకలమీదికి తెచ్చింది. చావు బతుకుల మీదికి వచ్చిన భార్యనూ, పిల్లనూచూసి వెంకమ్మ తండ్రికి పిచ్చాసుపత్రి ప్రవేశం మినహా ఆ లక్షణాలన్నీ సంప్రాప్తించాయి. నయం అయినా కాకపోయినా భార్యకు, పిల్లకు మందు లిప్పించే తాహతులేదు. తల్లికి పాలులేవు. కాని పిల్ల పాలుతాగే స్థితిలోలేకపోవటం ఒక్కటే సుగుణం – దేముడు చేసిన మేలు! వెంకమ్మ తల్లి బతికింది!

ఎవ్వరూ మనాసా వాచా కోరకుండానే వెంకమ్మకూడా బతికింది. జీవితం ప్రారంభించింది. పిల్లలు లేనివాళ్ళకూడా వెంకమ్మను ఎత్తుకోవటానికి ఇష్టపడే వారు కాదు. పారాడగలిగే టంతవరకూ ఆవిడ వెంకమ్మతల్లికి ఏదో చుట్టమయిన కళ్ళులేని ఓ ముసలమ్మ చేతుల్లో పెరిగింది. పడుతూ, తలకూ మోకాళ్ళకూ తగిలే దెబ్బలతో నడవటం నేర్చుకుంది. వెంకమ్మ ముఖారవిందం తల్లిదండ్రులకే వికారం కలిగించేది. వెంకమ్మ అంటే తమకున్నరోతను వాళ్ళెప్పుడూ దాచిపెట్టలేదు. కన్న తలిదండ్రులకే అలా వుంటే మరొకరు వెంకమ్మను మరోలా ఎలా చూస్తారు – ఎందుకు చూస్తారు? చిన్నతనంలో ఆవిడ ఎక్కడికి వెళ్ళినా అడిగినవాళ్ళూ, విచారపడినవాళ్ళూ లేరు.

కాని దారితప్పి చెరువుగట్టున చాకిరేవుకో, గాడిభావిదగ్గిరకో, దేవాలయం మండపం దగ్గిరికో వెళ్ళితే ఎవరో అనవసరమైన శ్రద్ధతీసుకుని ఆవిడని ఇంటిదగ్గిర దిగ పెట్టి వెళ్ళేవాళ్ళు. ఆమె ఎవరిపిల్లో వూరందరికీ తెలుసు—ఆ వూళ్ళో అలాంటి పిల్ల మరొకరు లేందే! శకునాలు పాటించేవాళ్ళంతా వెంకమ్మకంటె పిల్లి నయమని ఏకగ్రీవంగా ఆమోదించారని ప్రతీతి!

ఎనిమిదో ఏడు వచ్చేసరికి వెంకమ్మకు శాస్త్రప్రకారం పెళ్ళిచెయ్యాలని తండ్రి నిశ్చయించాడు. కాని ఆమెకు వివాహం చెయ్యటం అసంభవమయింది. క్రమంగా వెంకమ్మకు రజస్వల అయ్యే ఈడుకూడా వచ్చేసింది. ఆ రోజుల్లో రజస్వల అయిన పిల్లకు పెళ్ళిచేస్తే బాగా డబ్బున్నవాళ్ళయితే తప్ప, సంసారపక్షం వాళ్ళ నయినా బంధువర్గం, సంఘం వెలివేసి, బహిష్కరించేవాళ్ళు. ఇక వెంకమ్మ తండ్రి సంగతి వేరే చెప్పాలా! వెంకమ్మ తండ్రికి వెర్రెత్తినట్లయింది. ఇటు వెంకమ్మ తల్లి మళ్ళీ ప్రసవించే రోజులు—అటు వెంకమ్మ పెళ్ళి వెంటనే చేసి తీరాలి! ఆ సమయంలో దేముడు చేసిన మరో మేలు ఏమిటంటే ఏ సంఘం, ఏ బంధువర్గం వెంకమ్మకు రజస్వలానంతర వివాహం చేస్తే ఆమె తండ్రిని పచ్చడి చేశేవారో ఆ బంధువర్గమే, ఆ సంఘమే వెంకమ్మ వివాహ విషయంలో విచిత్రంగా సహాయపడడం. అన్ని విషయాల్లో వెంకమ్మకన్న రెండాకులు ఎక్కువ చదివిన ఓ నిర్భాగ్యుణ్ణి బంధుకోటిలో ఏరి ఆవిడకు అంటగట్టారు. ఎవ్వరికీ పనికిరాని వెంకమ్మ అతనికి అవసరమని శాసించారు. అతను కొంచెం పెద్దవాడు కావటంవల్ల "నాకీ పెళ్ళి వద్దో" అని ఎంత పోరుపెట్టినా వివాహం కానివాళ్ళు, భార్యలు లేనివాళ్ళు ఎలా దిక్కులేకుండా పోతారో ఉదాహరణలు చూపించారు. ఏ కాలో, చెయ్యో విరిగితే ఎవరు చేస్తారనీ, అవసరమైతే అలా విరగ్గొట్టి చూపగలమనీ తేల్చారు. పెళ్ళి అంపకాలప్పుడు మాత్రం ఆమెతల్లీ, తండ్రీ అనుకోకుండానే కళ్ళు తుడుచుకున్నారుట. అద్ది ఏ తల్లిదండ్రులూ తప్పించుకోలేరు — కనీసం వెంకమ్మ తండ్రికయినా సాధ్యం కాలేదు!

వెంకమ్మ జీవితంలో మరో ప్రకరణం ప్రారంభమయింది. మొదటినుంచీ వెంకమ్మ ఎవ్వరికీ అక్కర్లేక పోయిందని ఆమె భర్త గ్రహించాడు. ఆమెకు యుక్తవయస్సు రాగానే ఏలుకోటానికి సుతలామూ నిరాకరించాడు. తనను బెదిరించి, బలవంతంగా ఆ పెళ్ళి చేశారనీ, ఆమెను భార్యగా స్వీకరించాలిసిన బాధ్యత తనకులేదనీ అతను చెప్పటమే కాక మనఃపూర్తిగా నమ్మాడు! భార్యను

ఏలుకోన్ని భర్తను శిక్షించాలని, కనీసం వెలివెయ్యాలని బంధువర్గంలో, సంఘంలో నియమాలు లేవుగా! బహిష్కరిద్దామన్నా వెంకమ్మ భర్త ఆమె బంధువు! ఆమెను నిరాకరించటానికి అతనికి ఇంకో కారణంకూడా తోడైంది. ఎవర్ని చూసినా అతనిభార్యకంటె అందమైన వాళ్లే. తను భాగ్యవంతుడు కాకపోవచ్చు. రూపసి కాకపోవచ్చు - కాని అందమైన ఆడవాళ్ళను వాంఛించటానికి ఎవరి అనుజ్ఞ అక్కర్లేదుగా! కోరికలు వృద్ధి చేసుకునే వాళ్ళంతా అర్హులయ్యేనా ఏమిటి కోరికల్ని పూరించుకోవటం! చివరకు, అందంలేకపోయినా అంగసౌష్టవం కల వాళ్ళను ("వొంపులు" అనేది అక్షరాలా తర్జుమాపదం–ఆ కాలంలో వాడుకలో లేదు) అతను ఆశ్రయించాడు. ఏ కాడి నాకైకక్కుర్తిపడే స్థితికి రావలిసివచ్చిన వనితల్ని మరిగాడు. వెంకమ్మకు దూరం అయినాడు. చివరకు కనిపించ కుండాకూడా పోయినాడు. అత నెక్కడికి వెళ్ళిందీ, ఏమయిందీ ఎవ్వరికీ తెలియదు. రోగాలతో తీసుకుని చచ్చిపోయి వుంటాడని కొందరు తేల్చారు. ఎవత్తె కోసమోపోతే చంపేశారని కొందరు పుకారు పుట్టించారు. నిజం ఎవ్వరికీ తెలియదు. కాలక్రమాన వెంకమ్మకు మిగిలిందల్లా భర్తలేని పునిస్త్రీతనమూ, భర్తతాలూకు యాభై సెంట్ల భూమీ, విశాలప్రపంచమూ!

వెంకమ్మ భర్త వొట్టి పరమ నిర్భాగ్యుడని తేల్చారు. మరి వెంకమ్మ చాలా సౌమ్యురాలు. మాట పొల్లురానీయదు. మీదుమిక్కిలి ఎంత చాకిరైనా విసుక్కోకుండా, చక్కగా చేస్తుంది. ఒక్క వెంకమ్మ వుంటే పనికి ఇంకెవ్వరూ అక్కర్లా! పిల్లల్ని కూడా ఎత్తుకు తిప్పుతుంది. వెంకమ్మ అందరి పనులకూ కావలిసి రావటంవల్ల ఆమె విషయంలో అసూయలు, స్పర్ధలు రేగిన మాట నిజం. ఏ వెంకమ్మ అయితే మాత్రం ఒకేసారి అందరి పనులూ ఎలా చేస్తుందేం అని అందరూ వాదించారు. కాని "మా'' ఇంట్లో పనిచెయ్యాలని అందరూ పట్టుపట్టే వాళ్ళు. ఆమె చేత పనిచేయించుకోవటమే ఆమెపట్ల ఎవరైనా చూపగలిగిన సానుభూతి!

అక్షరజ్ఞానంలేని వెంకమ్మ చచ్చేటంతవరకూ ఈవిధంగా జీవించాలిసిన పరిస్థితి ఏర్పడ్డది. ఈ పరిస్థితిని ఆమె తండ్రి ఒక సమస్యగాచేశాడు. అంతవరకూ తండ్రిఇంట్లో వుంటూ వచ్చిన వెంకమ్మను ఒకనాడు ఆమెతండ్రి ఆమె భర్తతాలూకు యాభై సెంట్ల పొలమూ తనపేర పెడితే ఆవిడ తిండి కేలోపమూ వుండదని సలహా ఇచ్చాడు. ఆ సలహా వెంకమ్మ కెందుకో

మనస్కరించలేదు. బంధువులయినా, ఇతరులైనా ఆమెచేత అడ్డమైచాకిరీ చేయించుకుని ఇంత తిండి పెట్టటం ఆన వాయితీగానే వుంటోంది. ఆ పొలంమీద వచ్చే ఆదాయాన్ని తండ్రే వాడు తున్నాడు, ఆవిడకైనా - ఎవరికైనా ! అటువంటప్పుడు ఆ పొలం తనపేర పెట్టమని తండ్రి ఆమె నెందుకు నిర్బంధించాలో ఆమెకు అర్థంకాలేదు. వెంకమ్మ పెద్దఅక్కయ్య ఏళ్ళమట్టీ భర్తకు తెలియకుండా పేర్చుతూ వచ్చిన రెండు వందల రూపాయలనూ తండ్రి దగ్గిర దాచిపెట్టి ఓసారి అడిగితే, రెండు కిత్తాల్లో మొత్తం పదిరూపాయలిచ్చి వూరుకున్నాడు తండ్రి. రెండో అక్కయ్య మరణసమయంలో ఆమె బంగారుకంటె మాయంకావటానికి తండ్రే కారణమని కొందరనుకున్న మాట నిజమేకాని ఒక్క వెంకమ్మే అది కళ్లారాచూసిన మనిషి. వెంకమ్మ చూసిందని తండ్రికి తెలుసు. కాని వెంకమ్మ ఆ సంగతి బైట పడనీయ లేదు. ఆయన పరిస్థితి అలాంటిది. ఏమైనా పొలం తండ్రిపేర రాయటం ఆమె కిష్టంలేక పోయింది. అక్కడి నుంచి వెళ్ళిపోవటమే మార్గమని నిశ్చయించుకుంది.

ఎక్కడికి వెళ్ళుతుంది? ఏం చేస్తుంది? ఆ పల్లెటూళ్ళో తండ్రికి విడిగా వుండటం అసంభవం. ఇంకో పల్లెటూరు పోవాలి. పనిపాటలకు వెను దీయని మనిషి కనక ఎలాగో పొట్ట పోషించుకోవచ్చు. కాని బస్తీల్లోమల్లే కాకుండా పల్లెటూళ్ళలో సాధారణంగా అంతా శరీరంవంచి పనిచేశేవాళ్ళేనాయె! కనీసం కొత్త పల్లెటూరిలో ఆమె నిస్సహాయస్థితి, సహాయపడే ఆమె స్వభావమూ తెలిసేవరకూ ఎవరూ పని చేయించుకుని ఆమె పోషణకు తోడ్పడక పోవచ్చు ! కనక బస్తీ చేరటం ఉత్తమం అనుకుంది. ఇక పొలంసంగతి. తనా అక్కడ వుండి ఆ పొలం చూసుకోలేదు. అమ్మితే తండ్రికి ఆకాస్త ఆదాయమూ పోతుంది. వెంకమ్మ దీర్ఘంగా ఆలోచించి పొలంఅయివేజు తండ్రి అనుభవించే టట్టు, తాను మాత్రం వెళ్ళిపోయేటట్టు తీర్మానించుకుంది. వెంకమ్మ మేజరు — ఆమె అభిప్రాయానికి ఎదురు చెప్పే అధికారం తండ్రికి లేదు !

వెంకమ్మ ఈ వూరు చేరి ఓ శ్రీమంతుల ఇంట్లో వంటకు కుదిరింది. పల్లెటూరికీ, బస్తీకీ చాలాభేదం కనిపించింది ఆమెకు. తనకుమల్లే జీవనోపాధి కోసం వచ్చిన వాళ్ళు, చదువుల కోసం వచ్చిన వాళ్ళు, వ్యాపారరీత్యా వచ్చీ పోయేవాళ్ళు బస్తీలో ఎందరో వున్నారు. పల్లెటూళ్ళలో అయితే చాతనయినంత వరకు ఒకరికొకరు ఆదుకుంటారు. బస్తీలో ఆ తీరిక వుండదు. తను వంటకు



"మీరు నన్ను అనుగ్రహించారంటే ఈ జీవితంలో ఎంతో పైకిపోతాను."

చేరినట్టుగాని, తన పేరేమిటోకాని ఇంటి యజమానికి తెలియకపోవటం వెంకమ్మకు ఆశ్చర్యం కలిగించింది. ఇంటిపనివాళ్ళ విషయంలో ఆయన ప్రమేయంలేదు. ఆ ఇంట్లో స్త్రీలకు పురుషులతో సమానత్వం లేదు — ఉన్నతాధికారమే వుంది!

నిస్సహాయురాలైన ఆడది పురుషుణ్ణి మరింతగా ఆకర్షించటం సహజం! ఇక అనాకారిదైనా "వూరికే" వున్న స్త్రీ మగవాడికి మరింత మగతనం తెప్పిస్తుంది! వెంకమ్మకీ రెండు లక్షణాలూ వున్నయి! పైగా భార్య వంటింటో ఎన్నడూ లభ్యం కాలేదో ఏమో ఆ శ్రీమంతుల పెద్దబ్బాయిగారు ఓనాడు సాయంత్రం వెంకమ్మను కాస్తా అమాంతం వాటేసుకున్నాడు. తనపట్ల ఆ పెద్దబ్బాయిగారి కింత దయాదాక్షిణ్యాలు వున్నట్టు వెంకమ్మ వూహించుకోకపోవటంవల్ల అమె కెవ్వున కేక వేసింది. పేరంటానికి వెళ్ళివుండాలిసిన పెద్దబ్బాయిగారి భార్య వెంకమ్మ కేకకోసమే అవతలకాసుకుని వున్నట్టుగా వెంటనే ప్రత్యక్షమయింది. తప్పంతా వెంకమ్మదే కనక ఆవిడకు మర్నాడే ఉద్వాసన ముట్టింది. వెంకమ్మ వెళ్ళిపోవటంకూడా ఇంటి యజమానికి తెలియదు!

వెంకమ్మ మరోపేటలో ఓ భాగం అద్దెకు తీసుకుంది. పూటకూళ్ళ ప్రారం

భించింది. అది ఆమెకు వృత్తికాదు—వ్యాపారంకాదు. కేవలం భుక్తికోసమే. పూటకూళ్ళతో తనజీవితం గడప గలిగితే వెంకమ్మకింకేం అక్కర్లేదు. అక్కడ బల్లలమీద కూర్చొని భోజనం చెయ్యటానికి అవకాశమేలేదు. వూళ్ళో ఆధునికపద్ధతుల్లో హోటళ్ళు అభివృద్ధి చెందుతున్నా వెంకమ్మ హోటలుకు చలనంలేదు. బస్తీ డాబులకు, నాజూకులకు మోజుపడనివాళ్ళు, పల్లెటూళ్ళ కరణాలు, కోర్టుపన్లమీద వచ్చేవాళ్ళు ఆవిడ హోటలును వెతుక్కుంటూ వస్తారు. అక్కడ మరి ఇంటిభోజనం, ఆప్యాయత లభిస్తాయి.

ఎవరో అన్నారు-కలంతో కవిత్వం రాయటందగ్గిర్నుంచీ నాగలితో భూమి దున్నటంవరకూ భేదంలేదనే జాతే ఉన్నత దశకొస్తుందని. కాని ఈ మధ్యలో ఎక్కడా పూటకూళ్ళు పెట్టటం వున్నట్టు కనిపించదు! ఆధునిక హోటళ్ళలో సణగటానికి అట్టే అవకాశాలుండవు. దిక్కులేని వెంకమ్మ హోటలు, దీనికెంతైనా పనికొస్తుంది. ఇంటిభోజనమూ రుచిచూడొచ్చు-ఇష్టం వచ్చినట్టు సణగనూవచ్చు వెంకమ్మ హోటల్లో! వెంకమ్మ తనను ఆదరంగా చూడటాని క్కారణం తాను చేరిన లగ్గ మహాత్యమనుకుంటూ వచ్చాడు నాగాయి. డబ్బు ఇస్తూకూడా తన భోజనాన్ని నాగాయి వంకలు పెట్టకపోవటం వెంకమ్మకు ఓ మహాభాగ్యం అయిందని ఎవ్వరికీ తెలియదు.

నాగాయి కెప్పుడూ సమయానికి డబ్బు వస్తుండేదికాదు. ఒకటో తారీకు రాగానే వెంకమ్మ వాడిని డబ్బు అడిగేది. ఒకసారి నాగాయి రెండునెలలకూ్కడా డబ్బు ఇయ్యలేకపోయాడు. ఆవిడ వరసగా రెండు రోజులు డబ్బు అడిగేటప్పటికి నాగాయికి మతిపోయినట్లయింది. మూడోనాడు భోజనానికూ్కచోకముందే డబ్బు అడిగింది. డబ్బు ఇయ్యందే భోజనం పెట్టటం ఆవిడకిష్టంలేదనుకుని నాగాయి, ఆవిడని లోపలికి పోనిచ్చి బయటికివచ్చేశాడు. ఆ రాత్రికి మరి వాడికి భోజనమేలేదు మర్నాడు ఉదయానే వెంకమ్మగారు నాగాయి గదిముందు ప్రత్యక్షమయింది. రాత్రి నాగాయి భోజనంచెయ్యలేదని తెలుసుకుంది. డబ్బు అడిగితే అతను భోజనం మానేశేటంతటి తెలివి తక్కువ వాడు అనుకోలేదన్నది. ఇందుకేనా ఈ చదువన్నది. అలా మొత్తాలు పెంచి తనకు ఎందరో ఎగేసిపోయారన్నది. ఆ ధోరణిలో ఆవిడ తన చరిత్ర నాగాయికి చెప్పేసింది. స్త్రీలో సహజంగా వుండే మాతృభావం నాగాయి మీద మరింత ప్రసరించింది. నాగాయి సినిమాల కెళ్ళితే విసుక్కోక, ఆలిస్యం లెక్కచెయ్యక

భోజనం పెట్టేది. అడగనిది అమ్మయినా పెట్టదంటారు. ఆమాట నిజమే అయితే తల్లి లేదుకనక నాగాయికి తెలియదు—వెంకమ్మ తల్లుల్ని మించినది!

నాగాయికి నాటకాలంటే ఉబలాటం అనీ, దగ్గిర డబ్బు వుండదనీ తెలుసు వెంకమ్మగారికి. ఆవిడ ఇస్తానన్నా నాగాయి భిడియపడటం చూసి తనదగ్గిర తీసుకోవచ్చునని నమ్మించేది. అడిగితే డబ్బిచ్చేవాళ్ళంటారు. కాని మనకు డబ్బు అవసరమని తెలిసినప్పుడు మాత్రం ఆ సంగతే తెలియనట్టు ప్రవర్తిస్తారు కొందరు. మనచేత అడిగించుకోవాలని వుంటుంది వాళ్ళకి. అడిగించుకోవటంలో తప్పేంలేదు. కాని వెంకమ్మగారిలా చాలా మంది సన్నిహితులుకూడా ప్రవర్తించరు. ఈ అడిగించుకోవటమైనా డబ్బులోవున్న మహత్యం ఇతరవాటిల్లో లేదని నాగాయికి బాగా తెలిసివచ్చింది. నాగాయి సాటి కాలేజీవాణ్ణి అయిదురూపాయలడగటం "దేహి" అయింది. కాని వాడే నాగాయిని కాలేజీ నోట్సు అడగటం మాత్రం "దేహి" కాలేదు! ఇక అడిగినా, వుండికూడా ఇయ్యని సన్నిహితులకంటె వెంకమ్మగారు లక్షరెట్లు నయమనిపించింది నాగాయికి!

నాగాయితోపాటు ఇంకా ఇద్దరు ముగ్గురు కాలేజీవిద్యార్థులు వెంకమ్మ హోటల్లో భోంచేశేవారు. వాళ్ళ తెలివి కాలేజీలో ఎంతవరకు పోయేదోకాని వాళ్ళ "అతితెలివి" మటుకు వెంకమ్మగారిమీద ప్రసరించేది. పిల్లిమీద, ఎలికిమీద, కూరలమీద పెట్టి వెంకమ్మను ఎగతాళి చేశేవారు. కొందరు ఎదటివాళ్ళను ఎగతాళి చెయ్యకుండా, అవమానించకుండా వుండలేరు. మరి ఎగతాళి చేశేవాడు గొప్పవాడు. ఎగతాళి పడేవాడు తక్కువవాడు! మరికొందరు బూతులతో ఎగతాళి చేస్తే తప్ప వాళ్ళఆత్మ శాంతించదు! ఈ కాలేజీ కుర్రాళ్ళు మాత్రం, వాళ్ళ ధర్మమా అని, బూతుఅర్థాలు కూడా వుండే మాటలన్నీ వాడి వెంకమ్మను అవమానించేవాళ్ళు. అదైనా అందరూ వున్నప్పుడే! ఒక్కడే వుంటే చాలా పెద్దమనిషల్లే ప్రవర్తించేవాళ్లు. అవతలవాళ్ళని ఎగతాళి చెయ్యాలన్నా, అవమానించాలన్నా "తోడు" వుండాలని నాగాయికి వెంకమ్మగారి హోటల్లో తెలిసివచ్చింది. ఎప్పుడన్నా వెంకమ్మగారి అక్కయ్యలు వచ్చి వడ్డనలో సహాయం చేస్తుంటే వీళ్ళ పెచ్చుపెరిగేవాళ్ళు. ఆడవాళ్ళని, మరీ దిక్కులేని ఆడవాళ్ళని నీచంగా చూడటంకంటె పురుషోత్తములు చెయ్యగలిగిన ఘనకార్యం ఏముంది? ఎంతోఓర్పుగల వెంకమ్మగారు విసిగి ఒకసారి ప్రతివాడినీ బహుసున్నితంగా ఎగతాళి చేసింది. నవ్వుతూ అటు మూడు తరాలుకు ఇటు మూడు తరాలకు తగిలే

టట్టు చీవాట్లు పెట్టింది. వెంకమ్మగారు అంత మాటకారి అని అంతవరకూ ఎవ్వరూ అనుకోలేదు. అంతమందీ వుండికూడా ముఖాలు వేళ్ళాడేశారు. మరి నోరెత్తలేదు. అనాధ, అనాకారి అయిన పూటకూళ్ళమ్మ ఆ కాలేజీ కుర్రాళ్ళని భోజనాలముందు నోరు మూయించింది!

నాగాయి వెంకమ్మగారి ఇల్లు గుర్తు పట్టాడు. కాని ఆ వీధిలో చాలా ఇళ్లు మారిపోయినై. సైకిలు రిక్షాను పంపి, మూసివున్న వీధి వాకిలి తలుపుతట్టాడు. జవాబులేదు. మరోసారి తలుపు తట్టాడు. అరుగు పక్కనే గోలీలాడుతున్న కుర్రాళ్ళలో ఒకడు ఆట ఆపి "ఎవరుకావాలి?" అని అడిగాడు.

"వెంకమ్మగారు!'' అన్నాడు నాగాయి. ఆ కుర్రాడు "అమ్మా'' అని అడుస్తూ తలుపుతట్టాడు. నాగాయికి ఆశ్చర్యంవేసింది. ఇంతలో వెంకమ్మ గారు తలుపుతీసి ''ఎవరా'' అన్నట్టు చూసింది. ఆవిడ జీవితంలో కరడుకట్టు కున్న విషాదం అంతా ఒక్కసారి కన పడింది ఆ ముఖంలో. కాని నాగాయిని చూడగానే ఆవిడ ముఖం మారిపోయింది.

''గుర్తువున్నానా?'' అన్నాడు నాగాయి. ఆవిడ ఎగాదిగాచూసి ''నువ్వా-రా!'' అని ఓ పీట తెచ్చివేసింది. ఆవిడ అడిగిన ప్రశ్నలకు అంతులేదు. నాగాయి భార్య, పిల్లలు మొదలైన విషయాలన్నీ సవిస్తరంగా తెలుసుకుంది. ఆవిడ ఒకప్పటి అభిమానమే నాగాయికి ఇప్పుడు చాదస్తమనిపించింది!

''ఇంతకూ ఏంపనిమీద వచ్చావు?"

''ఇవాళ మా నాటకం వుంది. మిమ్మల్ని పిలవటానికి వచ్చాను!''

"నా జీవితమే నాటకం! నువ్వు వేషంవేస్తావా ఏమిటి?

"ఏదో! తప్పుతుందా?''

''నాటకాలు చూడ్డంమానేసి ఇప్పుడు వేషాలే వేస్తున్నావూ! భేష్!''

"ఇందాక ''అమ్మా'' అని పిలిచిన కుర్రాడెవరు?"

''నా తమ్ముడి నాలుగో కొడుకు - నేను పెంచుకున్నానులే! వాడు నాలుగు రోజుల్నించి నాటకానికి డబ్బు ఇయ్యమని వేధించుకు తింటున్నాడు - ఈ నాటకానికే కామాలు! వాడినిమటుకు తీసుకుపో బాబూ - నీకు పుణ్యం వుంటుంది!''

''అతనే ఏమిటి - మీరూ రావాలి. నేను మీకోసమేవస్తా!''

''ఎలా బాబూ? ఎవరైనా ఆలిస్యంగా వస్తే భోజనం ఎవరు పెడతారు?" అవతల దొడ్డి వాకిలి మధ్యలో ఇద్దరు స్త్రీలు నిలుచుని చూడటం కనిపించింది నాగాయికి.

"ఎవరో వున్నారే!'' అన్నాడు నాగాయి. వెంకమ్మ తొంగిచూసింది.

''మా పెద్దక్కయ్య! చూసిపోదామని వచ్చింది. నెలరోజు లయిందిలే! ఆ పొట్టిది మూడో అక్కయ్య. పాపం దాని మెగుడు పోయినాడు. అదీ, ముగ్గురు పిల్లలూ ఇక్కడే వుంటున్నారు. నీవు ఇదివరకు చూశావు—గుర్తు పట్టలా?''

''వాళ్ళు సాయం చెయ్యరూ ఈ వక్కరోజు?''

"నాటకం అంటే వాళ్ళూ వస్తానంటారేమో!"

''నాకదంతా తెలియదు. మీరు మటుకు రాక తప్పదు. రాత్రి తొమ్మిదింటికి బండి పంపుతాను. సిద్ధంగా వుండండి!''

''మా నాన్న, అమ్మ ఎలా? వాళ్ళక్కడే వుంటున్నారు!"

"ఎన్నాళ్ళనుంచి?'' నాగాయికి ఇంకా ఆశ్చర్యం వేసింది.

''ఏడేళ్ళు దాటిందేమో!'' అంది వెంకమ్మగారు.

"ఏరీ?''

''దొడ్లో వున్నారు! మా అమ్మకు వినపడదు. మా నాన్నకు కనపడదు, వినపడదు!'' అంది వెంకమ్మగారు.

నాగాయి మెల్లిగా దొడ్డివాకిలి దగ్గిరికి వెళ్ళాడు. బాదంచెట్టుకింద నులకమంచం మీద ఓ పండు ముసలాయన పడుకుని వున్నాడు. పక్కనే చాపమీద ఓ ముసలావిడ కూచుంది.

"మీ తమ్ముడేం చేస్తున్నాడు?"

"ఆ వూళ్ళోనే మేష్టరు పని చేస్తున్నాడు.''

''మీ నాన్న, అమ్మ అక్కడ వుండరాదా?'' అన్నాడు నాగాయి ధైర్యంచేసి.

"వాళ్ళ కక్కడ తోచదు. అయినా ఎక్కడ వుంటే నేం? అదీకాక కోడళ్ళు కాపరానికి వచ్చిం తర్వాత కొడుకులు మాట వింటారా—నీకేం తెలుస్తుంది!" అన్నది వెంకమ్మగారు నవ్వుతూ. ఆ విషయం రుజువు చెయ్యటానికి వాళ్ళ నాన్నకూడా లేడు!

''మీ నాన్నగారు కులాసా?'' అంది వెంకమ్మగారు.

"లేరు—మూడేళ్ళయింది పోయి!"

"అందుకే నువ్వు నాటకాల్లో దిగావు!" అంది వెంకమ్మగారు. నిజానికి తండ్రి పోయిన తర్వాతే నాగాయి లాయరు—ప్రొడ్యూసరు—డైరెక్టరు—నటుడు అయింది!

"మీరు అందరికన్న ముందు సోఫాలో కూర్చుని, మా నాటకం చూడాలి!'' అని స్పష్టంగా చెప్పి నాగాయి హాలు దగ్గిరికి బైలుదేరాడు. మరి వెంకమ్మగారు నాగాయి వాళ్ళ నాటకానికి నాయకురాలు. కాని జీవితానికి సాహిత్యం ప్రతిబింబం కావాలి అన్న సూత్రప్రకారం నాటకంలో మార్పులు చెయ్యాలా వద్దా అని నాగాయి కిప్పుడొక తీరని సమస్య పట్టుకుంది. నన్నడుగుతాడు—నేనేం చెప్పగలను!



# సినిమా క్విజ్





పై రెండు బొమ్మలూ రెండు సినిమాల పేర్లు తెలియజేస్తవి    ఏమిటవి ?

(జవాబులు 97 వ పేజీలో)

# సైకిల్ స్వారీ

ఆర్ పద్మనాభం

చిన్నప్పటినుంచి నాకు ఆశ్చర్యం, కుతూహలం, ఇంకా చెప్పాలంటే గౌరవంకూడా కలిగించిన వస్తువొకటి వుందంటే అది సైకిలే; మా హెడ్ మేష్టారి వాహనం. వారు సైకిల్ వాహకులై కచ్చాజండా ఎగరేసుకొంటూ సర్రుమని స్కూల్ ఆవరణలో ప్రవేశించి జామ్మని దిగుతారు. అప్పుడు నాకొక్కడికే కాదు, పిల్లలందరి మనస్సుల్లోనూ వారొక గొప్పవ్యక్తిగా కనిపిస్తారు. ఒక అద్భుతుడైన మహనీయుణ్ణి చూసినట్టు అందరూ గప్ చిప్ అయిపోతారు.

ఎందుకంటే, ఆరోజుల్లో అందరికీ సైకిలు లేదు. సైకిలు పెట్టుకొన్న ఎవరో ఒకరిద్దరు పెద్దలకు మాత్రమే గౌరవం ఉండేది. అందరూ సాధించలేని ఏదో మహత్కార్యం వారు సాధించినట్టు మాకు తోచేది. తోచదా మరి ? ఎంతటి విచిత్రవాహనమో చూడండి: నిలబెట్టితే అది నిలువదు- నిండు పేని బిడ్డలాంటది. తేలికైన నాజూకైన చట్రంపైన, దానికన్నా రెండు మూడింతలు బరువుగల మానవుడు ఎక్కేస్తే, తక్షణమే అతి సుళువుగా పరుగెత్తడమే దానిపని ! ఎంత బరువైనా కొంచెంకూడ లక్ష్యం లేనట్టు. దానిమానాన అది సాగుతూ వుంటే, మనకెంత వేగం కావాలో మన పాదాల సైగ తెలుసుకొంటూ అంత పరిమితిలోనే పోతుందికద ! అవసరమైన వంకరటింకరలు, మెళుకువలు, లీలావినోదమైన నాగనడకే. నావోటి పాదచారులు తమపైకి వస్తుందేమో అనుకొని భయపడితే అది "టుంగ్" అని కింఖినిగొంతుతో నవ్వేసి పారిపోతుంది. ఎటువంటి అపాయమూలేకుండా సుళువుగా దూరిపోతుంది. చూస్తే కర్రలాంటి వాహనం! దీనిశక్తి ఎంత ! సాహసమెంత! కార్లూ బస్సులూ అయితే వాటికి ఒక ఇంజనూ, నోరూ, తిండీ అన్నీ

కావాలి. వాటి మోతలు, హోరులు చెప్పతరంకాదు; గూబ బద్దలవుతుంది.

కాని మన సైకిలుకి కావలసిందల్లా వట్టిగాలే. పురాణకాలంలో వాయుభక్షణంతో జీవించిన ఏ ఋషో ఏదో కర్మం లోపించి సైకిలై పుట్టి ఇలా మానవసేవచేస్తున్నాడు కాబోలు పాపం!

సైకిలంటే మహాగొప్ప అనుకున్నాను మొదట్లో. దాన్నిగురించి నాలాంటి బీదలు తలచటానికే వీలు లేదనుకొన్నాను. సైకిల్ ప్రయాణమంటే ఒక సర్కసుఫీటు, లేదా కత్తిమీద నాట్యం అనుకున్నాను ఆ రోజుల్లో.

నేను పెద్దయిన కొద్దీ తోడివాళ్ళల్లో నేను ప్రత్యేకించి వీడిపోతున్నట్టు లోలోనే నొచ్చుకొన్నాను. నాకన్న చిన్న చిన్న కుర్రాళ్ళు కుక్కను చెవిపట్టి లాగినంతసులువుగా సైకిలును లాక్కుంటూవచ్చి దానితో ఆటలాడుతూండడం చూశాను. వాళ్లు తమ తమ ఇష్టానుసారంగా సైకిల్‌ను పరుగుతీయిస్తున్నారు. సైకిలును లొంగతీయడమంటే ఏదో పెద్ద డిగ్రీ సంపాదించేటంత పని అని నేను అనుకొంటూవుంటే, ఈ కుర్రకుంకల చేతిలో అదెంతటి అల్పవస్తువై పోయింది! బెదిరిస్తే ఊరుకునే కుక్కలాగా సైకిలు కుర్రాళ్ళచేతిలో వాళ్ళ యిష్టంప్రకారం పడివుంటుందికదా! కుక్కలు మానవులకు స్నేహమయినట్టే సైకిలున్నూ. అలా అయితే నాకుమాత్రం ఎందుకు వశ్యంకాదూ? ప్రపంచం ముందుకు పోతూంటే నేను వెనకపడి పోవడమా! చెప్పరాని బాధ కలిగిందినాలో.

ప్యూన్ రాముడు నాకు స్నేహితుడైయాడు. అప్పుడు నేనొక మేష్టార్ని. రాముడికి, వాడి ఆఫీసు సైకిలు వాడి ఇష్టప్రకారం సేవచేస్తూఉండేది. ఒక్కొక్కసారి నేను ఎక్కడికైనా బయలుదేరడం వాడు చూస్తే "మేష్టారూ, కావలిస్తే నా సైకిలు తీసుకుపొండీ" అనేవాడు. పాపం. నాకు సైకిలురాదని వాడికి తెలీదు.

"వద్దులే, నేను ఎప్పుడు తిరిగొస్తానో తెలీదుగా, నీకుమళ్ళీ ఆఫీసు పనికి ఇబ్బంది అవుతుంది" అనేవాణ్ణి. ఎవరితోనూ నాకు సైకిలురాదని అనిపించుకోకుండా జాగ్రత్తగా ఉండేవాణ్ణి. మనిషన్నవాడికల్లా సైకిలు రాగా, నాకు రాదంటే సిగ్గుకదూ?

ఇలా ఎంతకాలం?

రాముడు ఎన్నోమాట్లు చెప్పేవాడు; "ఇంటినుంచి మైలుదూరం పైగా వుందే. ఎందుకు బాధపడుతారు

మేష్టారూ, ఒక సైకిలు కొనుక్కుంటే ఎంతహాయి ! డబ్బుపోతే పోయింది"

"అదే, దాన్ని గురించే ఆలోచిస్తున్నాన్రా. తీస్తే కొత్తదే తీయాలి. దేనికైనా డబ్బుండొద్దూ ? అరువు బేరం నాకొద్దురాబాబూ" అన్నాను మహాసైకిలు వీరుడిలా.

మేం చూస్తూండగానే ఫ్యాన్ రాముడు సొంతసైకిలు సంపాదించేశాడు. నాకన్నా కిందవాళ్ళు ఎందరో సొంతసైకిల్ - సెకండ్ హాండ్ గానీ, థర్డుహాండుగానీ - కొని, రాజుల్లాగా సవారీచేస్తూంటే నేను మట్టుకు ఇంకా హైదర్ కాలంనాటి హాడిలాగా కాలి నడకతోనే కాలం గడుపుతున్నానే! ఛ! బాగులేదు ! .

ఏ విద్యయినా గురుముఖంగా నేర్చుకోవాలంటారు. మరి సైకిలు విద్యకు ఆ శాస్త్రమేమీ లేదట. కారు డ్రైవింగుకు శాస్త్రం, నియమం ఉన్నట్టు సైకిలుకు ఏమీ లేదంటున్నారు- సైకిలువేత్తలు

"పట్టాను, ఎక్కాను, పెడల్ తొక్కాను; సర్రుమని ముందుకు పోయింది, అంతే." అని ఒకడంటే "నాకు ఒక్కగంటలో వచ్చేసింది ఈ సైకిల్ సవారీ." అంటాడు ఇంకొకడు. "నా సైకిలు మీద మా అబ్బాయి అయిదేళ్ళవాడు పరుగెడతాడు" అని మరొకడు. "సైకిలుకేముందిరా,మనం తాకితేచాలు,మంత్రించినట్టు పరుగెత్తుతుంది." అంటాడు ఇంకో ప్రజ్ఞావంతుడు.

సైకిలు వీరులు ఇలాంటి మాటలు చెప్పగా చాలా చాలా విన్నాను. అటువంటప్పుడు "నాకు కాస్త సైకిలు నేర్పుతావా?" అని ఒకళ్ళని అడగడమంటే ఎంత సిగ్గు!

ఒకనాడు ఫ్యాన్ రాముడు మా ఇంట్లో సైకిలుపెట్టి భోజనానికి కాబోలు - పోయాడు. ఆ వేళ ఆదివారం. అతగాడి భోజనం నిద్ర అయి తిరిగి వచ్చేటప్పటికి సాయంత్రం నాలుగు గంటలయినా అవుతుందని నాకు తెలుసు.

ఇంటిముందు నిలబెట్టివుంచిన సైకిలును ఒకే చేతితోపట్టి ముందుకు తోశాను. అదే మొదటితూరి నేను సైకిలు తాకటం . కాళ్ళురాని శిశువులాగా సైకిలు దిబ్బున కింద పడింది. దానిమైన నేనూ బోర్లపడ్డాను.

దీనికి జీవం ఉందా ? బుద్ధిబలం ఉందా ? కొత్తమనిషి తాకినాడని సిగ్గు పడుతుందా ? లేదా మొండితనం చేస్తూందా ? ఏమీ అర్థంకాలేదు.

లేచిచూశాను. దానికేమీ దెబ్బ తగల్లేదు. నాకూ అట్టే ఏమీ కాలేదు. ఏదో వున్నా భయపడితే ఎలా ?

ధైర్యమే తోడు, "జై హనుమాన్" అంటూ దాన్ని పైకి ఎత్తి నిలబెట్టేను. నిలిస్తేగా? నడుం సత్తువలేని ముసిలాడి లాగా అటూ ఇటూ పడబోయింది. హాయ్యో! దాని అబలాత్వం చూసి నాకు నవ్వొచ్చింది కూడా. ఏమైనా సరేనని చెంగుపట్టి లాగేశాను కదా; ఇక తెగింపే

దాన్ని బలంగా ముందుకు నెట్టుతూ హనుమంతుడిలా ఎగిరి సీటుపై గురిగా నడుంపుంచాను. తర్వాత ఏం జరిగిందో యేమిటో సైకిలు ముందుకు పరుగెత్తటం, నేను వెనుక్కి లాగటం, అది పక్కకి వాలటం, నేను పల్లంలో పడటం, సైకిలు కూడా దొర్లిదొర్లి ఇంకోచోట పడుకోవటం-అన్నీ గబగబా జరిగాయి. ఈ సందడికి రామూ నిద్రలేచి వచ్చేశాడు.

ఇప్పుడు రాముడికి అసలు సంగతి తెలిసిపోయింది ముఖంఎత్తి వాణ్ణి చూడలేక పోయాను. సైకిలు కూడా కొంచెం రిపేరిలో పడింది. అయినా ఏదో సర్దిపుచ్చి వాడికిచ్చేశానను కోండి.

"చ ఛ, ఈ రోజుల్లో సైకిలు రాదంటే చాలా సిగ్గుచేటు మేష్టారూ. ఉండండి. మీకు నేను క్షణంలో నేర్పుతాను." అన్నాడువాడు. "వద్దులే. దేవుడిచ్చిన కాళ్ళుండగా సైకిలు దేనికి రామూ? సైకిలు సవారికైనా కాళ్ళు ఉపయోగించక తప్పదుమరి. దీనివల్ల గుండెజబ్బు వస్తుందని డాక్టర్లంటూ నాయె'' అన్నాన్నేను

''అవన్నీ ఉత్తమాటలండీ. ఆ మాటకొస్తే ఏది చెడ్డది-కానిది? మీరే చెప్పండి. మనలాంటివాళ్ళకు కాదు ఆ మాటలు. సమయానికి సైకిలు ఎంత ఉపయోగపడుతుందో! ఒక గంటలో మీకు నేర్పితే సరికద?"

రాము నన్ను విడువలేదు. ఆవేళ రాత్రి వెన్నెల్లో మైదానానికి వెళ్ళాం. ఒకే వేలుతో సైకిల్ను నెట్టుకుపోతున్న రాముడి నేర్పు చూసి ఆశ్చర్యపోయాను. వాడు నన్ను సైకిలుపై కూర్చోబెట్టి, ''ఇలా తొక్కండి హేండిల్ వదులుగా పట్టుకోండి. ముందుకు చూడండి" అంటూ నాకు చెప్పి చెప్పి నానా యాతనపడి చెమటకారిపోయాడు. ఒక గంట కాదు, మూడు గంటలు కాదు, మూడు రోజులైనా నాకు సైకిలు లొంగలేదు. ''మేష్టారూ, ఇది చెబితే వచ్చే విద్య కాదండీ. స్వతహా మీకే ఆసక్తి ఉంటేనే వస్తుంది." అనేసి రాముడు నన్ను వదులుకొన్నాడు.

ఇలా సైకిలుకూ నాకూ దూరమైపోయినా, ఈ మూలకంగా రాముడు నాకు చాలా దగ్గరైనాడు. అప్పటి

ంచీ వాడు నాతో అంతో ఇంతో డబ్బు బదిలీ వ్యవహారానికి దిగాడు కడాన రాముడు నాకు ముప్పై రూపాయిలదాకా ఇవ్వవలసితేలాడు.

అంతలో వాడి కేదో గట్టిఅవసరం వచ్చిపడింది వాడు ఆ ఊరే వదలి దూరం పోవలసినస్థితి ఏర్పడింది పోతే వాడికున్న సొత్తల్లా ఆ సైకిలొక్కటే అందు చేత వాడు ఆ సైకిలు తెచ్చి నా ముందు పెట్టి, "మేష్టారూ, మీకు నేను ముప్పై రూపాయలివ్వాలి కదా? ఇది మంచి జర్మన్ రావెట్ సైకిలు దొంగాడి చేతికిచ్చినా నూరు రూపాయలొస్తాయి మీరు దీన్ని తీసుకొని పైన నాకో ముప్పైరూపాయ లివ్వండి చాలు" అన్నాడు

అలాగే చేశాను ఇలా ముందు నేనొక సైకిలుకు యజమానినైనా అప్పుడు సహజంగానే నాకు పట్టుదల పుట్టుకొచ్చింది రాత్రంతా వెన్నెల మైదానంలో నేను సైకిలుతో యుద్ధం చేయ నారంభించా నన్నమాట అదేం మాయో తెలీదు సైకిలు సవారి దానంతటదే వచ్చేసింది-ఎవళ్లూ నేర్పకుండానే! ఉత్సాహంతో జోరుగా ఇంటికి వస్తూంటే, గేటుదగ్గిర టర్నింగులో నేనూ నా సైకిలూ పల్లంలో పడ్డాం నాకేం దెబ్బతగల్లేదనుకోండి, కాని సైకిలుమట్టుకు అష్టవంకరలుగా తిరిగిపోయింది హేండిల్ వంగింది, పెడల్ విరిగింది, ఛైను కత్తిరించుకు పోయింది, స్పోక్స్ ఊడివచ్చాయి ఒక చక్రం వంగింది, మడ్ గార్డ్ గుద్దుకుపోయింది, బెల్లు ఎగిరి ఎక్కడో పడింది ఇంతెందుకూ, మొత్తం సైకిలే మరణశయ్యలో పడింది నా సరదా చచ్చింది రెండోవాడి చేతిలో భ్రష్టురాలైన పతివ్రత ఆత్మహత్య చేసుకుంది!

ఆశవాన్ని మోసుకుపోయి ఒక సైకిల్ షాపులో పడేశాను దానికి షాపువాడు ఇరవై రూపాయలిచ్చాడు ఆ డబ్బు పూటబత్తెంకింద ఆ షాపువాడికే అందించి, అద్దె సైకిలు తీసుకొని సైకిలు సవారీలో మంచి నిపుణత్వం సంపాదించుకొన్నాను కాని సొంతసైకిలు లేదు ఇంకెప్పుడు కొంటానో? కొనగానే మీ అందరికీ కొత్త సైకిల్ మీదనే వస్తానుగా! ★

---

## సినిమా క్విజ్ - జవాబులు

1 పదండి ముందుకు. 2. ఎదురీత.

# డుంబు

## మా వాడే మంచివాడు

రచన, బొమ్మలు

**బుజ్జాయి**
















అక్కరకు రాని చుట్టము.
అన్నీ యిలాంటి నీతి పద్యాలే!


మా డుంబూగాడు లొంటివెన్నో చెప్తాడు - గుక్కతిప్పుకోకుండా అన్నీ శతకం పద్యాలే - రాగవరసని!


ఏదుండీ! మీ డుంబూ!


మా సొంబూ చేతిలో ఏదుంటే అది అడిగిన వాళ్ళకిచ్చేస్తాడు-


మా డుంబూ రోజూ ఓ బిస్కట్టు పేకట్టు పట్టుకు పోవడం - అది నలుగురికీ పంచిపెట్టి ఖాళీ చేసుకుని రావడం!


మా వాడు - మా వాడు
ఢాం! ఢాం!


వాళ్ళిద్దరూ కులాసాగా ఆడుకుంటున్నారు. తినడానికేదో ఇచ్చేసి వచ్చా!


అంతలో ——
అదేంటి మా సాంబూ ఏడుస్తున్నట్లున్నాడు!


ఏమిట్రా! ఏం జరిగింది?
వాడి బిస్కట్లు అవి పోయాయని ఏడుస్తున్నాడు


తినేస్తే అవి పోవుల్రా! ఏడుస్తారా!
నేను తినలేదు, ఆ రమణగాడు నా బిస్కట్లు లాక్కుని ముందు తినేశాడు!


ఫరవాలేదులెండి! మేం వెళ్ళొస్తాం రారా, సాంబూ!
ఇలాగే రాంబాబు, శీనయ్య బిస్కట్లు పంచి పెట్టాడని చెప్పారు!


ఓరి పిచ్చిగాడిదా! ఎంతో పొగిడితే వాళ్ళు వస్తార!
ఎప్పుడూ పిల్లల్ని పొగడకూడదట, నాన్నా! మేస్టారు చెప్పారు!



# యువతీలోకం



## ప్రేమ వివాహాలు

## భగ్నమౌతున్నాయా?

ప్రేమ వివాహాలు భగ్నమౌతున్నాయి అంటున్నారు. కాదని ఎవరేనా అంటే నిదర్శనాలంటూ చూపిస్తున్నారు ఫలానా అమ్మాయి, అబ్బాయి కళాశాలలో చదువుతూవుండగా ప్రేమించి పెండ్లి చేసికొన్నారు. ఆ తరువాత ఆరు నెలలకే విడిపోయారు. ఆ అబ్బాయి మరెవ్వరినో పునర్వివాహం చేసుకొన్నాడు లాంటి కొన్ని దృష్టాంతరాలను చూపి, ప్రేమ వివాహాలు అనర్ధదాయకాలంటూ నిరూపిస్తున్నారు ఈ ఉదాహరణలను, నిదర్శనాలను చూచాక వాళ్ళ వాదనను అంత తేలికగా త్రోసివేయటం తేలిక కాదేమో అనిపిస్తోంది కాని ఈ విషయాన్ని క్షుణ్ణంగా పరిశీలించి, దీనిలోని సత్యాసత్యాలను నిర్ణయిస్తే 'ప్రేమ వివాహాలు భగ్నమౌతున్నాయి అనే నినాదం కేవలం ఉపపత్తిలేని సిద్ధాంతంలా కన్పిస్తోంది

ఈ నినాదం పుట్టటానికి కారణం లేక పోలేదు. ఈ స్థితి ఏర్పడటానికి కారణం ప్రేమవివాహాలు కానివాటిని ప్రేమ వివాహాలని పిలిచి, అవి విచ్ఛిన్నమై పోగానే, ఆ కళంకం కొన్ని ఈ ప్రేమ-వివాహాలకు అంటగట్టటంవలన ఏర్పడిన దౌర్భాగ్యమే ప్రేమకు బహువిధాలైన నిర్వచనాలున్నాయి సరిగా ఆలోచిస్తే సరైన - నిర్వచనాన్ని అక్షరరూపంలో ఇవ్వలేమేమో అనిపిస్తుంది

నేడు ప్రేమ వివాహాలని పిలవబడుతున్న వివాహాలలో నూటికి 90-95 పాళ్లు ప్రేమ వివాహాలుకావు కేవలం యువతీ, యువకుల - వారి మధ్య వయోప్రవృత్తిచే కలుగుచున్న ఆకర్షణ వారి మానసిక పరిధులు సరైన కొలతలలో వృద్ధి పొందక పోవటంవలన ఏర్పడుతోన్న విచారకరమైన సంఘటనలకు మనవారు- ప్రేమ వివాహాలని పేరు పెడుతున్నారు

---

శ్రీమతి జి సరోజా యాజ్ఞవల్క్యా

---

కేవలం ఆకర్ష... లైంగికమైన వాంఛ... ప్రలో... క్షణికోద్రేకంలో నేటి యువతీ యువకులు, నిమిషాలమేరలో నిర్ణయాలను తీసుకొని ఆ నిర్ణయాలను 'ప్రేమ' అనే పెద్దపేరుతో పిలుచుకొంటున్నారు.

అందు వలననే, ఈ 'ప్రేమ' అనే భావం ప్రస్తుతస్థితిలో 'భావముద్రారాక్షస' మౌతోంది ప్రేమించి పెండ్లి చేసుకొన్నా మనే, ఈవివాహాలు భగ్నమౌతున్నాయి. నీటిబుడగల్లా చిట్లి అదృశ్య మౌ తున్నాయి స్త్రీ, పురుషుల సౌందర్యపు టాకర్షణే, వివాహానికి కారణమైతే, ఆ వివాహం విచ్ఛిత్తిచెందితే ఆశ్చర్య పడవలసిన పనిలేదు

సౌందర్యం శాశ్వతంకాదు
ఆకర్షణ స్థిత మైనదికాదు

ఈ ప్రేమవివాహాలను గురించి వింటుంటే ఆశ్చర్యమేస్తుంది. బస్సులో సీటుదొరకని అమ్మాయికి తాను లేచి సీటుయిచ్చిన అబ్బాయిని క్రీగంట చూచి అతని రింగులముంగురులపై మోజు పెంచుకొన్న అమ్మాయి, ఆ అమ్మాయి ధరించిన చోళీచూచి ముగ్ధుడైన అబ్బాయి మరునాటి ప్రొద్దుటి పోష్టులో జాబులు వ్రాసుకొని వారంరోజులు తిరగకముందే, వివాహానికి సిద్ధమౌతున్నారు ఈ ప్రేమ మూడునెలల తరువాత వాళ్ళిద్దరు ఎవరి దారి వారు చూచుకొనడంతో అంతమవు తోంది. దేనిని చూచి వీళ్ళు ప్రేమించు కొంది? అబ్బాయి ముంగురులు, అమ్మాయి ఛోళీ — ఈ రెండూ - మార్కెట్‌లోనికి సరిక్రొత్త ఫ్యాషన్ దిగుమతి కాగానే, పాతవవుతాయి

దీనిని ప్రేమ అనేకంటే ఈ సృష్టిలో ప్రేమ లేదనుకొంటే కొంత మనశ్శాంతి వుంటుందేమో . ...

ఇలాగే మరో ఉదాహరణ — ఓ అమ్మాయి, అబ్బాయి ప్రేమించు కొన్నారట వారి తల్లిదండ్రులు ప్రేమ వివాహంపట్ల బోలెడు సానుభూతి కలవా రవటంతో, ముహూర్తాలుపెట్టి పెండ్లికి సిద్ధమయ్యారు. పెండ్లి వారు తరలి వచ్చారు. పెండ్లికొడుకు ఆ తరువాత బండిలో మిత్రులతో వస్తాడట తీరా ముహూర్తంవేళకు, కబురు వచ్చింది తనకా పిల్ల ఇష్టంలేదని

ప్రేమించుకొన్నా మనుకొన్న మరో జంట వింత ఉదంతం — ఒక అమ్మాయి పెండ్లినాడు, పెండ్లికొడుకు కాని మరో అబ్బాయి పెట్టె బెడ్డింగుతో దిగాడు. దిగుతూనే ఈ పెండ్లి జరగటానికి వీలు లేదు, ఆ అమ్మాయి, నేను ప్రేమించు కొన్నాం, పెళ్ళి చేసుకొందా మను కొన్నాం, అంటూ కొన్నిజాబులు వాళ్ళ కళాశాల జీవితంలో వ్రాసుకొన్నవి చూపించాడు అవి వారి ప్రేమజీవితానికి ప్రతిబింబాలే అయితే, ఆ అమ్మాయి,

ఈ క్రొత్త సంబంధానికి ఎలా వప్పుకొన్నదో...? చివరి కెలాగైతేనేం, ఆ ప్రేమికుడికి కొంతసొమ్ము ముట్టజెప్పి అతగానినుండి ఆ జాబులన్నీ తీసికొని. అతను వెళ్ళవలసిన ఊరికి సెకండుక్లాసు టిక్కెటుకొని ఇవ్వడంతో రాద్ధాతం ముగిసి పోయింది

ఇవన్నీ జరిగిన సంఘటనలే ఇలాంటివి మనం వింటే కోకొల్లలు వీటన్నింటినీ 'ప్రేమ–ప్రేమవివాహాలు,' అని పిలుస్తున్నారు. వీరింత దుర్బలులేమా...అనిపిస్తుంది ఇంతటి చిన్న హృదయాలను భగవంతుడు ఎందుకు సృష్టించాడో అర్థంకాదు.

ఇవి ప్రేమ వివాహాలుకావు వాటిని ఆ పేరుతో పిలిచి ఆత్మవంచన చేసుకొంటున్నాము.

ఇలాంటి వివాహాలైనా ఎందుకు విఫలమౌతున్నాయో పరిశీలిద్దాం – ముఖ్యంగా ఈ వివాహాల విచ్ఛిత్తి, వివాహానంతరం స్త్రీ, పురుషుల అభిరుచులు ఒకరివి మరొకరికి నచ్చక, వారు ఆకర్షణా ప్రలోభానికి లోనై, ఊహించిన మధుర స్వప్నాలు, నిజజీవితంలో కల్లలని తెలిసికొనటంతో సంభవిస్తోంది వివాహమయ్యాక కొంతకాలం సజావుగా నే సాగిపోతుంది ఆ తరువాత వారికి ఈ నూతన జీవితం అలవాటుపడిపోతుంది వారి మధుర స్వప్నాల జీవితం, పాతదై, నిజమైన జీవితం. ప్రక నిజస్వరూప జీవితం మిగుల్తుంది. సర్వసామాన్యంగా ఇలాంటి వివాహాలు, పెద్దలఅభిప్రాయాలకు వ్యతిరేకమైన వవ్వటంతో – ఆర్థికప్రభావం వీరిపై పడుతుంది. అంతటివరకు అడుగునపడి వున్న వారి వారి భిన్న ప్రవృత్తులు పైకి వస్తాయి అభిప్రాయ భేదాలు, అభిజాత్యత్వం, ఒకరి అభిరుచులు మరొకరికి వెగటుగా తోచటం, విసువు కలుగుతాయి, వారు దూరమౌతారు.

ఇది హేతువాదమైన సిద్ధాంతంకాదు. నిత్యసత్యం

ఇలా జరగడానికి కారణం, వారు ప్రేమించుకొన్నామనుకొనటం కేవలం భ్రమాభూతమైన దగుటవలన క్షణాలలో నిర్ణయాలను తీసికొంటున్న, ఈ ప్రేమ జీవులు ఒకరి నొకరు ఏమి అర్థం చేసికొన్నారని, ఒకరి నొకరు ఏమి తరచి చూచారని. వారిలో, అతి పవిత్రమైన 'ప్రేమ' ఉద్భవించిందనుకోగలం...?

ప్రేమ ఆకర్షణకు, ప్రలోభానికి, వాంఛకు, ప్రతిఫలానికి, స్వార్థానికి అతీతమైనది అలాంటి ప్రేమను, ఉద్రేకానికి ఆవేశానికి, జంటచేసి రూపకల్పన చేయడం ఆత్మవంచన. ప్రేమకు విఫలత, విచ్ఛిత్తివుండదు, ప్రేమ చావు పుట్టుకలు క్షణకాలపరిమితిలో జరిగిపోవు.

నే నెరిగిన ప్రేమవివాహాన్ని గూర్చి ఒక్క ఉదాహరణ చెపుతాను

ఢిల్లీలో మేముండేభాగం ప్రక్కన ఒక మహారాష్ట్రపు వ్యక్తి వున్నాడు ఆయన సెంట్రల్ సెక్రెటరియేట్ లో హోదాగల వ్యక్తి ఆయన బొంబాయి దగ్గర తమ గ్రామంలో, దూరబంధువుల అమ్మాయిని ప్రేమించాడట పెండ్లి చేసుకుంటానని మాట ఇచ్చాడు ఆ తరువాత ఇతగాని హోదా పెరిగింది అందువలన తల్లిదండ్రులు ఆ పిల్లను చేసికొనవద్దని పట్టుపట్టారు ఇలావుండగా ఒక రోజు ఆ పల్లెనుండి జాబురావడంతో వెళ్లిపోయాడాయన. తరువాత నెలరోజులకు తిరిగి వచ్చాడు ఆ పిల్లను పెండ్లిచేసుకొని నేనూ చూడటానికి వెళ్ళాను ఆ అమ్మాయి చేతికి కట్టు కట్టబడి వుంది వివరాలు ఆ తరువాత తెలిశాయి నెల రోజులక్రితం ఏదో ప్రమాదంలో ఆ అమ్మాయి చేయి విరిగిపోయింది హాస్పటల్లో మోచేతివరకూ చేతిని తీసివేశారు శాశ్వతంగా అవిటిదయిపోయింది. అవిటిజీవితమై పోయిందని దుఃఖించిన ఆమెకు ధైర్యం చెప్పి, వెంటనే వివాహం చేసికొని వచ్చాడు

ప్రేమకు గర్వాన్ని తెచ్చాడాయన

ఈ విషయం తలపుకొస్తే ప్రేమకు నిర్వచనం దొరికినట్లనిపిస్తుంది గతంలోకి వెళ్ళిచూచినా ప్రేమవివాహాలు భగ్నమైనట్లు అనిపించదు. సుభద్ర అ[illegible] [illegible]పట్టబికారి అయినా దర్జనుడు అలాగే, తండ్రికి పరమ శత్రువు అనిరుద్ధుడు 'ఉష' కంటకావృతమైన ప్రేమజీవితాన్నే వలచింది అవన్నీ కధలని మనం కొట్టివేయవచ్చు కాని అవి చాటుతున్న లోకోత్తరమైన సిద్ధాంతాలను మనం స్వీకరింపవచ్చుగా.

అయినా ప్రేమవివాహాలు భగ్నమౌతాయనటం హాస్యాస్పదం ప్రేమ పవిత్రమైనది. పునీతమైనది అజరామరమైనది. అలాంటి ప్రేమకు విచ్ఛిత్తి, నాశము వుండవు

నిప్పుకు చెద అంటదు

కరుణలో క్రౌర్యముండదు.

ఇంతకూ నా అభిప్రాయ మేమిటంటే ప్రేమవివాహాలు భగ్నమవ్వటంలేదు. అవ్వవు నేడు ప్రేమ వివాహాలని మూకవుమ్మడిగా పిలువబడుతోన్న వివాహాలలో నూటికి ఏ 5, 6 పాళ్ళో, ప్రేమ వివాహాలు, తతిమావన్నీ, యువతీ యువకుల వయోధర్మంచే ఏర్పడుతోన్న ఆకర్షణా ప్రలోభాల ప్రతిబింబాలే అవి విచ్ఛితి పొందుతున్నాయి. వాటినాధారంగా తీసికొని ప్రేమవివాహాలు విచ్ఛితి పొందుతున్నాయనే నినాదం బహుళ వ్యాప్తిని పొందుతోంది.

ఈ భావం కేవలం భావముద్రారాక్షసం



# అయ్యో: ఆడపిల్ల

"బిడ్డ పుట్టింది!"

"ఏ బిడ్డ? మగా — ఆడా?"

"ఆడబిడ్డ"

"అయితే అది నీ ఖర్మ అనుభవించక తప్పదు"

"అదేమిటి? లేకలేక బిడ్డ కలిగితే ఖర్మగిర్మంటావ్? నీకు పిచ్చా?"

"కోప్పడకు నాయనా! బిడ్డలు లేని బాధకన్నా — ఆడబిడ్డ కలిగిన తరువాత కలిగే బాధ అంతాయింతాకాదు అందుకే నేనలా అన్నాను నేనేకాదు అది జగమెరిగిన సత్యం! అయినా ఆచరణలో నువ్వే చూస్తావుగా"

ఇదీ ఆడబిడ్డ తండ్రికీ, ఎదురైన పెద్దమనిషికీ మధ్య జరిగిన సంభాషణ

పాపం ఆ బిడ్డ తండ్రికి ఎదుటివాని మాటలు అర్థంకాక అయోమయంగా అతని ముఖంలోకి సూటిగా చూశాడు కాని ఆవ్యక్తి వెకిలినవ్వుతో చరచరా వెళ్ళిపోయాడు బిడ్డన్నప్పుడు ఏ బిడ్డయితే నేమి? 'ఆడ — మగ'ల మధ్య వ్యత్యాసానికి కారణమేంటి? మానవ మాత్రులుగా — జీవితంలో యిద్దరూ సరిసమానమైనవారు అయితే యుగాలుగా శతాబ్దాలుగా వస్తున్న ఆచారం ప్రకారం వారిపనుల్లో మార్పు కలిగింది. రాను రాను ఆడది కేవలం మగవానికి బానిసలా, భర్తకు సేవకురాలుగా, అన్నిటికంటే ప్రధానంగా పిల్లలు కనే యంత్రంలా మారిపోయింది. అది రానురాను సమాజ సంప్రదాయ మయ్యింది. కాదంటే కట్టుబాటనే నెపంతో కఠిన శిక్ష ఈ విధంగా స్త్రీ జీవితం బానిస బ్రతుకులా పరివర్తన చెందింది

'పెరుగుట విరుగుటకొరకె'నన్నట్లు మితిమీరిపోయిన సంప్రదాయాలు, కట్టుబాట్లు, సడలిపోయేరోజు రానేవచ్చింది, దానికై అనేక వుద్యమాలు వెలిశాయి మహానుభావు లెందరో కృషి చేశారు అందుకు ఫలితం ఈనాడు స్త్రీ జాతికి వెలుగు బాట గోచరిస్తుంది

కానీ, మాటలు మారినా మనసు మార

శ్రీమతి కె. పి. సావిత్రీ రెడ్డి





5. బొమ్మలకే ప్రాణాలొస్తే

# దొడ్డమ్మ



జాబుచదివి లలిత నిరాశచెందింది ఊరినుండి తల్లిరాసిన జాబులో 'దొడ్డమ్మ'ను గురించి ఒక ముక్క మాత్రమే ఉంది అదీ ఏమంత బాగాలేదు.

"ప్రతి జాబులోనూ దొడ్డమ్మ దొడ్డమ్మ అని ఎందుకు రాస్తావు లలితా ? ముసలి దాన్ని గురించి చిన్నపిల్లలు ఎక్కువగా పట్టించుకోకూడదు నీ దొడ్డమ్మ క్షేమానికి ఏమీ వచ్చిపడలేదు. కూర్చుని తినడం ఇరుగు పొరుగులతో ఊసులు చెప్పడం కన్న మరేముంటుంది పని," ఈ విధంగా తల్లిరాయించిన జాబులోని మాట చదివే టప్పుడు లలిత హృదయం చలించి పోయింది.

వయసులో అందరికన్నా పెద్దదయిన దొడ్డమ్మకు తనతల్లి చూపించే గౌరవం ఇదేనా ? దొడ్డమ్మకు కొంచెం కూడా వ్యక్తిత్వంలేదా ? ముసలిది

యం. రంగారావు

అన్నమాత్రాన ఇంత తాత్సారమా? వయసు మళ్ళిన వాళ్ళు తోంచేస్తూ కూర్చుంటే దానికోసం ఇలా హీనంగా రాయడమా?

లలితకు పెళ్ళిఅయి భర్త దగ్గరకు వచ్చిన తర్వాత దొడ్డమ్మతో ఎడబాటు కలిగి ఒక సంవత్సరం అయింది. అప్పటి నుంచీ లలిత తల్లికి రాస్తున్న ప్రతిజాబు లోనూ దొడ్డమ్మను గురించి రాస్తూనే వుంది. కాని ఊరినుండీ వచ్చే ప్రతీ ఉత్తరంలో దొడ్డమ్మను గురించి ఒక ముక్క కూడా వుండదు. "దొడ్డమ్మ క్షేమసమాచారం రాయకపోతే నాకు జాబు రాయనేవద్దు" అని ఖచ్చితంగా లలిత జాబు రాసినాక వచ్చిన జాబిది. దీన్ని చదవగా తన తలిదండ్రులు దొడ్డమ్మను ఎలా నడుపుతున్నారో ఒక విధంగా తెలిసినట్లయింది

ఇలా జరగవచ్చునన్న సందేహం పెళ్ళికిముందే కలిగింది లలితకు అప్పటికే ఇంటిలో దొడ్డమ్మ అధికారంలో లోటు రాసాగింది. తన తండ్రీ తల్లీ దొడ్డమ్మకు ఎదురుతిరుగ నారంభించినారు అలా జరిగినప్పుడు దొడ్డమ్మ తనకు జరిగిన పరాభవానికి నొచ్చుకొని లలితతో చెప్పుకొని ఏడిచిందికూడా. ఆ సంగతి ఇప్పుడు జ్ఞాపకం వచ్చింది లలితకు



దొడ్డమ్మకూ లలిత కూ అంత అన్యోన్యం ఉండేది లలిత దృష్టిలో తల్లికన్నా దొడ్డమ్మే గొప్ప. "చూశావా లలితా, మీ అమ్మ మాటవిని నాన్నకూడా నన్ను ఎలా తిట్టాడో? వీడు కుర్రాడుగా ఉండేటప్పుడు 'పిన్నమ్మా పిన్నమ్మా' అంటూ నాపైనే ప్రాణాలన్నీ పెట్టుకొని ఉండేవాడు. నీకు నాపైన ఎంత ఇదిగావుందో వాడికీ అలాగే. కాని ఇప్పుడు...?'' అనే సరికి మాటరాక గొంతుపట్టుకు పోయేది దొడ్డమ్మకు "ఉం, ముసలిదాన్నైనకొద్దీ ఎవరికొక్కావాలి ఈ ఘటం? నేల వూడ్చిన దుమ్ములాగా మూలనిపడి వుండే ఈ బాధ కన్నా చస్తేనే బాగుణ్ణు. కాని దేవుడు నాకెంత ఆయుస్సుపోశాడో, కుళ్ళిపోయేదాకానూ!'' అనేసరికి దొడ్డమ్మ కళ్ళలో నీళ్ళు కనిపించి వెంటనే అణిగిపోతాయి ఆడాళ్ళ కన్నీళ్ళు నేలపై పడకూడదంటూ దుఃఖాన్ని దిగమింగుకొంటుంది

''నాకెవరున్నారు? పిల్లా జెల్లా? ఉం, పిల్లలయితే మాత్రం బాగా చూస్తారనా ముసలిదాన్ని? పిల్లలు మంచివారైతే సరిపోయే, లేకపోతే కన్నతల్లిని కూడా ఇంటినుండి తరమగొడ్తారు పేరయ్యకు నేను కన్నతల్లినికూడా కాదుమరి. తల్లి అనేది కడుపులో వున్నంతకాలం పెట్టుకొంటాడు. తరువాత పొమ్మంటే పోవలసిందేగా!" అని ఇంకోసారంది దొడ్డమ్మ.

తను "నన్నే మీ కూతురనుకొండి దొడ్డమ్మగారూ? నాతో రండి'' అని పిలిచింది. "నీతో ఎలారాను లలితా? నీ భర్త పరాయివాడుకదూ? అదీగాక నా చేతుల్లోనే పెరిగి పెద్దయిన పేరయ్యను వదిలి నేను ఉండగలననుకొన్నావా? పేరయ్యకు కూడా చెడ్డపేరు రాదూ? కన్నపాశంకన్నా పెంచినపాశం పెద్దది కాదుటే!" అంటుంది

నిజమే. లలిత తండ్రి పేరయ్య. వాడి పిన్నమ్మైన ఈ దొడ్డమ్మ చేతుల్లోనే పెరిగాడు అంటే దొడ్డమ్మ నిజంగా లలితకు దొడ్డమ్మకాదు, నాన్నమ్మ. కాని అందరికీ, ఊరువాళ్ళకు కూడా ఆవిడ దొడ్డమ్మగానే పేరుకెక్కింది ఈ అలవాటుకొద్దీ లలితకూడా ఆమెను దొడ్డమ్మ అనే పిలవడం మామూలయింది దొడ్డమ్మకు పిల్లాజెల్లాలేరు. చిన్నతనంలోనే ఆవిడకు వైధవ్యం కలిగింది గతిలేనిదై అక్క ఇల్లు చేరుకొంది.

ఆ అక్కకూడా పేరయ్యను కని చచ్చిపోయింది మరికొన్ని రోజుల్లో పేరయ్య తండ్రీ గతించాడు. ఈ పిన్నమ్మే వాడికి తండ్రీ తల్లీ కూడా. పిన్నమ్మ ఎంతో గారాబంతో పేరయ్యను పెంచి పెద్ద చేసింది. చదువు చెప్పించి పెళ్ళికూడ చేసింది పార్వతి కోడలై వచ్చింది ఆ పిన్నమ్మే దొడ్డమ్మై పార్వతికి అత్తగా

రైంది ఏమీతెలియని కోడలిని తగిన గృహిణిగా తయారు చేయడానికి దొడ్డమ్మ చాలా శ్రమపడింది ఫలితంగా అత్త మహాచెడ్డ దన్న పేరువచ్చింది అప్పు డింకా పార్వతికి నోరుతెరచి అత్తను ఎదిరించటానికి ధైర్యం రాలేదు. ఎందు కంటే కోడలిపై అత్తకు ఎంతో ప్రేమ పార్వతికి తలదువ్వి జడఅల్లి పూలుపెట్టి చాలా ముద్దుచేస్తూ వుండేది .....

* * *

ఇవన్నీ పాత కథలు, లలిత పుట్టిన రోజులనాటివి అప్పుడు దొడ్డమ్మదే పెద్దరికం పొలాలరాబడి సరిగావుందా లేదా అని చూడడం, రైతులను అదు పులో ఉంచుకొని పనిచేయించడం, మూడు ఆవులు, రెండు గేదెలు పెట్టు కొని స్వయంగా కష్టపడి పేరయ్యకు ఎంత ఆదాయం చేకూర్చింది ఈదొడ్డమ్మ? దొడ్డమ్మ పలుకుబడి అంతలేకపోతే తల్లీ తండ్రీ లేని పేరయ్య ఈపాటికి దిక్కులేనివాడుగా వుండవలసింది! "నా పిన్నమ్మ వున్నవరకు నాకేలోటూ రాదు" అని పేరయ్య ఎన్నోసార్లు నోరారా అన్నాడు

పేరయ్యకు లలిత రెండవసంతానం లలితకుముందు ఒక కుర్రవాడు పుట్టాడు వీళ్ళ కాన్పులు చూసిందంతా దొడ్డమ్మే లలిత దొడ్డమ్మ చేతిలోనే పెరిగింది కాబట్టే తల్లికన్నా దొడ్డమ్మంటే లలితకు చాలా మక్కువ

ఇలా మంచిస్థితికి తెచ్చి నిలబెట్టిన కుటుంబాన్ని మెల్లిమెల్లిగా దొడ్డమ్మ చేతినుండి పేరయ్య లోపుచేసుకొన్నాడు దాంతో తన స్వంత చాకచక్యాన్ని చేర్చాడు రెండవమహాయుద్ధం రాగానే వ్యాపారం ప్రారంభించాడు వ్యవ సాయంతోబాటు వ్యాపారంకూడా బాగా కలిసివచ్చింది. లాభాలపై లాభాలు గుంజాడు చిన్నఇల్లుపోయి మిద్దిల్లు లేచింది డబ్బురుచి బాగా తగిలింది. ఇంట్లో వాళ్ళందరికీ బాగా పనికలిగింది- పేరయ్య ధర్మమా అని వ్యాపారం, వ్యవసాయం, ఆవులు, గేదెలు, ఎడ్లు వీటన్నిటికీ యజమాని అయి, పట్టి 'పేరిగాడు' 'పేరయ్యశాస్త్రిగారు'గా మారాడు.

ఈ పరిస్థితిలోనే లలితకు పెళ్ళ యింది దొడ్డమ్మ ముసలిదైంది ముందు ఇల్లంతకూ మొదటివ్యక్తిగావున్న దొడ్డమ్మ క్రమంగా రెండవ, మూడవ, నాలగవ మెట్టుకుదిగుతూ వచ్చింది. అత్తగారి కాలంపోయి కోడలి హయాం వచ్చింది

లలిత భర్తతో బయలుదేరేటప్పుడు దొడ్డమ్మకు కళ్ళంట నీళ్ళువచ్చాయి లలితకూడా కన్నీరుకార్చి "ఇక మీరు పనిచేయవద్దు దొడ్డమ్మా" అని చెప్పి తన

తల్లితో "దొడ్డమ్మకు ఏ పనీ చెప్పకు. బాగా విశ్రాంతి తీసుకోనీ" అన్నది ఈ మాట విన్న దొడ్డమ్మ నవ్వుతూ "పిచ్చి పిల్లా, ఊరికె కూర్చునే జన్మ కాదమ్మా ఇది. శక్తి వున్నంతలో ఏదో ఒకటి చేస్తూనే వుండాలి, లేకపోతే తోచదు.'' అన్నది.

ఈసారి పండక్కి కూతురూ, అల్లుడూ ఇంటికి రావాలని పేరయ్యా, పార్వతీ ఇద్దరూ కలిసి జాబురాశారు ఆ జాబు లోనే దొడ్డమ్మను గురించి పైన చెప్పిన విధంగావుంది. "నా క్షేమం గురించి దొడ్డమ్మ ఎంత ఆదుర్దాగా ఎదురు చూస్తూందో ? తల్లి ఏమీ చెప్పదు, నాన్న కూడా అంతే ఈసారి పండక్కిపోయి తిరిగివచ్చేటప్పుడు దొడ్డమ్మను ఇక్కడికే తీసుకురావాలి '' అని లలిత నిశ్చయించుకొన్నది ఇంకేం, దీనికి భర్త అనుమతికూడా దొరికింది ఇద్దరూ పండక్కి వస్తామని ప్రత్యుత్తరం రాశారు.

*　　*　　*

కాని, మనం ఒకటి తలిస్తే దైవ మొకటి చేసింది ఆఫీసునుండి వచ్చి విశ్వనాధుడు "ఉశ్, లలితా, ఒంట్లో బాగాలేదు తలనొప్పి హబ్బా '' అని మూలుగుతూ ఒళ్లువిరుచుకొన్నాడు మరునాడు జ్వరం తగిలింది ఆకలి తప్పింది వమనం, కడుపునొప్పిన్ని, డాక్టరు వచ్చాడు మందిచ్చాడు ఇంకెక్కడి పండగ ? ఊరుకుపోవడం జరిగే మాటకాదు ఈ స్థితంతా వివరించి తల్లికి జాబురాసింది లలిత ఆ జాబులోనే దొడ్డమ్మను గురించి తల్లికి కొన్ని 'మాటలు' కూడా రాసింది

విశ్వనాధుడికి జ్వరం వదల్లేదు టాయిదా (టైఫాయిడు) అన్నాడు డాక్టరు "జాగ్రత్తగా చూస్తూ వుండండి భయం లేదు" అని కూడా అన్నాడు డాక్టరు

మళ్ళీ తల్లినుండి జాబు వచ్చింది "ఏమిటి జబ్బు ? డాక్టరు ఏమన్నారు ? ఇప్పుడు ఎలా వుంది ' అని మామూలుగానే రాసి — "దొడ్డమ్మను గురించి నువ్వెందుకు ఇంత విచారిస్తున్నావు ? ఇప్పుడు అది మునపటి మోస్తరుగా లేదు వయస్సయినకొద్దీ దొంగతనం, పగ, కుళ్ళుమాటలు అన్నీ అలవాటయినవి దాన్నుండి మాకు వచ్చిన చిక్కులు ఉత్తరంలో రాయవలసిందికాదు ఇలా రాసింది తల్లి

నిజంగానే దొడ్డమ్మ ఇలా మారిందా? ఊహూ, అబద్ధం, వయస్సు అయినకొద్దీ బలహీనత ఎక్కువవుతోంది తనదని ఏదీ దాచిపెట్టుకోక అన్నీ కొడుకూ కోడళ్ళకే ధారపోసిందాయె వాళ్ళకోసమే నిధి కూడబెట్టి ఇచ్చిందాయె తల్లి అనుకొన్నట్టు పగలేంటా మెకు ? ఇలా జరుగుతుందని దొడ్డమ్మ ముందే అనుకుంది



"చూడండి, ఒక వెంట్రుక నెరిసింది!"
"అంతే, మీ నాన్న నీ వయసు దాచి నాకు చెప్పాడన్నమాట!"

అయినా పెంచిన పాశం వదలదు పడి వుంది పాపం! దొడ్డమ్మకు ఒక కొడుకో కూతురో ఉండి వుంటే ఇలా జరిగి వుండునా ?...

లలితకూ దొడ్డమ్మపై పెంచిన పాశం వున్నది ఆమె మనస్సు దొడ్డమ్మ చుట్టూ తిరుగుతున్నది యంత్రంలా భర్తకు సేవా శుశ్రూషలు చేస్తున్నా మనస్సంతా దొడ్డమ్మే ఆవరించింది ఆలోచన పెరిగి పెరిగి ఏవో భయంకర చిత్రాలు కనిపించ సాగాయి జ్వరంలోవున్న తన భర్త చని పోయాడు, తను గతిలేనిదైంది. వృద్ధు రాలయింది దొడ్డమ్మగతే తనకూ వచ్చింది తన తలిదండ్రులు అక్కడ దొడ్డమ్మకు బాధకలిగిస్తూంటే దాని ఫలం వాళ్ళ కూతురు అనుభవించాలేమో ! ..

లలిత ఒక నిశ్చయానికి వచ్చింది టెలిగ్రాం ఫారం తీసుకొని దాంట్లో ''పరిస్థితి అపాయం దొడ్డమ్మను తీసు కుని వెంటనే రండి,'' లలిత అని రాసి పనివాడి చేతికిచ్చి పంపించింది. దొడ్డమ్మ వచ్చి తన్ను ఆశీర్వదిస్తేగాని భర్తకు నయంకాదన్న పిచ్చినమ్మకం పట్టుకొంది లలితను. విశ్వనాధుడికీ చెప్పలేదు పిచ్చిపిల్ల !

* * *

మరునాటి రైల్లో తల్లిపార్వతీ, తండ్రి పేరయ్యా వచ్చేశారు వాళ్ళను చూస్తూనే "దొడ్డమ్మేదీ ?'' అనడిగింది లలిత.

''విశ్వం ఎలా వున్నాడు ?" అని ఎదురుప్రశ్న వేశాడు పేరయ్య

"ఏదీ, దొడ్డమ్మేదీ ?" మళ్ళీ అడిగింది లలిత.

"దొడ్డమ్మకేం, బాగానే వుందిలే విశ్వానికి ఎలా వుందమ్మా ?" అంటూ పేరయ్య లోపలికి వెళ్ళాడు.

"నీ ఆరోగ్యం బాగావుందా, లల్లూ ? డాక్టరు ఏమన్నారే" అంటూ పార్వతి కూతురి ఒళ్ళు తడిమింది

"నాకేమీ లేదు ఆయనకూ ఏమీ గాబరాలేదు నేను దొడ్డమ్మను తీసుకు రమ్మన్నానే ?"

పేరయ్య తిరిగి చూశాడు. పార్వతి అర్థగర్భితంగా వాడి ముఖం చూసింది.

"దొడ్డమ్మ దేనికమ్మా, ముసలి ముండ మేం వచ్చాంకద ?" అన్నాడు పేరయ్య.

"దొడ్డమ్మను వదిలేసి మీరిద్దరూ వచ్చారా, నా కేమైనా నిండిందా, పండిందా ?" కసిరింది లలిత

అప్పుడు, పడుకొనివున్న విశ్వం చెప్పాడు "దీనికి దొడ్డమ్మపిచ్చి బాగా పట్టింది మామగారూ నాకు వంట్లో బాధ ఏమీలేదు ఊరికనే టెలిగ్రాం ఇచ్చింది. నాతో చెప్పనైనాలేదు పోనీ, తర్వాత మాట్లాడుకుందాంలెండి కొంచెం విశ్రాంతి తీసుకోండి ''

దొడ్డమ్మ రాకపోవడంతో లలితకు ఏమీ తోచక, అయిష్టంగానే తలిదండ్రు లకు ఉపచారాలు చేసింది "పిచ్చిపిల్లా, ఊరికే ఇలా టెలిగ్రాం ఇవ్వచ్చా ? ఆ ముసలిదానికోసం ,'' అంది తల్లి.

"అది ముసలిదైన మాత్రాన ఇంత హీనంగా మాట్లాడవచ్చా ? ముసలాళ్లకు మనసు అని ఒకటి లేదనా ? ఏమైనా సరే, నా దొడ్డమ్మ వచ్చి ఆశీర్వదించాలి, నాకు సౌభాగ్యందక్కాలి'' అన్నది లలిత.

"అలా అనకే పిచ్చిపిచ్చిగా. ఎవరైనా వింటే నవ్విపోతారు."

"నవ్వినవాళ్ళ పళ్లు బంగారమైందిలే. నాకేం ? అసలు దొడ్డమ్మ ఎలావుందో చెప్పవేం ? సుఖంగావుందా లేదా ?''

"ఉండకేం, బాగానేవుందిలే. దానికధ చెప్పబోతే బోలెడంతుంది ''

"హయ్యో. అదేమిటో చెప్పుమరి''

"ఆ పాపిష్ఠి ముసలిదాన్ని హయ్యో అనవచ్చా ? ముసలిదైతే ఒక మూల పడివుండాలిగాని !''

"ఏంచేసిందేం ?''

''దొంగతనం చేసింది అబద్ధం చెప్పింది అడిగితే పేచీ ఊళ్ళోగిట్టని వాళ్ళతో మన వ్యాపార రహస్యం చెప్ప వచ్చా ? దాన్నుండి మీ నాన్నకు ఎంత డబ్బు నష్టమయిందీ ఏం కథ ! మీ నాన్న జైల్లో పడవలసింది తెలుసా ?'' అన్నది తల్లి పార్వతి

"నిజంగానా ? దొడ్డమ్మ అంతపని చేసిందా ?''

అనుమానంతో అడిగింది లలిత.



"ఎందుకోయ్ పులిని పెంచుతున్నావ్ ?"
"భార్య పోయిందికదూ, జ్ఞాపకార్థం పెంచుతున్నాను

పార్వతి గొంంతు చిన్నచేసుకొని- "ఇప్పుడు మీనాన్న ఒక కొత్తవ్యాపారం తలపెట్టారు. ఊళ్లో సారాయి నియమాలు వచ్చాక, సారాయి వ్యాపారం అంటే భలే లాభం డబ్బంటే చేదేమిటే ? ఈ గొడవ ఆ ముసలిముండకు దేనికి ? మనింట్లో సారాయి కాస్తారని చెప్పొచ్చా పరాయివాళ్ళతో ? చెప్పింది తిని మూల పడివుండక. నాన్నని పట్టుకొన్నారు"

"అలాగా ? అయినా నాన్నకు ఈ పని దేనికమ్మా ? గేదెలున్నాయి, ఆవులున్నాయి, తోటవుంది, పొలంవుంది పైగా వ్యాపారంవుంది. ఇంత లాభం చాలదూ ? బ్రాహ్మల్లో పుట్టి ఇంట్లో దొంగసారా...''

"చాల్లేనోర్మూయే. ఎంతోమంది శుద్ధ బ్రాహ్మలే పచ్చిసారా తాగుతూంటే ! మహా చెప్పొచ్చావ్, నువ్వు కూడాను. మనమేమన్నా అల్లా తాగుతామా ? ఏ పనిలో లాభంవస్తే ఆ పని చేస్తాం. అంతే ముసలిదానికి మనం పెట్టింది శుభ్రంగాతిని ఊరికే ఉండకూడదూ ? బుద్ధి చెప్పవస్తుంది బుద్ధి అకస్మాత్తుగా మొన్న పోలీసులువచ్చి ఇల్లు సోదాచేయాలన్నారు. తర్వాత ఎలాగో సర్దిపుచ్చామనుకో. మీ దొడ్డమ్మ మూలానే వాళ్ళకు తెలిసి వుంటుంది. అడిగితే వాళ్ళతో తను చెప్పలేదంటుంది...''

పార్వతి దొడ్డమ్మను గురించి ఇంకా చెప్పుకు పోయింది "ఇంకా అదిచేసే

చిల్లరమల్లర అల్లర్లకు అంతేలేదు, తనకు ఒళ్ళు బాగా లేదు, చోడిగంజి కావాలి అంటుంది కావలసినవన్నీ ఇస్తూనే వున్నాం అయినా కొంచెంపాలు నాకు తెలియకుండా దాచిపెట్టుంది అడిగితే నేను ఇవ్వనంటానా ? దానికేదో తలనొప్పి వస్తుందట, టీతాగాలట నన్నడిగి తాగ కూడదూ, ఎందుకీ దాగుడుమూత ? ఇక ఏకాదశి, అమావాస్య, శనివారాలు వస్తే అదివద్దు ఇదివద్దు, ఇదికావాలి అదికావాలి అంటూనే నా ప్రాణం తీస్తుంది పనిపాట్లు ఏమిచెయ్యదుకదా తెల్లారి లేచి నీళ్ళ పొయ్యికింద నిప్పుపెట్టూ కూచో అంటే కూచోదు కూచొంటే కాళ్ళ నొప్పిట పక్కింటికిపోయి కబుర్లాడ్తుంది అప్పుడు నొప్పిరాదు కామోసు, ఛి, ఛీ, దానిబెడద! ఒకటా రెండా ? మీనాన్న దాంతో మాట్లాడ్డమే మానుకున్నారు. మొన్న సారాకేసులో నష్టం కలిగించినపుడు కోపం ఆగక దాన్నిబాగా తిట్టిపోశారు 'అయ్యో నేనుపెంచి పెద్దచేసిన కొడుకే నన్ను ఇలా తిట్టాడు. ఇక నేను చచ్చి పోతాను' అని ఇరుగు పొరుగువారు వినే లాగా అరిచింది 'ఇప్పుడేవెళ్ళు' అని తరిమేశారు మీ నాన్న"

ఇలా దొడ్డమ్మ కథవింటున్న కొద్దీ లలిత మనస్సులో "ఇంతలావుండదు దొడ్డమ్మ అలా చేసివుండదు ఇంట్లో దొంగసారా కాచడం ఆచారవంతురాలైన దొడ్డమ్మకు కిట్టకపోవచ్చు బుద్ధిచెప్పి వుంటుంది వద్దని ఈ రహస్యం బైటికి పొక్కడం దొడ్డమ్మమూలంగాకాదు. తక్కిన విషయాలూ అంతే వీళ్ళు దొడ్డమ్మను బాగాచూసి వుండరు" అని తలపోసింది

"అలా అయితే అమ్మా, ఇప్పుడు దొడ్డమ్మ ఇంట్లోలేదా ? మరెక్కడుంది ? ఎక్కడపడి చచ్చిందో చెప్పమ్మా ?" అని ప్రతిమాలింది లలిత

"ఛస్తుందా ? అంతధైర్యమా ? రంగయ్యఇంటికిపోయి అక్కడే పడి వుందిలే వాడెన్నిరోజులు అన్నం పెడ్తాడూ ? మళ్ళీ కుక్కలా మనింటికే వచ్చిపడ్తుంది నిన్నకూడా రాత్రి వేళ మనింటిదాకావచ్చి ఒక ప్రదక్షిణ చేసి పోయిందట"

"పాపం ! మనింటిపై ఎంత పాశం చూశావా ? అమ్మా, నువ్వు దొడ్డమ్మ హృదయం ఎటువంటిదో తెలుసుకోలేదు. నాన్నా అంతే నాన్నకు డబ్బే ప్రధానం."

"చాల్లే మహా చెప్పవచ్చావ్ నువ్వేమో మహా ఎరిగినట్టు"

"అవునమ్మా, మీ ఇద్దరికన్నా నేను బాగా దాన్ని ఎరుగుదును అదికూడా నన్నే తలచుకొంటూ వుంటుంది రెక్క లుండివుంటే నన్ను చూట్టానికి ఎప్పుడో వచ్చివుండేది మీరు నా క్షేమ సమాచారం కూడా దానికి చెప్పటం లేదుకాబోలు"

అంటూ లలిత తండ్రినిచూసి "నాన్నా మీ రిప్పుడే పోయి దొడ్డమ్మని తీసుకురావాలి లేకపోతే దొడ్డమ్మను తీసుకురమ్మని రంగయ్యగారికి తంతి మణియార్డరు పంపిస్తా ఇకమీద దొడ్డమ్మ నా దగ్గరే ఉండాలి, అవును'' అన్నది

''పిచ్చిపిచ్చిగా వాగకు ఆ ముసలి దాంతో నీకేంపని''అని కసిరింది పార్వతి.

"అది పుట్టినప్పుడే ముసలిదనా? మనం ముసలాళ్ళు కాకుండా ఇలాగే వుంటామనా? పాపం, దొడ్డమ్మ బాగా వుండే రోజుల్లో బాగానే ఉపయోగించుకొన్నారు లే ఇప్పుడుదాన్ని పీడిస్తే దొడ్డమ్మ ఏ శాపమూ ఇవ్వదనుకో. కాని దేవుడు అంటూ ఒకడు ఉన్నాడాలేడా? తలిదండ్రుల పాపఫలం పిల్లల్లో ప్రతిఫలిస్తుందని పెద్దలు చెప్తారు దొడ్డమ్మలాగే నా గతి కావాలని మీరు కోరుకొంటారా? ఇప్పుడు మా ఆయన జబ్బులో పడి వున్నారు దేవుడికేం-కో పం వస్ ''

లలితకు గొంతు పెగలక, కళ్ళమ్మట నీళ్ళు బొటబొట రాలాయి

పార్వతి చటక్కున లలితనోటికి చెయ్యి అడ్డుపెట్టింది

* * *

జట్కాబండి ఒకటి వచ్చి మర్నాడు, ఇంటి ముందు నిలిచింది

లలిత తొంగి చూసింది

"లలితా—" గద్గద కంఠంతోపిలుస్తూ కొంచెం కంపిస్తూ దొడ్డమ్మ లోపలికి వచ్చింది దొడ్డమ్మ వెనుకే రంగయ్యకూడా!

ఆవునుమాసి పరిగెత్తేలేగలా లలిత పరిగెత్తి దొడ్డమ్మ కాళ్ళల్లోపడి లేచి చేయి పట్టుకొంది

దొడ్డమ్మ వచ్చిన వివరాలు తర్వాత తెలిశాయి, అవేమంటే,

పేరయ్య ఇంటినుండి తరిమినా వచ్చిపోయే ఉద్దేశం దొడ్డమ్మకు లేనే లేదు ఆత్మహత్య పాపమని దానికి బాగా తెలుసు రంగయ్య ఇంటవున్నా పేరయ్యను వదలటానికి దొడ్డమ్మకు సాధ్యంకాలేదు చీకటిపడ్డాక రోజూ ఇంటిదగ్గరకు వచ్చి ఒక ప్రదక్షిణ చేసి పోయేదిట మొన్న లలిత ఇచ్చిన టెలిగ్రాం అందినప్పుడు పేరయ్యా, పార్వతీ గాబరాతో మాట్లాడుకొన్న కొన్ని మాటలు ఇంట్లో విన్నవాళ్ళ మూలాన దొడ్డమ్మ చెవిలోపడ్డాయి. పండక్కి వస్తుందనుకొన్న లలిత రాదని తెలిసింది పార్వతీ పేరయ్యా బయల్దేరిపోయారని తెలిసి దొడ్డమ్మ దిగులుపడి ఊరికే ఉండలేక పోయింది లలిత అంటే దొడ్డమ్మకు ప్రాణం వెంటనే రంగయ్యతో చెప్పి, తన వేలిఉంగరం తాకట్టు పెట్టించి 60 రూపాయలు పోగుచేసుకొని రంగయ్య వెంట బయల్దేరి రైలెక్కి వచ్చేసింది

లలిత అనుకొన్నట్టు దొడ్డమ్మ ఆశీర్వాదం పండక్కి దొరకనేదొరికింది ★

# బంధించిన దరిద్రం

పాతూరి ప్రసన్నం



పై కప్పు అక్కడక్కడ వూడిపోవటం వల్ల యేర్పడ్డ కంతల్లోనుంచి ఆ పూరికొంపలోకి ఎండ తొంగి చూస్తోంది నేలమీద తెల్లరంగు మరకలు వేసింది సూర్యకాంతి

ఎండా వానా నిరాఘాటంగా వస్తూ పోతూ వుంటాయి ఆ కొంపలోకి ఇద్దరుండటానిక్కూడా చాలీ చాలని ఆ కొంపలో ఒకమూల పొయ్యి విసుర్తూ అన్నంవండుతోందిరత్తి చవకరకం మట్టిఎడతల్లోని వంకాయ యిగురు పగిలినకుండపెంకులోపెట్టిన పచ్చడీ వేసుకుని చారువేసి ఇన్నిగింజలు వుడకేసి ఇంత సుబ్బయ్యమావముఖాన రాల్చి తనూ రెండుమెతుకులు నోట్లో వేసుకుంటే – తర్వాత చెయ్యాల్సిన పని చూసుకోవచ్చు అనుకుంటూ వొళ్ళు విరుచుకుంది బద్ధకంగా రత్తి

ఇంటి నిట్టాడి స్తంభం వోరగా వొంగిపోయి కూలిపోతున్న మనుషుల జీవితాల్ని సూచిస్తోంది సాంకేతికంగా

ఎత్తుగా మట్టిదిన్నెమీద రెండు ట్రంకుపెట్టె లున్నాయి ఒకటి మూలలు సొట్టపడి మూత వంకరపోయి కొక్కెం వూడిపోయివుంది ఒకటి బాగానే వుంది ఒకప్రక్క చింకిచాపమీద సుబ్బడుకూర్చుని వున్నాడు అతని వెనుకనే నిలబెట్టివున్న కుక్కిమంచం ఇవీ ఆ కొంపలోని వస్తువులు

పొయ్యి మండటంలేదు జబ్బులు పొయ్యేట్టుగా ఎంత విసిరినా కళ్ళు మండేట్టుగా పొగరావటంతప్ప మండటం లేదు సగంవిరిగిన విసనికర్రను విసురుగా నేలమీద గిరాటేసి తీవ్రంగా సుబ్బడువంక చూసింది

పాడుకొంపలూ పాడు మనుషులూ! అబ్బబ్బ? వూపిరిపీల్చుకోటం కూడా కష్టంగావుంది ఒక్కసారి అటుపోయి రంగన్న మావ కొంప నూడు అడ్డి నూసయినా గానం తెచ్చుకోవాల! వొచ్చేది వానాకాలం గందా ఇంటికి ఆక్కప్పం చొద్దూ! మొండికేసిన మొద్దులాగా కూకుంటేసరి! రంగన్నే నయం పెళ్లానికి గొలుసుకూడా కొన్నాట్ట – ఇదుగో సుబ్బయ్యమావా! ఈరకంగా ఇంటి గొడవ పట్టించుకోకుంటే నాదోవ నే జూసుకుంటా! రత్తిలేచి తన పెట్టె దగ్గరకు నడిచింది

చామనచాయరంగు ముఖంమీద ముసురుకున్న ముంగురుల్ని వెనక్కి సద్దుకుంటూ తన చీరల్ని రయికల్ని ఒకపెట్టిలో సద్దింది

గయితే ఎల్లిపోతానంటవా రత్తీ! జాలిగా భయంగా చూస్తూ గొణిగాడు సుబ్బడు సగంకాలిన బీడీని నేలమీద రాచి ఆర్పాడు

అవతల అన్నం పొంగి మెతుకులు పొయ్యిలో పడుతున్నాయి సుబ్బడి

ప్రశ్నకి సమాధానం ఇవ్వకుండానే గబ గబా కొయ్యతెడ్డుతో అన్నాన్ని కలియ బెట్టి, నిప్పు సరిచేసి పొయ్యిముందు కూల బడింది

"ఎల్లిపోతానంటావా రత్తీ! నన్నిడిచి ఎల్లిపోతావా!'' ఈసారి అతని గొంతుక జీరపోయింది తనముఖంలోని ఆవేదన కనిపించనీకుండా తల వొంచుకు కూర్చున్నాడు

''ఆ, తప్పకుండా లేచిపోతా చెప్పి మరీ లేచిపోతున్నా నన్నేమన్నా అడ్డు పెట్టగలవా చెప్పు!" కోపంగా ప్రశ్నించింది

వర్షాకాలంలో వరదలుగా ప్రవహించే నదినీటిని ఎవరన్నా ఆపగలరా? — అలాగే రత్తిని ఆపటంకూడా ఎవ్వరికీ సాధ్యంకానిపని అని సుబ్బడుకి తెల్సు!

రత్తి తనజీవితంలో కలిసిపోయి యింకా ఆరునెలలు కాలేదు సర్వనాశనం కానున్న తన జీవితంలో ఆశలు రేకెత్తించి ఇకా ఆరు నెలలు కాలేదు. దరిద్రంతో నికృష్టంగా వెళ్తున్న రోజుల్ని సంతృప్తితో నింపివేసిన రత్తి వెళ్ళి పోతోంది!

ఆర్నెల్లకు ముందు తానెవరో రత్తి ఎవరో!

రత్తి తనకు మూడో పెళ్ళాం!

మొదటి పెళ్ళాం రోగంతో చచ్చింది

రెండో పెళ్ళాం కాన్పులో పిల్లాడితో సహా చచ్చింది

రత్తి మూడోది! — ముత్యంలాంటి, రత్నంలాటి రత్తి!

రత్తిని గురించి సుబ్బడి కేమీ తెలీదు! రత్తీ చెప్పలేదు

చెడిబతికిందని, ఎవరో అంటే విన్నాడు అలాటి రత్తి ఇలా ఎందుకు వచ్చిందో, తననే ఎందుకు పెళ్ళిచేసు కుందో సుబ్బడుమావకు తెలీకపోయినా ''రత్తి నా భార్య!'' అనుకుని సంతృప్తి పడ్డాడు

అలాటి రత్తి వెళ్ళిపోతోంది!

అవును వెళ్ళక ఏం చేస్తుంది? తన దరిద్రంతో తలమొత్తింది ఆమెకు! ఈ నరకాన్ని అనుభవించలేక మళ్ళీ ఎలా వొచ్చిందో అలానే రెక్కలతో ఎగిరి పోతుంది!

వొళ్ళు జలదరించింది సుబ్బడు మావకు! లక్ష్మీదేవి వెళ్ళిపోతున్నట్లుగా కలవరిస్తున్నాడు

''గయితే ఎల్తానంటావా!'' జాలిగా భయంగా గొణిగాడు

"ఎళ్తాను, ఎళ్తాను, ఎళ్తాను. రేపు పొద్దుగాల బండీలోనే ఎళ్తుండాను సరేనా!'' అంది ఈర్ష్యగా రత్తి సుబ్బడంటే అసహ్యం కలుగుతోంది రత్తికి

సుబ్బడుకళ్ళలో నీళ్ళు చూసింది రత్తి

"రెబ్బొద్దుగాల, రెబ్బొద్దుగాల..." అనుకుంటూ సుబ్బడు అమాంతంగా లేచి సుడిగాలిలా వీధినపడ్డాడు. వీధి మలుపులో రోడ్డుమీద దుమ్ములో కనిపించకుండా పొయ్యాడు

"మావా! సుబ్బడు మావా! అన్నం తినిపో, అన్నంతినిపో!''

ఎలుగెత్తి పిలిచినా లాభం లేక పోయింది.

''పిచ్చి మడిసి.

నేను ఎల్తున్నానని నిజంగా నే పిచ్చెత్తింది!

కాదు —

బతకలేక, బతకటం చేతకాక, ఏ కారుకిందోపడి చచ్చిపోదామని పోతుండాడు' — గయితే నేను రాకముందు ఎలా బతికాడు, నేనుపోతే ఎందుకు బతకలేడు నేనేమన్నా సంపాయించి పెడుతుండానా?

కాదు —

కనిపించకుండా ఎక్కడికో పారిపోతుండాడు. డబ్బుతో పడిచచ్చే పెపంచం వొదిలి ఏ అడివిలోకో పడిపోతుండాడు"

రకరకాలుగా ఆలోచించింది రత్తి

చుట్టూ కలయ చూసింది'

తన కొంప ప్రక్కగా కంపు కొడుతున్నది మురిక్కాలవ.

అందులో పందులు అసహ్యంగా దొర్లుతున్నాయి

ఈ మురికి పేట నిండా ఈగలు, దోమలు

అన్నీ కూలిపోతున్న గుడిసెలు.

వాటిని నిలబెట్టుకోటానికి కూడ గతిలేని దౌర్భాగ్యపు సంసారాలు!

కండలు పిండీ, ఎముకలు విరిచీ, నరాలు తెంచీ చచ్చేరీతిగా చాకిరి చేసుకున్నా కడుపునిండని జీవితాలు

పాలుచాలక యేడ్చే పసికందులు

చద్దిబువ్వలేక ఆకలితో అలమటించే చిన్నపిల్లలు,

"సంసారాన్ని పోషించాలి'" ఇది మొగాడి గొడవ!

"చంటిదానికి కాసిన పాలన్నాపోసి బతికించాలి" ఇది ఆడదాని ఘోష

రంపపుకోత పెడుతోంది బతుకు మనస్సు విరిగింది మానం, అభిమానం చచ్చింది నాలుగణాలు కావాలి! కామంతో కళ్ళు మూసుకు పోయిన నరపశువుకు శరీర సర్వస్వాన్ని ఆహుతి చేసింది ఒక ఆడది'

—పుట్టినందుకు చావకుండా బతకొద్దూ మరి—

రత్తికి కళ్ళు తిరిగినై విసిరి వేసినట్లుగా వీధిలోంచి కొంపలోకి పడిపోయింది నేలమీద పడుకుని చాలా సేపు ఏడ్చింది రత్తి

గడిచిన బ్రతుకంతా రత్తి కళ్ళముందు సినిమాలాగా కదిలింది

నీతి నియమాలకు స్వస్తిచెప్పి భోగాల్లో, విలాసాల్లో జీవితాన్ని పెట్రో

ల్లాగా వెలిగించటం, కుళ్ళి కృశించి నశించి పోకముందే ఆ కాగితంపువ్వు ళ్ళాటి బతుకుమీద రోతపుట్టటం, అనాధ లాగా మురికిపేట రావటం, సుబ్బడు మావ సరసన చేరటం!

ఆనాటిఅన్యాయండబ్బులోసుఖంలేదు
ఈనాటి దరిద్రంతో యాతనపడలేదు
రత్తికి కునుకు పట్టింది.

*　　*　　*

చీకటి పడింది.

రాత్రి 'వేట'కోసం రోడ్డు పక్కన విలాసాలు చిందిస్తూ, చవకబారు శృంగారంతో నాలుగురాళ్ళు చేతుల్లో వేసుకోటానికి నైలాను ముసుగుల్లో, గాజులు గలగల్లాడిస్తూ, వెర్రినవ్వుతో కవ్విస్తూ మురికిపేటలోంచి నగరంలోకి నడుస్తున్నారు ఇద్దరు యువతులు.

—జీవితం!—

కల్లుముంతలు ఖాళీ అయి పోతున్నాయి.

— జీవితం —

ఐశ్వర్యంతో విరక్తిచెందినప్రాణి రత్తి దరిద్రంలో నలిగిపోయి తల్లడిల్లి పోతున్నజీవి రత్తి

అలాటి రత్తి చచ్చిపోయింది.

స్వర్గంలో సుఖాన్నీ, నరకంలో బాధనీ అనుభవించి తెలుసుకోవాలి. రత్తి ఆత్మ విశ్వంలో వెతుకుతోంది స్వర్గ నర కాల్ని రెంటినీ.

"రత్తీ!" — పెద్దగా వినిపించిన అరుపుతో వులికిపడి ఆలోచనల అంతస్థు ల్నుంచి తేలుకుంది రత్తి.

"నన్నిడిచి ఎళ్ళిపోతావా రత్తీ ఎళ్ళిపోతావా రత్తీ!" సుబ్బడు రత్తి కాళ్ళమీదపడి యేడుస్తున్నాడు పుల్లటి కంపు కొడుతోంది—వాడి నోరు. పూరాగా తాగటంవల్ల కొరివిదయ్యాల్లాగా మెరు స్తున్నాయి, జేవురించిన వాడి కళ్ళు.

"ఎళ్తున్నావా రత్తీ!" — వాడి గొంతు పగిలిపోతోంది

అతని ముఖంలోకీ, బయట చీకటి లోకీ చూస్తోంది రత్తి.

"రత్తీ! ఎళ్ళిపోతున్నావు కాదూ, ఎళ్ళిపో! నిన్ను ఆపే సేబలం నా దగ్గర లేదు కానీ నువ్వులేనినాడు నాగతి ఎలా వుంటుందో ఆలోసించి మరీ, ఎళ్ళు. ఎన్నడయినా నేను గుర్తుకొత్తే ..సుబ్బడు మావ తాగుతూ, జేబులుకొడుతూ దొంగ తనం చేత్తూ, కూనీలుచేత్తూ చివరికి ఏ జైలులోనో చచ్చాడని...అనుకో!

"ఇంతవరకూ నేను మంచోడ్ని కాదు చెడ్డోడ్నీ కాదు. బద్దకస్తుడ్ని. కొత్తంత తాగటం తప్ప నేం చేసిన పాపం లేదు. నా తాగుడు చూసీ, నా బద్దకం చూసీ అసయ్యంచుకుంటావు నువ్వు. కానీ తాగక చేసేదేంటి. తల బద్దలై పోతాంది. బతకటానికి డబ్బు కావాలి సంపాయించలేను. మంచి యిల్లు

కావాలి. కట్టుకోలేను. నీ సంతోసంకోసం నగలూ, నట్రా చేయించాలి కానీ ఎలా తేవటం? మరి ఎందుకు బతకటం... చూస్తూ చూస్తూ ఎలా చావటం! పాపిష్టి డబ్బు కోసం కూనీలు చేయటానికి చేతులు రావు దొంగతనం చెయ్యాలంటే మనస్కొప్పదు నా ఆలోసెనల్తో బుర్ర ఏడెక్కి, నిప్పుకొండలాగా బద్దలైపో తందనే బయంతోనే ఈ తాగుడుకు అల వాటు పడ్డా ... కానీ నువ్వు ఎళ్ళిపో తున్నావు...ఇహ వొంటిరిగా శాంతంగా బతకటం నా చాతగాదు...

''రత్తీ! నీ మీద ఎన్నెన్ని ఆశలు పెట్టుకున్నానో తెల్సా! ఈ తాగుడు నీ కోసం మానేసి, ఇద్దరం కలిసి కాయ కష్టం చేసుకుంటూ బతికినంత కాలం బతకాలనే అనుకున్నాను. నువ్వు ఎళ్ళి పోతున్నావు' ఈ దరిద్రుడి మీద దేవుడికే దయ లేనప్పుడు నీకు మాత్రం జాలెందుకు? నిన్ను సుకపెట్టటానికి ఈ దరిద్రుని దగ్గర ఏవుంది! రత్తీ' మరిసేపోయాను. నీ గాజుల జత కూడా తాకట్టుపెట్టి తాగాను కాదూ' నీ రుణం నా కొద్దు. ఇప్పుడే పోయి ఆడి తల పగలగొట్టయినా నీ గాజుల జత నీ కిచ్చే త్తాను " అంటూ ఆవేశంతో పిచ్చివాడి లాగా సుబ్బడు పరుగెత్తబోయాడు.

"ఆగు, సుబ్బడుమావా!'' గట్టిగా అతనితిచేయి పట్టుకుంది రత్తి

"మరిఎళ్ళే సమయంలో నీకేంబగు మానం యిత్తానుచెప్పు, నాదగ్గిర నయా పైసకు కూడా ఇప్పుడు గతిలేదు...నా చెయ్యిఒదులు...నీ రుణం నాకొద్దు! నీ గాజులుజత తీసుకురావాల'' సుబ్బడు ఆవేశంతో వూగిపోతున్నాడు. కానీ వాడి ప్రయత్నం విఫలం అయింది రత్తి పట్టుతో.

"వొదిలిపెట్టు రత్తీ!" గర్జించాడు.

"నాకా గాజులు అక్కర్లేదు." నిండుగా పలికింది రత్తి.

"మరి నాదగ్గిర డబ్బులేదనిచెప్పాగా" దీనంగా అన్నాడు సుబ్బడు.

"నీ డబ్బుతో సంబంధంలేదు నాకు"

"ఏమీ తీసుకోకుండానే పొద్దుగాల ఎళ్ళిపోతావా'"

"ఎక్కడికీ ఎల్లటంలేదు మావా' నే నెక్కడికీ పోటంలేదు. నీ దరిద్రం తోనే నేను కాపురంచేత్తాను.''

సుబ్బడు కనుల్లో నీరు వుబికింది

"నిన్నొక మడిసిని చెయ్యాలి మావా!'' తీయగా అందిరత్తి!

"రత్తి! నారత్తీ?'' గుండెకు గట్టిగా అదుముకున్నాడు.

రత్తి పెదవులమీద వెలసిన చిరు నవ్వు రేఖ ఆయింటిలో వెలిగించింది ఆశాదీపాల్ని'

రత్తి కన్నులనుంచి రాలిన ఒక కన్నీటి బొట్టుతో ఆయింటిలో పేరుకున్న దరిద్రం కరిగిపోయింది. 

# చక్రనేమి



"ఏడు కొండలవాడా గోవిందా, వడ్డీకాసులవాడా గోవిందా! శ్రీనివాసా గోవిందా, వెంకటరమణా గోవిందా! భక్తుల ప్రణామ వాక్యాలతో గోవింద స్మరణతో తిరుమల గిరులు ప్రతిధ్వనిస్తున్నాయి. ప్రయాణీకులతో నిండుగావున్న బస్సులూ బళ్లూ కార్లూ కొండల నధిరోహిస్తూ అవరోహిస్తూ పరుగు లిడుతున్నాయి. చట్టు పై పొగమంచుతో కప్పబడిన కొండలు ఇనుమడించిన హుందాతనంతో గర్వంగా నిలచి నట్లున్నాయి. నానావిధ

"వెళ్ళవచ్చునులెండి. తొందరేం? మాతో రండి ఆలయానికి." అంది బిందు.

"అవును, రండి. దేవుడిని ఎన్ని సార్లయినా దర్శించవచ్చు." అన్నాడు అనంతయ్య నవ్వుతూ

చక్రపాణి కూడ నవ్వాడు "క్షమించండి నాతో మరికొందరు విద్యార్థులు కూడ వచ్చివున్నారు, నాకోసం చూస్తుంటారు. మన ఊళ్ళో తప్పక మీ దర్శనం చేసుకుంటానుగా?"

"అయితే మీ యిష్టం మరి, సెలవు" అయిష్టంగానే అంగీకరించాడు అనంతయ్య

"నమస్కారం!"

"నమస్కారం!"

## 2

మధ్యాహ్నం మూడు గంటలకు ఆళ్వార్ టాంక్ ఒడ్డున పరధ్యానంగా నడుస్తూన్న చక్రపాణి ప్రక్కనే హడ్సన్ ఆగడంతో వులికిపాటుతో చూచాడు

"గుడీవినింగ్ సార్", అంది ..ంజను ఆపకుండానే మాధవి స్టీరింగు దగ్గర్నుంచి

"గుడీవినింగ్," అన్నాడు చక్రపాణి

"ఉదయం తొందరపడి వెళ్ళిపోయారు. మరింకా కొండ మీద నే వున్నారే!"

"రాత్రి ఏడుగంటల బస్సులో వెళి పోతాను"

"అయితే రండి కారెక్కండి

ఆశ్చర్యపోయాడు పాణి "ఎంద అనడిగాడు కనుబొమలు ముడి 'కార్లో మాధవి ఒక్కతె మి.. మరెవరూ లేరు ఇంత ధైర్యంగా రమ్మంటుం దేమిటి?'

"ఒక మంచి చోటికి వెళ్తున్నాను రండీ". అంది మాధవి తిరిగి.

"క్షమించండి. నాకింకా పనుంది. మీరు వెళ్ళండి."

"ఊఁ," నిష్ఠురంగా మూలిగి ఇంజను ఆపేసి తలుపు తీసుకు దిగింది మాధవి "ఏమిటా పని?" అంది పాణి ముఖం లోకి సూటిగా చూస్తూ

"బాగుంది మీ ప్రశ్న అయినా మీతో నేనెందుకు చెప్పండి? వెళ్ళిరండి అన్నాడు చక్రపాణి ముందుకు సాగుతు

మాధవి వదలిపెట్టలేదు. కారు లాక్ చే తాళాలు చేతికి తీసుకుని అతడితోపాటే నడవసాగింది "ఎంత మంచి సంగతో తెలుసా, నేను మీకు చెప్పబోయేది? అది వినగానే ఇంతవరకూ రానన్న మీరే ఎగిరి గంతేసి ఒప్పుకుని వస్తారు." అంది చిలిపిగా నవ్వుతూ

ఆ అమ్మాయి అతి చనువుకూ ...వకూ ఆశ్చర్యంగానూ, సంకోచంగాను కూడ వుంది పాణికి. 'విద్యార్థు లెవరైన

గా స్తే ఏమనుకుంటారు ?' అనే భయం
గోలోన పీడిస్తోంది అతడికి. ఆ
కి మాత్రం అటువంటి పట్టింపు
వున్నట్టు కన్పించడంలేదు

ఏమిటంత విశేషం ?" కుతూహలం
గ న అడిగాడు

'చెప్పుకోండి చూద్దాం !" విశాల నేత్రాలను అందంగా త్రిప్పింది మాధవి. కొంచంసేపు ఆలోచిస్తున్నట్టు ఆకసం దెస దృష్టి సారించాడు చక్రపాణి.

'ఈ కొండమీదంతా కారులో తిరిగి చూస్తారనుకుంటాను ?" అన్నాడు

లక్ష్యంగా నవ్వింది మాధవి. ఆ పని ఎప్పుడో చేసేశాను మరొక్క ఛాన్సు యిస్తున్నాను చెప్పుకోండి !''

'నా వల్లకాదు మీరే చెప్పండి,''
న్నాడు పాణి చిరునవ్వుతో

"కొండకు ఆచివర్న హిందీ
యాక్టర్స్ వచ్చివున్నారు యాక్టర్స్
టే మళ్ళీ ఎవరనుకున్నారు ? 'టాప్ మోస్ట్ !' ఇప్పుడు ఫిల్మ్ షూటింగు వుందట, చూద్దాం నడవండి,'' చెప్పడం ముగించి, నొసలు చిట్లించి చూచింది అతడివేపు ఎగిరి గంతేస్తాడనుకున్న అతడిలో ఏ చలనమూలేదు. నిర్వికారంగా నిలబడివున్న అతడిని కొంత ఆశ్చర్యంగా, కొంత విసుగ్గా చూస్తూ అడిగింది "మీకు సంతోషంగా లేదూ? రండి, అటువంటివాళ్ళను మళ్ళీ చూడగలమా ? మీకు చూడాలని లేదూ ?''

బాల్యచాపల్యం వీడని ఆ అమాయక వదనంలోనికి చూస్తూ మధురంగా నవ్వాడు చక్రపాణి ''తప్పక చూడాలంటారు ?''

''అయ్యో, కాదామరి ? మళ్ళీ ఇటువంటి అవకాశం కలుగవద్దూ ?''

''అవును, వెళ్ళండి మరి, టైము దాటిపోతూంది "

''మీకు చూడాలని లేదూ ?'' వదనంలోనూ, కంఠస్వరంలోనూ నిరుత్సాహం ప్రస్ఫుటమైంది.

''ఏమిటంత విశేషం చెప్పండి వాళ్ళూ మనబోటి మానవులేగా ? కాకుంటే తెరమీద కాస్త కంటికి నదురుగా కన్పిస్తారు విభిన్నమైన, రకరకాల ఆదర్శవంతమైన పాత్రలలో కదలుతూ మనను భ్రమింపజేస్తారు కాని వారికీ ఒక మనస్సూ, ప్రత్యేక వ్యక్తిత్వమూ, అభిప్రాయాలూ, సాధారణ మానవత్వమూ వుంటాయి. ఆ నటనా, వేషధారణా వారికొక ఉద్యోగం–అంతే వాటిని చూచి మనం భ్రమసిపోవడం దేనికీ ?''

"అయితే ఆర్టిస్టులను చూడాలని మీకుండదూ ?''

''ఎందుకుండదూ ? ఉంటుంది కాని

# కోడూరి కౌసల్యాదేవి

నవవికసిత పుష్పపరిమళముదాల్చిన ప్రభాత శీతలవాతం పర్వతశ్రేణులపై, ఆలయ గోపురాగ్రములపై వీస్తూ సుషుప్తినుండి మేల్కాంచిన లోకానికి ఆమోదకారణ మగుతున్నది వృక్షముల నుండి. పొదలనుండి పక్షుల మనోహర గానములు వినవస్తున్నాయి. తూరుపు తెల్లవారింది. ఆకసాన రాగరేఖలు అందంగా పరచుకున్నాయి. ఆలయం నుండి మంగళతూర్యాలు మనోరంజకంగా వినవస్తున్నాయి గిరులపై హేమంతశోభ అందంగా చిందులువేస్తూంది

సాంజలి బంధుడై, తన కిష్టదైవమైన శ్రీ వేంకటేశుని దర్శనాభిలాషతో ఆలయం ప్రవేశించాడు చక్రపాణి. ప్రాంగణమూ, మండపాలూ అధిగమించి. జయవిజయులు కావలికాస్తూన్న బంగరు ద్వారాన్ని దాటి ఆ కల్యాణరూపుని సమక్షం జేరుకున్నాడు శుక్రవారం. స్వామి నిండు అలంకరణలో జగదేక మోహనుడై దేదీప్యమానంగా ప్రకాశిస్తున్నాడు. సుకుమార శ్వేత దుకూలాంబరాలతో, వజ్రకిరీటం. శంఖ చక్రాలు ధరించి పైకుంఠ హస్తంతో గంభీరంగా నిలబడిన ఆ మూర్తిని తిలకించ వెయ్యినేత్రాలుకూడ చాలవు ఎంత చూచినా తనివితీరదు

దర్శనానంతరం ఈవలకు వచ్చి బంగారురేకుతో కప్పబడిన ఆనంద విమాన సౌందర్యాన్ని అవలోకించి. ప్రసాదం స్వీకరించి, ఆలయ ప్రాంగణపు మండపంలో స్వామి వారి వివిధావతార విగ్రహాలు, వాహనాలు చూచి మెల్లగా ఆలయం వదలి ఈవలకు వచ్చాడు బయట వదలిన పాదరక్షలు తీసు



కుని మఫ్లరు చెవులకు గట్టిగా బిగించి నడక సాగించాడు

క్రమంగా మంచుతెరలను పారద్రోలుతూ సూర్యకిరణాలు భూమిమీద పరచుకుంటున్నాయి ప్రొద్దు ఎక్కిన కొలదీ భక్తజనసందోహాలు కలకలమూ అధికమయ్యాయి ఆలయం దగ్గర ఆలయం ముంగిట నిలబడిన స్వామివారి వాహనమైన కరిరాజుకు అణా అణా ముడుపు చెల్లించి ఆశీర్వాదం పొందుతున్నారు కొందరు తొండమెత్తి భక్తుని శిరస్సు నిమురుతుందా ఏనుగు - అదే ఆశీర్వాదం ! రెండు నిమిషాలకాలం అక్కడ నిలబడి ఆ వేడుక తిలకించి తిరిగి నడక సాగించాడు చక్రపాణి

నవోదిత బాలాతపమున ధగధగ మెరుస్తూన్న వృక్షలతాదుల దళాలను కొమ్మ కొమ్మను కిలకిల లాడుతున్న పక్షులను కిచకిచమనే మర్కట సమూహాల్నీ సూర్యరశ్మిలో సుందరంగా కనపడుతూన్న పర్వతసానువులపై చిందులు వేస్తూన్న ప్రభాత శోభనూ ముగ్ధుడై చూస్తూ తనకు తెలియకుండానే జనాకీర్ణతకు దూరంగా వెళ్ళిపోయాడు చక్రపాణి నల్వంకల పర్వతాలపై పర్వతాలు దూరాన నీరెండలో శోభాయమానంగా నిలచిన ఆలయ గోపురమూ కట్టడాలూనయనానందకరంగావున్నాయి దూరానికికూడా స్పష్టంగా వినవస్తూన్న భక్తుల నినాదాలు ఘంటికా మ్రోతలు వీనుల విందుగా ఉన్నాయి నాసికాపుటాలను సున్నితంగా జేరుతున్న నానా పుష్ప-మూలికా సుగంధసమేత మలయ మారుతంతో మది పులకితమౌతున్నది గంధపుచెట్టుక్రింద ప్రమాను నాను కూర్చుని తన్మయావస్థకు లోబడిన అతడు వందనం మాష్టారూ అనే సన్నని కంఠం విన్పించడంతో జాగ్రదావస్థపొంది తల త్రిప్పి చూచాడు

కండ్లకు చలువద్దాలు తలపైనుండి చెవులమీదుగా చుబుకం క్రిందకుతెచ్చి అందంగా ముడివైచిన లేగులాబి వర్ణపు ఉన్ని రుమాలు రక్తవర్ణపు ఉన్ని దుస్తులలో బంగారంలా మెరసిపోతున్న నాజూకు తనూవల్లరి మృణాళహస్త ద్వయంలో సున్నిహితంగా నలుగుతున్న వానిటీ బాగ్ - ఎవ్వరీ జవ్వని ? విస్మయ దృక్కులతో విచలిత హృదయంతో చూస్తూన్న అతడి సందిగ్ధతను కనిపెట్టినట్లు ఆమె నన్ను గుర్తించలేదా మాష్టారూ ? అంది చిరునవ్వుతో.

అక్కడే కొద్దిదూరంలో కూర్చుంటూ చలిగాలినుండి స్వశరీర రక్షణార్థమై చెవులకు ఆచ్ఛాదితంగా కట్టిన రుమాలునూ కండ్లకు ధరించిన నల్లద్దాలనూ తీసివేసింది భావయుక్తమైన చిరునవ్వు నవ్వింది ఇప్పుడు తెలిసిందా అన్నట్టు ఆ సౌందర్యరాశిని అనిమేష